



ముఖచిత్రం : అగ్నిమాలా విజయం

చిత్రకారుడు : **వడ్డాది పాపయ్య**


యువ సాలుచందా రూ. 36-00

దీపావళి సంచికతో రూ. 42-00

యువ, హైదరాబాదు-500001.

# యువ ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అరుణోదయం | (నవల) | కొ. కుటుంబరావు | 2-00 |
| 2 | మారుపేర్లు | ,, | ,, | 2-00 |
| 3. | కులంలేని మనిషి | ,, | ,, | 2-00 |
| 4 | గడ్డు రోజులు | ,, | ,, | 2-50 |
| 5. | నీకేం కావాలి | ,, | ,, | 2-00 |
| 6 | నిలవ నీరు | (కథలు) | ,, | 2-00 |
| 7 | కాలభైరవుడు | ,, | , | 2-00 |
| 8. | వరప్రసాదం | ,, | | 2-00 |
| 9 | మొండివాడు | ,, | ,, | 2-00 |
| 10. | శిథిలాలయం | (నవల) | గోపీచంద్ | 2-50 |
| 11 | అర్థమున్న కథలు | (కథలు) | అవసరాల రామకృష్ణారావు | 2-50 |
| 12. | కరుణ | (నవల) | రవీంద్రనాథ్ ఠాకూర్ | 2-00 |
| 13. | వీరఛత్రసాల్ | (సంక్షిప్త నవల) | | 2-50 |
| 14 | మాధవీ కంకణం | ,, | | 2-50 |
| 15. | రాజసింహ | ,, | | 2-50 |

| | | | |
|---|---|---|---|
| 16. | కుంకుమభరిణ (సంక్షిప్త నవల) | | 2-50 |
| 17. | ఆనంద మఠం | ,, | 2-50 |
| 18. | కపాల కుండల | ,, | 2-50 |
| 19. | గోరా | , | 3-00 |
| 20 | మాయావి | ,, | 3-00 |
| 21. | సీతారామ్ | ,, | 2-50 |

పది కాపీలకు తక్కువ కాకుండా సొమ్ము ముందుగా పంపినవారికి ఖర్చులు మేమే భరించి పుస్తకాలు పంపుతాము. యువ ఏజంట్లకు 30% కమీషన్ ఇవ్వబడుతుంది. కావలసిన కాపీలకు కమీషన్ మినహాయించుకుని డబ్బు ముందుగా పంపవలసిందిగా ఏజంట్లను కోరుతున్నాము.

**యువ పబ్లికేషన్స్,**
హైదరాబాద్ - 500 001.

# రచయిత్రు(త)లకు మనవి

చిన్ననవలల రచనలో రచయిత్రులకూ, రచయితలకూ ఇతోధికంగా ప్రోత్సాహాన్ని ఇచ్చే ఉద్దేశ్యంతో-మంచి నవలలను ఆహ్వానిస్తున్నాము.

కింది విషయాలను దృష్టిలో ఉంచుకొని రచయితలూ, రచయిత్రులూ తమ రచనలను పంపి, సహకరించగోరుతున్నాము.

1 చిన్న నవల ఫుల్‌స్కేప్ సైజులో 60-70 పేజీలు మించరాదు.

2. ఇతివృత్తం తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.

3. జీవితంలో ఆశావాదానికి (optimism) ప్రాముఖ్యమిచ్చే రచనలకు ప్రాధాన్య మివ్వడం జరుగుతుంది.

4. ప్రచురణార్హం కాని రచనలను తిరిగి పొందగోరే వారు తగినన్ని తపాలా బిళ్ళలు అంటించిన కవర్లను రచనలతోపాటు జతపర్చాలి,

5 అనువాదాలు, అనుకరణలు పనికిరావు, రచన తమ సొంతదేనని హామీ పత్రాన్ని రచనతోపాటు జతపర్చాలి.

సంపాదకుడు

యువ




సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 32 డిశంబరు, 1975 సంచిక 6

ఆంధ్రప్రదేశ్‌లోని అనేక చిన్న ఆహారమండలాలను రద్దుచేస్తూ, రాష్ట్రం అంతటినీ ఒకే ఆహారమండలంగా ఏర్పాటుచేస్తూ, రాష్ట్రప్రభుత్వం ఉత్తరువులను జారీచేసింది. ఇది సంతోషించదగిన విషయం. ఈ ఉత్తరువును జారీచేసినందుకు ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావును అభినందిస్తున్నాము.

రాష్ట్రం అంతా ఒకే ఆహారమండల మైనందువల్ల, రాష్ట్రంలో ఎక్కువ పంటపండిన జిల్లాలనుంచి ధాన్యం, తక్కువ పంటపండిన జిల్లాలకు నిరాటంకంగా సరఫరా అవుతుంది. అదనపు పంటవున్న జిల్లాలలోని ధాన్యం చెల్లుబాటు అవడమేకాకుండా తక్కువ పంటవున్న జిల్లాలలోని ప్రజలకు కోరినంత ధాన్యం లభిస్తుంది ఒక జిల్లానుంచి మరొక జిల్లాకు దొంగచాటుగా ధాన్యాన్ని రవాణాచేసే యత్నాలు అంతమౌతవి. రవాణా ఖర్చులుతప్ప, రాష్ట్రమంతటా ధాన్యపు ధర దాదాపు ఒకటి అవుతుంది. విపరీతపు ధరపెట్టి ఆహారధాన్యాలను కొనుక్కోవలసిన అవసరం తక్కువ పంటపండిన జిల్లాలలోని వారికి వుండదు. ధాన్యం అమ్ముడుకాక డబ్బుకు అవస్థపడవలసిన అవసరం ఎక్కువ పంటపండిన జిల్లాలలోని రైతులకు వుండదు.

ఇటీవల కొద్దిరోజులుగా ఎక్కువ పంటపండిన జిల్లాలలోని రైతులు తమ ధాన్యాన్ని ప్రభుత్వం నిర్ణయించిన ధరకంటె తక్కువకు అమ్మజూపినా సరకు

అమ్మడు కాకపోవడమూ, తక్కువ పంటపండిన జిల్లాలలోని ప్రజలు ఎంతో ఎక్కువ ఖరీదుకు ఆహార ధాన్యాన్ని కొనవలసి రావడమూ జరిగింది. దీనికి కారణం, జిల్లాల మధ్య ఆహార ధాన్యాల రవాణామీద ఆంక్ష వుండటమే. ప్రస్తుతము, ప్రభుత్వము జారీచేసిన వుత్తరువువల్ల యీ ఆంక్ష తొలగిపోయి, రాష్ట్రంలోని ఏ జిల్లానుంచైనా మరొక జిల్లాకు ధాన్యం రవాణా జరుగుతుంది. ప్రజల బాధ తీరిపోతుంది.

అయితే, యీ రవాణా నిజంగా అవసరమున్న జిల్లాలకే జరిగేటట్లూ, యితర రాష్ట్రాలతో సరిహద్దు కలిగిన జిల్లాలకు రవాణా అయి అక్కడ నుంచి దొంగచాటుగా యితర రాష్ట్రాలకు రవాణా అవకుండా వుండేటట్లూ ప్రభుత్వం తగిన కట్టుదిట్టాలు ఏర్పరచాలి. లేకపోయినట్లయితే, మన రాష్ట్రం నుంచి ధాన్యం అత్యధికంగా యితర రాష్ట్రాలకు దొంగచాటుగా రవాణా అయి, మన రాష్ట్రంలోనే ఆహారపు కొరత ఏర్పడే పరిస్థితి రాగలదు.

మన రాష్ట్రం ఆహారధాన్యాల విషయంలో మిగులు రాష్ట్రం. మన అవసరాలకు మించిన ఆహారధాన్యాలు మన రాష్ట్రంలో ఉత్పత్తి అవుతున్నవి. కాబట్టి, మన అవసరాలకు సరిపోగా మిగిలిన ధాన్యాన్ని మనం, మన ఇరుగు పొరుగు రాష్ట్రాలకు న్యాయమైన ధరకు అమ్మవలసినదే. కాని, యీ అమ్మకం ఒక నిర్ణీత విధానాన్ని అనుసరించి జరగాలి. లేకపోతే, ఏ కొద్దిమందో విపరీత లాభాలను సంపాదించినా అసలు మన రాష్ట్రంలోనే ఆహారధాన్యాల కొరత ఏర్పడే ప్రమాదం ఉన్నది. మన రాష్ట్రపు పంట ఎంతో, మన అవసరాలకు కావలసినది ఎంతో, పోగా మిగులు ఎంతో, ఆ మిగులు ధాన్యాన్ని అమ్మవలసిన న్యాయమైన (అంటే రైతులకు లాభదాయకమైన) ధర ఎంతో - వీటన్నిటినీ ప్రభుత్వం నిర్ణయించి, ఆ ప్రకారం పొరుగు రాష్ట్రాలకు ధాన్యం సరఫరా అయేటట్లు ఒక క్రమ బద్ధమైన పద్ధతిని అమలుజరిపితే, మన రాష్ట్రానికీ, రాష్ట్రంలోని రైతులకూ నష్టం వుండదు

రాష్ట్రప్రభుత్వం శ్రద్ధవహించవలసిన మరొక ముఖ్యవిషయం వున్నది. అదేమిటంటే, మన రాష్ట్రంలోని చక్కెర మిల్లులలో ఉత్పత్తి అయే చక్కెరకు కేంద్రప్రభుత్వం నిర్ణయించిన లెవీ ధర. చెరకు ధర ఎక్కువ కాగా, ఫాక్టరీ కార్మికుల జీతభత్యాలు ఎక్కువ కాగా, కుంటుతూవున్న

# ఓ సుమిత్ర కథ

## గోవిందరాజు సీతాదేవి

తెల్లతెలవారుతోంది భాగ్యనగరంలో దాదాపు ఇరవై కుటుంబాలున్న ఆ ఇంట్లో రణగొణ ధ్వని ప్రారంభమైంది. బిందెలూ గిన్నెలూ ఒకటే చప్పుడు అవుతూన్న శబ్దం వినిపిస్తూన్నా సుమిత్రకి లేవబుద్ధి కావటంలేదు. అక్కడ కాపురాలున్న అందరూ చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకుంటూన్న మధ్యతరగతి కుటుంబీకులే. రెండేసి గదులకే యెనభైరూపాయలు అద్దెలు యివ్వలేక తలక్రిందులయేవాళ్ళు. చాలీచాలని జీతాల్తో భార్యాపిల్లలకి అర్ధాకళ్ళతో కడుపునింపుకునే వాళ్ళే అందరూ.

సుమిత్ర ప్రక్కవాటాలోని భవానమ్మ కొడుకు బొంగురు గొంతుతో సుమతీ శతకంలోని పద్యాలు చదువుతున్నాడు. వాటిని వింటూ అలా పడుకునే వుండి పోయింది సుమిత్ర. యింకా యింకా ఆ పద్యాలు వినిపిస్తూనే వున్నాయి. భవానమ్మకి పదేళ్ళ కొడుకుని పెంచటంలో చాలా జాగ్రత్తలు తీసుకుంటుంది. తన కొడుకు రాణాప్రతాప్ గానీ సుభాష్చంద్రబోస్ లేక నెహ్రూ అంత నాయకుడై పోవాలన్న కోరిక వుంది. అయితే బుజ్జిగాడు అమ్మదగ్గర అతి వినయం నటిస్తూ అవతల ఆకతాయివెధవలా తయారై పోతున్నాడని భవానమ్మకి తప్ప అక్కడ కాపురాలున్న అందరికీ తెలుసు. బుజ్జిగాడి బొంగురు గొంతుకి కాబోలు సుమిత్ర రూమ్మేటు కమల చెవుల్లో వేళ్ళు దూర్చి ముఖం కందగడ్డలా పెట్టుకుని "అబ్బ వెధవ కొంప. దీనికంటే సత్రం నయం" అనుకుంటూ మళ్ళీ వాడు మరో పద్యం వల్లిస్తుండే చివాలున లేచేసింది,

ఆ అమ్మాయి కోపం చూసి సుమిత్ర కమలచెయ్యి పట్టుకుని ఆపుతూ "ఎక్కడికమ్మా అలా బయలుదేరుతున్నావే" అంది.

''తెల్లవారకుండానే యేమిటీ వెధవమోత. ప్రక్కవాటాలో వాళ్ళకి నిద్దరుండక్కర్లా అని భవానమ్మని నాలుగూ దులిపేస్తాను వుండు నన్ను ఆపకు" కమల

చెయ్యి లాక్కుంటూవుంటే సుమిత్ర లేచి "తల్లీ, నీకూ నీ పెద్దలకీ దణ్ణం. ఆ భవానమ్మతో తగూ మనకెందుగ్గానీ ఫిల్టర్ డికాషన్ రాత్రి వేశాను. పాలబాటిల్ పెట్టి కుర్రాడు వెళ్ళిపోయాడు. ముఖం కడుక్కునిరా అయిదు నిమిషాల్లో స్పెన్సర్ కాఫీ యిస్తాను," అని బాత్‌రూములోకి వెళ్ళింది సుమిత్ర.

"ఇదిగో మనకి యింత మంచితనం పనికిరాదు. నేను రేడియో గట్టిగా పెడితే తనకి నిద్రాభంగం అయిందని ఆవిడ తగూకి రాలేదూ: అప్పుడు నీ నోరు యేమైందమ్మా సుమిత్రతల్లీ." కమలకి అసలే త్వరగాలేవాలంటే తగని ఐద్ధకం. మంచి నిద్ర పాడుచేసిన భవానమ్మ కొడుకుని గొంతు నొక్కేయాలన్నంత కోపం వచ్చినా సుమిత్ర వారిస్తుంటే యింకా మండిపోయింది "నే చస్తే వూరు కోనుగాక వూరుకోను" అంది కమల.

"అబ్బెబ్బే తగూకి వెళ్ళొద్దు అనలేదు. కాఫీ తాగివెడితే యెంచక్కా తెలుగు సినిమాలో డైలాగులు బాగా పడతాయనీ, అంతే" అనేసి స్టౌ వెలిగించి వీధి తలుపు తెరిచి పాలసీసా తీసుకుని గిన్నెలోపోసి స్టౌమీదపెట్టి తనూ చక చకా ముఖం కడుక్కుని కాఫీ కలిపేసింది సుమిత్ర. ఓకప్పు స్నేహితురాలికి అందించి మరోటి తను తీసుకుంది.

"అబ్బ: యెంత బాగుందోయ్ సుమిత్రా కాఫీ" అంటూ మరికాస్త పోసుకుని తాగేస్తూ సుమిత్ర ముఖంలోకి తదేకంగా చూస్తూ "రాత్రి సరిగా నిద్రపోలేదులా వుంది. కళ్లు అంత యెర్రబడ్డాయేం" అంది అభిమానంగా.

"అబ్బే, నిద్రబాగానే పోయాను, కమలా యింతకీ కూరలేమిటి యివాళ. అన్నట్లు సెలవు అయినా ఆఫీసుకి వెళ్ళాలి. అర్జెంట్ వర్కు వుంది," అంది స్నానానికి లేస్తూ.

"అబ్బ...యివాళ మాట్నీకి వెడదాం అనుకున్నాను సుమిత్రా. పోనీగానీ త్వరగా వంట చేస్తాను భోజనంచేసి వెళ్ళిపోయి మాట్నీ టైముకి వచ్చెయ్యి. సరేనా. సరే అంటేనే యీ బండీ యిక్కడినించి లేస్తుంది."

"అలాగే" అనేసి టవలు తీసుకుని బాత్‌రూములోకి వెళ్ళింది సుమిత్ర. కమల గబగబాలేచి వంటప్రయత్నంలోపడింది. సుమిత్ర బి.ఏ. అయినా టైపిస్టు గానే వుద్యోగంలో చేరింది. యెంతో కష్టంమీద యెన్నెన్నో విధాల ప్రయత్నించి యీ వుద్యోగాన్ని సంపాదించుకుని 'అమ్మయ్య' అనుకుంది. ప్రైవేటు కంపెనీయే అయినా ఫర్లేదులే అనుకుని తృప్తిపడుతూ వుంటుంది సుమిత్ర తల్లి పార్వతమ్మ. తండ్రి వెంకట్రావు. వారికి పెద్ద కూతురు సుమిత్ర. తర్వాత



యిద్దరు అబ్బాయిలూ ముగ్గురు అమ్మాయిలూ సామాన్య ఉద్యోగి వెంకట్రావుకి జీతంతో ఇల్లుగడవటమే కష్టమయిన విషయం అయితేయీమధ్య సంవత్సరం క్రితం పక్షవాతం వచ్చి ఓ కాలూ చెయ్యీ పడిపోవటంతో ఆ వుద్యోగం కాస్తా ఉద్వాసన అయిపోయింది. స్వంత వూరిలో సగం కూలిపోయిన ఇల్లుతప్ప మరే ఆస్తి లేని ఆ కుటుంబానికి సుమిత్ర వుద్యోగమే పెన్నిధి సుమిత్ర భాగ్యనగరంలో వున్నా అతిక్లుప్తంగా కాలం గడుపుతూ తల్లిదండ్రులకి నెలనెలా డబ్బు పంపుతూ వుంటుంది తను ఒక్కర్తీ వంట పెట్టుకున్నా మరో ఆఫీసులో పనిచేసే కమలని కలుపుకుని యీ రెండు గదుల్లో కాలం వెళ్ళదీస్తున్నారు యిద్దరూ. కమల కాస్త వున్నవాళ్ళ అమ్మాయే. అయితేనేం చదువు వృధా చేసుకోవటం యిష్టంలేక వుద్యోగం చేస్తోంది

ఇద్దరి పరిస్థితులూ వేరు స్వభావాలూ వేరు అయినా స్నేహితురాండ్రుగా కలిసి ఒకటిగా వున్నారు సుమిత్రా కమలా. కమలకి కోపం యెంత త్వరగా వస్తుందో అంత త్వరగా పోతుంది. ఉదయమే నిద్రలేవటం కాస్త బద్ధకం కానీ కాఫీ గనుక తాగేస్తే ఆ తర్వాత పనంతా ఒక్కర్తీ క్షణంలో చేసేస్తుంది. అది

అర్థంచేసుకున్న సుమిత్ర సామాన్యంగా తనే ముందుగాలేచి కాఫీచేసి కప్పు సాసరూ యెదురుగా పెట్టుకుని స్నేహితురాలిని నిద్రలేపుతుంది.

అప్పుడు కమల కళ్ళు తెరుస్తూనే "ఓ కాఫీదేవతా కదలకు. క్షణంలోవస్తాను" అని బాత్‌రూములోకి పరుగులీస్తుంది. కమల తిరిగివచ్చేవరకూ సుమిత్ర అరఅంగుళం కూడా కదలకుండా చిత్తరువులా అలాగే నిల్చుంటుంది

కమల కాఫీ కప్పు అందుకుని ప్రేమగా సుమిత్రవైపు చూస్తూ "యిది యేనాటి అనుబంధమో" అంటుంది. సుమిత్ర నవ్వి ఇంకోపని చూసుకుంటుంది. చక చకా యిద్దరూ తలోపనీ చేసేసి భోజనాలుచేసి యెవరి ఆఫీసులకు వాళ్ళు వెళ్ళి పోతారు. ఆ మేడలో యీ ఇద్దరేకాదు యింకా చాలా కాపురాలే వున్నాయి. అందరిలోకి అతి ముఖ్యులు పంగనామాల పద్మనాభం. అతని భార్యా సినీమా పిచ్చి కూతురు కస్తూరి. మరో కుటుంబం మీసాల పురుషోత్తం ఆయన కొడుకు కల్యాణ చక్రవర్తి యింకా యిద్దరు పిల్లలూ. వీరు అందరూ కాక సుమిత్ర ప్రక్కవాటాలోవున్న భవానీ ఆమె భర్త ఆదినారాయణా. అసలు యీ ఇళ్లలో వున్న అందరిపేర్లూ కమలకి బాగా గుర్తు. కానీ సుమిత్ర మాత్రం ఒకరి పేరు చెప్పబోయి మరొకరి పేరు చెప్తూ 'అరె...కాదు కదూ' అంటూ నాలిక కొరు క్కుంటూనే వుంటుంది.

స్నేహితురాండ్రిద్దరూ కబుర్లు చెప్పుకుంటూన్నప్పుడు తమ మేడని 'మినీ ఇండియా' అంటూ నవ్వుకుంటారు అయితే యీ ఇంట్లోకి అద్దెకి వచ్చిన దగ్గర నుంచీ నాకిది అచ్చివచ్చింది అంటుంది కమల. ఏ విషయంలో అని అడిగినా చెప్పలేదు. 'సమయం వచ్చినప్పుడు' అనేసి మాటమార్చే కమలవైపు సుమిత్ర అనుమానంగా చూస్తూ.

"ప్రేమ వ్యవహారంలో చిక్కుకున్నట్లున్నావు యీ మధ్య" అంటే

"యస్!" అంది కమల నదురూబెదురూ లేకుండా సుమిత్ర యింక వుప న్యాసం ప్రారంభించి నీతిపాఠాలు చెప్తూంటే కమలకి తగని చికాకు. "తల్లీ పాత చింతకాయ పచ్చడి కబుర్లు చెప్పకు. చూడమ్మా నా భవిష్యత్తు నాకు తెల్సు. అంత తేలిగ్గా బుట్టలో పడను అతన్నే బుట్టలోవేసి నీ యెదురుగా నిల బెడతాను అప్పుడు చూద్దువుగాని నా తడాఖా" ఛాలెంజ్ అన్నట్లు చూస్తుంది కమల

సుమిత్రకి యిలాంటి విషయాలంటే తగని చికాకు జీవితంలో అతి ముఖ్య మైన వివాహవిషయంలో యిలాంటి దొంగాటలు కూడదన్నది ఆ

అమ్మాయి వుద్దేశ్యం. కాని కమల వప్పుకోదు. కాలాన్నిబట్టి మనం మారాల. నిజాయితీ అని మనం కూర్చుంటే యే పనీ దానిఅంతట అదికాదుతల్లీ! అవ కాశాలు వచ్చి మన తలుపు తట్టవు, వాటిని అవకాశం చూసుకుని మనమే అంది పుచ్చుకుని ఓ పదిమెట్లు పైకి యెక్కాయాలి."

కమల మాటలకి యింక జవాబు చెప్పక సుమిత్ర, "యెవరి నమ్మకాలు వారివి" అంటుంది. ఇలా సాగిపోతూనే వున్నాయి రోజులు వారిద్దరికీ.

## 2

సుమిత్ర ఆఫీసునించి షాపింగ్ చూసుకుని ఓ రోజు వస్తుండగా హఠాత్తుగా ఉరుములూ మెరుపులతో వర్షం ప్రారంభం అవటంతోబాటు కరెంట్ పోయి చీకటి గాఢాంధకారం అయిపోయినాయి రోడ్లన్నీ. అప్పటికే రాత్రి యెనిమిది దాటి పోయింది. పూర్తిగా తడిసి రోడ్డుమీద నడవటానికి భయపడే సుమిత్రని బ్యాంకులో పనిచేసే రాజేంద్ర సైకిల్‌మీద వెడుతూ సుమిత్రని చూసి గుర్తించి ఆగి దగ్గరగావచ్చి పల్కరించి ఇంటివరకూ వచ్చి దించి వెళ్ళిపోయాడు.

ప్రతి నెలా జీతం అందుకోగానే బ్యాంకులో డ్రాఫ్ట్ తీసుకుని తల్లికి క్రమం తప్పకపంపే సుమిత్రకి అక్కడ పనిచేసే రాజేంద్రతో కాస్త ముఖపరిచయం. ఆ తర్వాత అక్కడక్కడా కల్సినప్పుడు "హలో అంటే హలో" అన్నది దాటి యింకాస్త ముందుకు వెళ్ళింది హోటల్‌కి సినిమాలకీ కూడా వెళ్ళారు యిద్దరూ. రాజేంద్రకి పాతిక పైబడ్డా యింకా చిన్నవాడిలా యెప్పుడూ తను నవ్వుతూ యెదటివారిని నవ్విస్తూ జోక్‌చేస్తూ మాట్లాడుతూ నవ్వుజల్లు కురి పిస్తూవుంటాడు.

మితభాషి అయినా సుమిత్రకి ఇతని స్వభావం నచ్చింది. రాజేంద్ర అందం గానే వుంటాడు, అని తప్ప మరేం వివరాలు తెలియవు సుమిత్రకి. తెల్సు కోవాలని కోరికవున్నా బాగుండదేమో' అని భయం. కానీ కమల మాత్రం "సుమిత్రా రాజేంద్ర వివరాలు నువ్వు తెల్సుకుంటావా? నన్ను తెల్సుకో మంటావా?'' అని నిలదీసింది ఒకరోజు.

"అంత తొందర మంచిది కాదోయ్!" అంది స్నేహితురాలితో.

"ఆలస్యం అమృతం విషం. ప్రేమ వ్యవహారాల్లో ముఖ్యంగా."

"నీ ముఖంలే!"

"అలా తీసేయకు. నీకంటే అందగత్తె అయిన అమ్మాయి అతన్ని కొనేసు కుంటే?"

"అదీ నిజమే. కాని అతన్ని కొనుక్కోవాలంటే మాత్రం నాకు 'శక్తి' మరో పది సంవత్సరాలకన్నా రాదు."

"అంటే పదివేలన్నా ఖరీదు వుంటాడంటావా, వుంటే వుండనీయి. ఇంక నీ పెళ్ళి యెలాగైనా నీ తలిదండ్రులు చెయ్యలేరు. గనుక ప్రతినెలా వాళ్లకి పంపేడబ్బు స్టాప్‌చేసి బ్యాంకులో వేసెయ్యి. ఓ సంవత్సరం తర్వాత కొంత అప్పు చెయ్యి. ఆ పైన భారతనారి నీ మొగుడిని నువ్వే కొనుక్కో.

సుమిత్ర నవ్వురాకపోయినా తెచ్చుకుంటూ కమల ముఖంలోకి చూస్తూ "కమలా! నువ్వు నా స్థితిలో వుంటే అలాగే చేస్తావా?"

"అంటే?" కళ్ళు వెడల్పు చేసుకుని చూస్తూ అంది కమల.

"కన్న తల్లిదండ్రులు తిండికికూడా నీ డబ్బుమీద ఆధారపడివున్నప్పుడు వాళ్ళ విషయం పట్టించుకోకుండా కేవలం నీ సుఖ సంతోషాలకోసం వాళ్ళని గాలికి వదిలి జీతం దాచుకుని మొగుడిని కొనుక్కొంటావా కమలా?"

కమల క్షణం ఆలోచించింది. తల అడ్డంగా వూగిస్తూ.

''సారీ సుమిత్రా! కానీ కుటుంబ పరిస్థితి కేవలం ఆర్థిక ఇబ్బందులే అయితే ధనవంతుడైన యే ముసలివాడినైనా సరే చేసుకుని వాళ్ళకా యిబ్బందులు లేకుండా చేసి డబ్బుతో దొరికే సుఖాన్ని నేననుభవిస్తాను. అయితే యీ మాటలు నీకు నచ్చవు అని తెలుసు. ఒక్కటి గుర్తుంచుకో సుమిత్రా. నీవు వాళ్ళకోసం ఆలోచిస్తున్నావు కానీ వాళ్ళు నీ వయస్సూ మనస్సూ గుర్తిస్తూన్నారా!''

"గుర్తించినా గుర్తించకున్నా నా బాధ్యత నేను నిర్వర్తించాలి తప్పదు.''

"అయితే రాజేంద్రతో చస్తే నీకు పెళ్ళికాదు.''

"కాకున్నా ఫర్లేదు ''

"అంటే నువ్వు అతన్ని మనస్ఫూర్తిగా కావాలనుకోవటం లేదా?''

''అర్థంలేని ప్రశ్న'' కోపంగా అంది సుమిత్ర.

"సరే అవన్నీ అలా వుంచు. ఓ విషయం నీకు చెప్పకూడదు. కానీ స్నేహ ధర్మం చెప్పి తీరాలి గనుక చెప్పక తప్పదు."

"ఏమిటది?"

"చెప్తే నీకు బాధ. చెప్పకుంటే నాకుబాధ యెలా!"

"ఫర్లేదు చెప్పు."

"రాజేంద్రకి యిదివరకే పెళ్ళి అయింది అన్నట్లు తెల్సింది."

"ఆ...! యెవరు చెప్పారలా అని."





"నా ఫ్రెండ్ ఓ అమ్మాయి చెప్పింది. అయితే ఆ మాట నిజం అవునో కాదో నేనే తెల్సుకుంటాను. కానీ బాధపడకు."

"నా కెందుకు మధ్య బాధ. అసలు అతనికి పెళ్ళి అయితేనేం కాకుంటేనేం. నేనేం అతన్ని చేసుకోవటానికి రెడీగాలేను. చరచరా అక్కడనుంచి వెళ్ళిపోయి కమల పిల్చినా జవాబివ్వలేదు కానీ సుమిత్రకి అన్నం సయించలేదు. అలాగే ఆఫీసుకి వచ్చేసింది. పనిమీద మనస్సు లేదు. టైపుచేస్తుంటే అన్నీ తప్పులే వస్తున్నాయి. వేడి కాఫీ తాగినా తలదిమ్ము తగ్గలేదు. ఛీ శలవుపెట్టి వెళ్ళి రూములో పడుకోవాలన్పిస్తోంది. కానీ అర్జెంట్ వర్కు. శలవు పెట్టటానికి వీల్లేదు సుమిత్ర యాంత్రికంగా యెలాగో వర్కు పూర్తిచేసేసి ఓ గంట పర్మిషన్ తీసుకుని రిక్షా యెక్కి 'రామకృష్ణా' కి వచ్చి అసలు ఆ హాల్లో యే సినిమా వుందో కూడా చూడకుండా టికెట్ కోసం క్యూలో నిల్చుంది.

తనముందు చాలామందే వున్నారు. రకరకాల దుస్తుల్లో ఫాషన్‌గా ఒక్కో రకంగా అలంకరించుకున్న అమ్మాయిల వరసని చూస్తూ అదృష్టవంతులు వీళ్ళంతా అనుకుంది. సినిమాకి వచ్చి 'ఎంజాయ్' చేయాలంటే అయిదింటికి డ్రెస్ అయి హోటల్లో కాఫీ టిఫెనూ తీసుకుని సిటీబస్‌ఇకోసం నిరీక్షించకుండా టికెట్ కోసం క్యూలో నిలబడకుండా సినిమా చూడగల్గితే అసలైన హాయి వుంటుంది అన్పిస్తుంది సుమిత్రకి. కానీ అలా యెందరు సినిమా చూడగల్గుతున్నారు? నిత్యావసరాలు తగ్గించుకొని రెండుగంటలన్నా బస్‌కోసం నిలబడే

క్యూలో కాళ్ళుపీక్కుపోయేలా నిల్చుని యెలాగో టికెట్టు దొరికితే అప్పటికే సగం నీరసపడి సినీమాహాల్లో అడుగుపెట్టేవాళ్ళే యెక్కువగా కన్పిస్తారు. సినీమాలు యువతరాన్ని నాశనం చేస్తున్నాయి. అని నెత్తీనోరూ కొట్టుకుని అరిచేవాళ్ళు వురుస్తున్నారు అందులో నిజానిజాల సంగతి తను అంచనావేయ లేదు కానీ తనలాంటి అమ్మాయిలకి మనస్సు వికలమైనప్పుడు కాస్త హాయి నిచ్చేది సినీమా ఒక్కటే అన్నది అక్షరాల నిజం. యీనాటి సమాజంలో ఆర్థిక సమస్యలతో నలిగిపోతూ బరువు బ్రతుకులు యీడ్చేవారికి రెండున్నరగంటలు యదార్థ బాధలనుంచి దూరంగా అతి దూరంగా హాయిగా వుండే యేదో తెలియని అందమైన మరో ప్రపంచంలోకి లాక్కువెళ్లే యీ సినీమాలు కూడా లేకుండే యీనాటి మనిషి యేమయిపోయేవాడు! అనుకుంటూ ఆలోచిస్తూనే సినీమా చూస్తూ తన అశాంతిని మర్చిపోతూవుంది సుమిత్ర. ఇంతలో ప్రక్కసీటులోకి ఓ యువకుడు వచ్చి కూర్చోవటంతో కాస్త వొదిగి కూర్చుని తెరవైపుకే చూస్తూన్న సుమిత్రని గుర్తించిన రాజేంద్ర "హల్లో సుమిత్రాదేవిగారూ నమస్కారం" కళ్ళజోడు తీసి కర్చిఫ్‌తో తుడుస్తూ అడుగుతూన్న అతనివైపుకి చూసింది క్షణం.

అనుకోని యీ అదృష్టం లభించినందుకుకాబోలు అతని కళ్ళలో సంతోషపు పొంగు కన్పిస్తోంది. సుమిత్ర సభ్యత మర్చి ప్రతినమస్కారం చేయలేదు. ఖర్మ, నుదురు నొక్కుకుంటూనే అతన్ని గుర్తించినట్లు నవ్వు ముఖాన పులుముకుంది.

"తలనొప్పిగా వుందా? వుండండి" అని జనాన్ని తప్పించుకుంటూ వెళ్ళి మరో అయిదునిముషాల్లోనే వచ్చికూర్చున్నాడు. కాఫీ కప్పులు తెచ్చియిచ్చాడు కుర్రాడు. "వేడి కాఫీ తీసుకోండి" అనేసి ముందే అతనికి డబ్బుయిచ్చేసి "ఇవాళ అదోలా వున్నారు. ఆఫీసులో యెవరితోనన్నా పోట్లాటా?"

"లేదు" అన్నట్లు తలఅడ్డంగా వూపింది సుమిత్ర. ఖాళీకప్పు కుర్రాడికిచ్చేస్తూ

"వక్కపొడి కావాలా" అని ఓ పొట్లం యివ్వబోతే

"థాంక్స్ అక్కరలేదు" అనేసరికి "మీరు చాలామంచి అమ్మాయి" యే అలవాట్లూలేవు.'' అనేసి సినీమా చూస్తూ మెల్లని స్వరంలో కామెంట్ చేస్తూ సుమిత్ర జవాబు చెప్పకున్నా పట్టించుకోకుండానే తిరిగిచూస్తూన్నాడు.

సుమిత్రకి ఆలోచనలు తినేస్తున్నాయి. చామన ఛాయలో దృఢంగా పొడుగ్గా వుండే రాజేంద్ర రకరకాల డ్రెస్‌లు వేయకున్నా అందంగానే కన్పిస్తాడు.

అతనికి యిష్టం కాబోలు యెప్పుడూ యెక్కువగా తెల్ల పాంటూ తెల్ల షర్టూ వేసుకుంటాడు.

"తెలుపు మీ కిష్టమా" ఓసారి పార్కులో కూర్చుని కబుర్లు చెప్తూ అతన్ని అడిగింది "ఎందుకలా అడిగారు" రాజేంద్ర సుమిత్ర ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అడిగాడు

"వూరికినే"

"వూరికినే అయితే నిజం చెప్పను. అవసరం వుంది అంటే సత్యమే చెప్తాను"

"మీరెప్పుడూ తెల్లటి బట్టలనే వేసుకుంటారు అందుకు అడిగాను."

"ఓ అదా మీ సందేహం చెప్తాను వినండి తెల్లని బట్టలు పరిశుభ్రంగా వుంటాయి పేదతనాన్ని కప్పిపుచ్చుతాయి. చాలునా."

"సారీ" సుమిత్ర కాస్త బాధగా అంది.

అందుకతను గంభీరంగా ముఖం పెట్టి "అబ్బెబ్బే నేనసలు యిలాంటివేం పట్టించుకోను. నన్ను విమర్శించినా బాధపడను కనుక మీరు బాధపడే పనిలేదు అయితే నేనెప్పుడూ మీరేలాంటి చీరెలు కట్టుకుంటున్నారో అవి యెంత ఖరీదు వుంటాయో అసలవి యిప్పటి ఫాషన్ అవునో కాదో అని యెప్పుడూ ఆలోచించను. అసలు అలాంటివి నాకు తెలియదు. యిలాంటివన్నీ తెల్సుకునే అవకాశాలు అంటే స్పెషల్‌క్లాసు లుకానీ 'బుక్స్'కానీ వుంటే చెప్పండి తెల్సుకోవటానికి ప్రయత్నిస్తాను. యీ ప్రపంచంలో మనిషి ప్రతిదీ తెల్సుకో వల్సిందే. అవకాశం వున్నంతలో సుమండీ".

అతను ఆగాడు సుమిత్ర నవ్వి అంది "అబ్బ చిన్న ప్రశ్నకి యింత పెద్ద జవాబా."

"నా జవాబుల్లో ఒక్క అక్షరంకూడా అవసరమైందిలేదు. అనినానమ్మకం. అయితే మీలాంటి మితభాషులను చూసి నేనూ అలాగే వుండాలి అనుకుంటాను కానీ అలవాటు కావటంలేదు" అంటూ చేతివాచీ చూసుకుని 'అరె టైము చాలా అయింది' అంటూ సుమిత్రతో యింకా యేమేమో మాట్లాడుతూనే ఆమెని బస్ యెక్కించి తను తన ఇంటికి వెళ్ళిపోయాడు.

సినీమా హాల్లో కూర్చున్న సుమిత్రకి యెప్పుడో జరిగిన ఆ విషయాలన్నీ గుర్తుకు వస్తున్నాయి. వంటరిగావున్నా యెన్నిసార్లు కల్సుకున్నా అతని ప్రవర్తన మాత్రం సంస్కారవంతంగా వుంటుంది. అతను కూర్చోవటంలో

నిర్మొహమాటంలో సంభాషణలో పరాయి అమ్మాయిల విషయాల్లో యెక్కడా దురుసుగా గానీ తేలిగ్గా గానీ వుండదు ఇతను మంచి స్నేహపాత్రుడు అంటారు చాలామంది. అది నిజమే. కానీ తను స్నేహితురాలుగానే వుండిపోవాలని అనుకోవటంలేదు అయితే తన మనస్సు అతను కావాలని యెంతో తొందర చేస్తూన్నా సుమిత్ర నిగ్రహంగా అతని వివరాలు తెల్సుకునేందుకు ప్రయత్ని స్తోంది యింతలో కమల పిడుగులాంటి మాట చెప్పేసరికి సుమిత్ర వూహా సౌధాల పునాదులు కదిలిపోయాయి. అయితే యీ విషయం సరాసరి యితన్నే అడిగి తేల్చుకుంటే? బాగానే వుంటుంది. అయితే అడగటం యెలా! మీకు పెళ్ళి అయిందా? అని అతను అడగలేదెప్పుడూ. ఇంక సిగ్గువిడిచి తను యెలా అడుగుతుంది. ఒకవేళ అడిగినా అతను సరైన జవాబు చెపాడని నమ్మకంలేదు.

"ఎందుకు?" అని అడిగి "అబద్ధం చెప్పమంటారా! నిజం చెప్పమంటారా!" అంటాడు ఔను అంతే. లేకుంటే మరోటి కూడా అనవచ్చు. "ఏం పెళ్ళి సంబంధాలు చూస్తారా" అని ఛీ ఛీ! యితని ఆలోచనలు మర్చిపోవాలని యిక్క డికి వస్తే అతనేవచ్చి ప్రక్కనే కూర్చున్నాడు 'భగవాన్' ముఖం కర్చిఫ్‌తో తుడుచుకుంది సుమిత్ర.

"అబ్బ యెంత మోటుహాస్యం ఛి ఛి యేంబాలేదు కదూ సుమిత్రాదేవిగారూ" అంటూ ముఖం తిప్పి చూసి 'అరె అదేంటి మీరు పిక్చర్ చూడటంలేదు. కళ్లు మూసుకున్నారేం. తలనొప్పి యెక్కువైందా. మళ్ళీ కాఫీ తాగుతారా" లేవ బోతూన్న రాజేంద్రని వారిస్తూ "అక్కరలేదు అసలు సినిమా చూడాలని లేదు నే వెళ్ళిపోతాను" అనేసి బైటికి వచ్చేసిన సుమిత్ర వెనకే రాజేంద్ర కూడా వచ్చేస్తూ

"ఇంటికి వెళ్ళిపోతారా! పోనీ కాస్సేపలా చల్లగాలిలో కూర్చోండి. హాయిగా వుంటుంది. వెడదామా" అంటూనే అటుగా వెడుతూన్న ఆటోని ఆపు చేసి 'ఏమంటారు' అన్నాడు. సుమిత్రకి మెదడులో తుఫాను వీస్తోంది అలా వెళ్ళి అక్కడ అతన్ని అడిగేస్తే! అహ అడిగి మరీ తేలిక కాకూడదు" అనుకుని నేను ఇంటికి వెళ్ళాలి అంది.

"అయితే పదండి మీ ఇంటి దగ్గర దింపేస్తాను."

"అక్కరలేదు"

రాజేంద్ర క్షణం ఆలోచించి సరే నే వెళ్ళిపోస్తాను గుడ్‌నైట్" వెళ్ళిపోయాడు.

సుమిత్రకి దుఃఖం కట్టలు తెంచుకుంది. బస్‌లో వెళ్ళే ఓపికలేక రిక్షా మాట్లాడుకుని యెక్కి కూర్చుంది కానీ పర్సులో సరిపడ డబ్బులులేవు. ఒకవేళ కమల వుంటే ఫర్లేదు. లేకుంటే ఆ భవానమ్మేగతి. ఆవిడ మొగుడు ఆఫీసునుంచి అప్పుడే రాడు కనుక తలుపులు తెరిచే వుంచుతుంది సుమిత్రకి కళ్ళలో నీళ్లు నిండుకున్నాయి. ఏం జీవితం యిది యెన్నాళ్ళు గడిపినా తన తల్లి దండ్రుల సమస్యలు తీరేనా: భగవాన్ నుమరు నొక్కుకుంటూ యిల్లుచేరింది అదృష్టం కమల యింట్లోనేవుంది

## 3

కమల యివాళ యెందుకో చాలా శాంతంగా వుంది. భోజనంచేస్తూ సుమిత్రతో కబుర్లు మొదలెట్టింది. ప్రక్కవాటాల్లో వాళ్ళ విషయాలు చెప్తూ సుమిత్రకి కాలక్షేపం చేయాలని చూసింది కానీ సుమిత్ర 'వూ' 'ఆ' అనే పరధ్యాన సమాధానాలకి కోపం తెచ్చుకుని అన్నం తినటం ఆపి

"సుమిత్రా అంత దిగులెందుకోయ్? రాజేంద్రకి పెళ్ళి అయింది అన్న మాట వినే నీవిలా అయిపోతే యీ నిష్టుర ప్రపంచంలో యెలా బ్రతుకుతావు. చూడు రాజేంద్ర కాకపోతే 'యాదేంద్ర' మరొకడు వుండి తీరతాడు. అయినా ఆ విషయం నిజమో కాదో నే తెల్సుకుంటానుగా. అన్నట్లు భవాని అమ్మవారు క్రింది వాటాలోని పంగనామాల పద్మనాభంగారి భార్యతో తగూకి దిగింది. అబ్బ యెంత రసవత్తరంగా సాగిందనీ ఆ తగూ నేను కళ్ళారా చూశాను. చెవులారా విన్నాను కనుక నా జన్మ ధన్యం అయిపోయింది నువ్వు నరకానికి వెళ్ళాల్సిందే అసలు కారణం యేమిటంటే..." అంటూ వివరంగా చెప్పబోతుంటే సుమిత్ర కోపంగా

"తల్లీ అసలే తలనొప్పితో చస్తున్నాను నన్నెందుకమ్మా యింకా విసిగించటం." అనటంతో కమల మరి మాట్లాడకుండా భోజనం పూర్తిచేసి పక్కపర్చుకుని పడుకుని యిటూ అటూ దొర్లి నిద్రరాక లేచి కూర్చుని

"సుమిత్రా పోనీ ఓసారి మీ ఇంటికి వెళ్ళిరాకూడదూ!" అంది

"యెందుకు. అక్కడ యీ కాస్త శాంతికూడా వుండదు."

"ఛా అదేంటోయ్ "

"లేకుంటే యేంవుంది పక్షవాతంతో మూలుగుతూ యెప్పుడూ అందరినీ తిట్టిపోసే తండ్రి ఆర్థిక యిబ్బందుల్లో గంధం చెక్కలా అరిగిపోతూన్న తల్లీ అక్కయ్యకి జీతం యెంతో ఖర్చు యెంతో తెల్సుకోకుండానే ఆశగా నా హేండ్

బాగ్ వైపు చూసే తమ్ముళ్ళు చెల్లాయిలూ. యింకా చెప్పాలంటే తనసుఖంకోసం అందరినీ వదిలి లేచిపోయి లక్షాధికారిలా బ్రతికే మేనత్తా నాటకాల పిచ్చిలోపడి దేశద్రిమ్మరిగా తిరిగే పినతండ్రి– యింతేగా "నా వాళ్లు" అనుకునే వాళ్ళ గొప్ప చరిత్రలు. యింక వీళ్ళలో యెవరిని చూసుకుని గర్వపడను? యెవరు కావాలనుకుని వెళ్ళను? కమలా మధ్యతరగతివాళ్ళ బ్రతుకులు యీ శతాబ్దంలో కూడా బాగుపడవు కాక బాగుపడవు. నాలాంటివాళ్ళు యెందరు ఆహుతి అయినా ఓ సంసారం పైకిరాదు." ఆవేశంగా కోపంగా అనేసి అంతలోనే నిగ్రహించుకుంటూ "ఛీ యీ విషయం యింక వదిలేద్దాం కానీ తల్లీ నువు నిద్రపో. నేను కాస్సేపు యీ నవల చదువుకుని నిద్రరాగానే పడుకుంటాను." అంటూ టేబిల్ లైటుముందు కూర్చుని ఓ ఇంగ్లీషు నవల తెరిచింది సుమిత్ర. ఆ నవల చదువుతూ అలా సర్వం మర్చి చాలా రాత్రి అయిన తర్వాత ఆవులింతలు వస్తుంటే టైము చూసి "అరె అప్పుడే పదకొండా. మాలాంటివాళ్ళకి యీ పుస్తకాలు అపురూపవస్తువులు. యీ రచయితకి జోహార్లు. మనస్సు చాలా తేలిక అయింది అనుకుంటూ కళ్లుమూసుకుంది సుమిత్ర ప్రక్కమీదికి జేరి.

## 4

సుమిత్రకి అర్జెంట్‌గా రమ్మని ఇంటిదగ్గరనుంచి వుత్తరం రావటంతో యింక శలవుపెట్టి బయలుదేరింది. బస్‌కి రిజర్వేషన్ చేయించేసుకున్నది "బస్‌స్టాండ్‌కి నేవస్తానోయ్ సుమిత్రా" అని మారాంచేసింది కమల. "రాత్రి తొమ్మిదిన్నరకి వంటరిగా యింటికి నువ్వు క్షేమంగా చేరావో లేదో అని అశాంతితో చస్తాను నేను. కనుకతల్లీ నువ్వు ఇంట్లోనేవుండు. నేను తిరిగివచ్చే వరకూ ఇరుగూ పొరుగూతో తగూకి దిగకు. కస్తూరిని తోడుగా వుంచుకో. వాళ్ళ అమ్మకి చెప్పాను "అంటూ అప్పగింతలు చేసి బయలుదేరింది సుమిత్ర. కమల కదులుతున్న ఆటోని ఆగు ఆగు అంటూ లోపలికి పరుగెత్తి ఓ ప్లాస్టిక్ బుట్ట తెచ్చి సుమిత్ర కిస్తూ "యిదిగో దీనిలో ఖాళీ సీసాలు పెట్టాను. వాటికి నిండుగా వూరగాయలు తీసుకురా, ఏం తెస్తావుగా" అంటూనే చెయ్యి వూపుతూ నిల్చుంది యెంతసేపో.

బస్‌లో కూర్చుంది. యెందరెందరో వస్తున్నారు. బస్ యెక్కుతూన్నారు. వాళ్ళని యెక్కించటానికి వారివెంట మరెందరో. తను ఒక్కరే యిలా వంటరిగా కూర్చుని వాళ్ళనందరినీ చూస్తూవుంది. ఓ కొత్త పెళ్ళికూతురు పుట్టింటికే వెడుతున్నా భర్తని వదిలి నెలరోజులు యెలా వుండటం అనుకుంటూ




బాధపడిపోతోంది. మరో కుర్రాడు ముసలి తల్లిని యెక్కించి 'జాగ్రత్తమ్మా' అంటూ పదిసార్లు హెచ్చరిస్తున్నాడు. హైదరాబాద్ చూడాలని కలలుగని వచ్చి చూసి యింకా తనివితీరకున్నా అన్నగారు పంపేస్తూంటే 'పూ' అంటూన్నాడో ఇరవైయేళ్ళ కుర్రాడు వాళ్ళందరినీ చూస్తూ అలాగే కూర్చుంది సుమిత్ర. బస్ కదిలింది. వేగాన్ని అందుకుంది. చల్లటిగాలి వీస్తోంది బస్ ముందుకు పోతోంది. సుమిత్ర ఆలోచనలు తల్లిదండ్రుల దగ్గరికి వెళ్ళిపోయాయి

అసలు నన్ను రమ్మని రాసినదెందుకు! ఒకవేళ పెళ్ళిసంబంధ మేదైనా చూడలేదు కదా! అయివుండదు ఒకవేళ అయితే వాళ్ళకి యేం జవాబివ్వాలి. యిప్పుడసలు పెళ్ళేవద్దు అననా! నాపెళ్ళి నేనే చేసుకుంటాను అననా! యేమిటో. తను రాజేంద్ర వివరాలు తెలియకా అసలు తెల్సుకోకుండానే మనసు యిచ్చేసింది. అసలు మనసు యిచ్చినట్లే తెలియలేదు మరి. యిప్పుడు యేం చెయ్యాలి. అబ్బ హైదరాబాద్‌కి యింత దూరంగా వచ్చేస్తూన్నా అతని ఆలోచనలేనా! యేది యేమైనా అన్నింటికీ సిద్ధంగావుండి సమయస్ఫూర్తిగా వ్యవహరించాలి. అంతే అనుకుని ఆలోచనలు ప్రక్కకి నెట్టి కళ్ళు మూసుకుని సీటులో వెనక్కి వాలి కూర్చుంది వెన్నెల పిండారబోసినట్టుంది చుట్టూ నిశ్శబ్దంగావున్నా బస్ పోతూన్న శబ్దం మాత్రం అదోలా వినిపిస్తూవుండగానే నిద్ర ముంచుకు వస్తోంది. అంతలోనే మెలుకువొస్తోంది.

# 5

సుమిత్ర ఇల్లు చేరింది. తమ్ముళ్లూ చెల్లాయిలూ తల్లీ తనకోసం వెయ్యికళ్ళతో యెదురు చూస్తున్నారు. పెద్ద తమ్ముడు మాత్రం బస్ స్టాండ్‌కి వచ్చాడు అక్కకోసం. వాళ్ల అందరికళ్ళలోని సంతోషం చూసిన సుమిత్ర తృప్తిగా గాలి పీల్చుకుని,

వీళ్లంతా నావాళ్లు, ఔను అనుకుంది మరోసారి

"తల్లీ ముందు కాళ్లుకడుక్కోమ్మా" అంటూన్న తల్లీ 'మాకేం తెచ్చావక్కా ? అని బ్యాగ్ వెతుక్కునే చెల్లాయిలూ అందర్నీ ఓసారి ఆత్మీయంగా చూసుకుంది. కానీ తండ్రి మాత్రం మౌనంగా తన సింహాసనంమీద (కుంటి నులకమంచం మీద) కూర్చుని కూతుర్ని చూస్తున్నాడు

"అమ్మా అక్క స్వీట్లు తెచ్చిందమ్మా" అంటూ పాకెట్ తెరిచి మాకంటే మాకు అని తగూలుపడే వాళ్ళని కూకలేసి అందరికీ సమానంగా పంచి భర్తకో రెండు పెట్టబోయింది పార్వతమ్మ. ఆయన ముఖం కందగడ్డలా పెట్టుకునే "యిప్పటికైనా గుర్తొచ్చాను" అని అందుకుని తింటూ అప్పుడే అన్నీ అయిపోయాయీ. పోనీ యిది మరోపాకెట్టు తేకూడదూ అంటూ సణిగే తండ్రి వైపు నవ్వుతూ చూడబోయి తల తిప్పుకుని లోపలికి వెళ్ళింది.

పార్వతమ్మ సుమిత్ర యేం తెచ్చినా ముందు భర్తకో పిల్లలకో పెట్టేసి తను ఒకటన్నా మిగుల్చుకోకపోవడం యెప్పుడూ అలవాటే. యిది అసలు మరెవరూ పట్టించుకోరు ఒక్క సుమిత్ర తప్ప.

"అమ్మా అసలు నేను తెచ్చింది నీకోసం తెల్సునా" అంది ఆవేశంగా. పార్వతమ్మ నవ్వేసి "మీరందరూ తింటే నేను తిన్నట్టుకదూ. నరేగానీ ముందు కాస్త లేచి కాఫీ తాగి స్నానం చేద్దువురాతల్లీ" అంటూ లోపలికి వెళ్ళింది.

స్నానం భోజనం అయిన తర్వాత విశ్రాంతిగా పడుకుని తల్లిని అడిగింది సుమిత్ర. "యేందుకమ్మా నన్నింత అర్జెంట్‌గా రమ్మని రాయించావూ" అని "నీతో చాలా పనేవుందమ్మా. యింతకీ శలవు యెన్నాళ్లు పెట్టావు" అంది ఆవిడ వివరంగా చెప్పకుండానే.

'నాలుగు రోజులే' అంది తల్లి మరీ చిక్కిపోయినట్లు గుర్తిస్తూ, పార్వతమ్మ కలవారింటి ఆడపడుచు. పదెకరాల పసుపు కుంకుమ ఆస్తిగావెంట తీసుకుని యాభై కాసుల బంగారం నూరుతులాల వెండి సామానూ బోలెడంత యిత్తడి సామానుతో యీ ఇంట్లో అడుగుపెట్టింది. వెంకట్రావుకీ తక్కువ ఆస్తి లేదు.

అయితే అతని తల్లిదండ్రులు 'ఇటుకల' వ్యాపారం చేసి లక్షలు సంపాదిద్దాం అని అత్యాసకిపోయి అందులో నష్టం వచ్చినా అంతటితో మానక ఇల్లూ వాకిలీ ఆస్తీ పాస్తీ కాక కోడలు తెచ్చుకున్నది కూడా నాశనంచేసి అంతాపోయిందనే దిగులుతోనే ఆరు నెలల వ్యవధిలో ఆ ఇద్దరూ కాలంచేశారు ఆస్తిపోయినా వెంకటరావుకి సుకుమారంగా పెరిగి జమీందారిణి కావాలనే గొప్ప కోరికలున్న చెల్లెలు రమణీ తన చదువే లోకంతప్ప యెరుగని అమాయకుడైన హరికృష్ణ అనే తమ్ముడూ మిగిలారు పోయింది పోనివ్వు యేదో సామాన్యమైన సంబంధం తెచ్చి చెల్లెలి పెళ్ళి చేయాలని ప్రయత్నించిన పెద్దన్నగారిని అభాసులు పాలుచేసి రమణి తన ప్రియుడితో లేచిపోయింది. చెల్లెలిని తీసుకుని గానీ వెనక్కిరాను అని ఇల్లు వదిలి వెళ్ళిన హరికృష్ణ మళ్ళీ అన్న ముఖం చూడలేదు అందుకే కారణం చెల్లెలు దొరకలేదనీ అవమానంతో తిరిగి వచ్చి అన్నగారి ముఖం చూడలేననీ హరికృష్ణ వుత్తరం రాసి తన బతుకు తనే బ్రతుకుతానని కూడా రాశాడు.

ఆసలు వెంకట్రావుకి తన భార్యా పిల్లలూకంటే చెల్లెలూ తమ్ముడూ అంటేనే ప్రాణం వారిద్దరూ అలా తనని కాదని వెళ్ళిపోవటం యెప్పుడూ యెరుగని ఆర్థిక యిబ్బందులూ యివన్నీ పార్వతమ్మ వెంటతెచ్చిన దురదృష్టం అని ఆయన నమ్మకం యెవరు యెన్ని చెప్పినా ఆయన ఆ భావం చస్తే పోదు. యిది అర్థంచేసుకున్న పార్వతమ్మ వుడికిపోయింది. భర్తకి యెదురు తిరిగింది. తగూలూ యేడ్పులూ యిలా చాలా రోజులు జరిగిపోయింది. యీ ఘర్షణలో పిల్లలు నలిగిపోతూన్నారన్న సత్యం గుర్తించిన పార్వతమ్మ పూర్తిగా మారిపోయింది భర్త యెన్ని వాగినా యెదురు చెప్పదు. పిల్లలని చెప్పనీయదు. పిల్లల భవిష్యత్తు తీర్చి దిద్దటమే తన ధ్యేయం. యింక వీళ్ళ అదృష్టం యెలా వుందో అని బాధపడక భగవంతుడి మీద భారంవేసి ఆ సంసార శకటాన్ని లాక్కు వస్తోంది. శాంతమూర్తిలా పార్వతమ్మ.

తండ్రి అర్థంలేని అహంకారానికి విసుగూ చికాకూ అయినా యీ సంసారం కోసం సతమతమయే తల్లినిచూస్తే తగని జాలి సుమిత్రకి. అంతకుమించి గౌరవం కూడా ఆవిడని చూస్తే. పార్వతమ్మ యింటి పరిస్థితులన్నీ చెప్తూ.

"సుమిత్రా సూర్యం బొత్తిగా చదువులో శ్రద్ధ చూపటం లేదమ్మా. వ్యాపారం చేస్తానంటూ గోలచేస్తూన్నాడు. యెంత చదివినా వుద్యోగం దొరుకుతుందా వస్తుందా అంటాడు. నేనేం చెయ్యను." దిగులుగా అంది. సుమిత్ర. తల్లి

చెప్పినదంతా విని "నీవంత దిగులుపడితే యెలాగమ్మా. పోనివ్వు. వదిలేసెయ్యి. వుద్యోగం చేస్తాడో వ్యాపారం పెట్టి లక్షలు సంపాదిస్తాడో. వాడి జీవితం వాడిది "

"వాడి జీవితం వాడి దొక్కడిదే యెలాగవుతుందే! యీ ఇంట్లోని ప్రతి ఒక్కరి జీవితం మిగతా అందరి జీవితాలతోనూ ముడిపడి వుందమ్మా, యీతరం పిల్లలు పిచ్చివాళ్ళమ్మా యెవరికి వారు విభజించుకుని ఆలోచిస్తారు. అందుకే ప్రతిదీ తేలిగ్గా కన్పిస్తుంది. కానీ సూర్యం భవిష్యత్తులో మిగతావాళ్ళ భవిష్యత్తు ఆధారపడి వుందని తెలియదా వాడి ఆసరాతో మిగతావాళ్ళని ఓదారికి తెద్దామనీ నిన్ను ఒక ఇంటిదాన్ని చేసి రెండోదాని పెళ్ళికూడా చేయాలని నేనాలోచిస్తూంటే వాడు గాలిలో మేడలు కట్టి అసలుకే మోసం తెస్తున్నాడు." పార్వతమ్మ నిట్టూర్చింది.

"అమ్మా ఇంత దూరదృష్టివున్న నువ్వు తాతగార్కి వాళ్ళ ఆస్తి కాక నీదీ యిచ్చి బంగారం వెండీ అంతా యెలా పోగొట్టుకున్నావమ్మా?"

"అదంతా విధి ఆడించిన నాటకం అమ్మా. నేను నెత్తీ నోరూ కొట్టుకుని చెప్పాను మీ నాన్నగార్ని కనీసం నాదైనా మిగలనీయండి పిల్లలున్నారూ అని. ఆయన వింటేనా! అహంకారం ముక్కోపితనం దూరం ఆలోచించకపోగా నామాట అంటే నిర్లక్ష్యం అవన్నీ యిచ్చేవరకూ 'నరకం' పెట్టేశారు. నేనేం చెయ్యను. ఆస్తి యివ్వనని పుట్టింటికి వెళ్ళి పరువు బజారుపాలు చేసుకోలేక పోయినందుకే యిప్పుడు నేనూ నాతోబాటు మీరూ చేయని తప్పులకి 'శిక్ష' అనుభవిస్తూన్నాం. యివన్నీ సరేగానీ మన సూరయ్యగారి బావమరిది విజయవాడలో గవర్నమెంటు నౌకరీ చేసుకుంటూన్నాడుట. అబ్బాయి బాగానే వున్నాడు బుద్ధిమంతుడూ. పిల్ల నచ్చితే కట్నం నాలుగు వేలు చాలు అన్నాడు. రెండు రోజుల్లో అతనువచ్చి నిన్ను చూసుకుంటాడు. యీ సంబంధం ఖాయం కావాలని ఆ దేవుడికి యెన్నో మొక్కులు మొక్కుకుంటూన్నాను. కట్నం నాలుగు కాక మరో మూడువేలైనా అయితే నీ పెళ్ళి అయిపోతుంది". తనలో తనే అనుకుంటూన్నట్లు అంది పార్వతమ్మ.

సుమిత్ర నెత్తిన పిడుగు పడినట్లు అయింది "అమ్మా" అంది యెలా తప్పించుకోవాలి అని ఆలోచిస్తూ

"యేమ్మా "

"ఇప్పుడు 7 వేలు యెక్కడినుంచి వస్తాయి మనకి "

"ఇల్లు బేరం పెట్టేశాను."

"ఇల్లు అమ్మితే మీరంతా ?"

"భగవంతుడే వున్నాడు."

"అమ్మా నా పెళ్ళికి తొందరలేదు. ఇల్లు అమ్మవద్దు."

"ఉలా గడ్డి పెట్టవే మీ అమ్మకి." అంటూ కుంటుకుంటూ అక్కడికి వచ్చి కూర్చున్నాడు వెంకటరావు

పార్వతమ్మ ఉదాశీనంగా భర్తవైపు చూసి, "అమ్మను నతే. మరి పిల్ల పెళ్ళి చెయ్యండి చూస్తాను" అంది కోపంగా.

"నీ వలా చూస్తూవుండు నోరుమూసుకుని. నేను చేస్తాను పెళ్ళి." అని భార్యని యీసడించిపారేస్తూ కూతురి వైపుకి తిరిగి,

"అమ్మా సుమిత్రా! నేనోటి చెప్తాను విను. భేషైన సంబంధం చూశానమ్మా, నీకోసం. అతనికి పేరుకి మూడో పెళ్ళి కానీ ముప్ఫై పైన వయస్సు లేదు. కాస్త నలుపు అయితేనేం నోట్లో నాలిక లేదు. మనం ఔను అంటే ఔను కాదు అంటే కాదు బోలెడంత డబ్బుంది ఇల్లు వాకిలి పొలం తోటలు అబ్బో యెన్నో. అతను యేమన్నాడో తెల్సునా. 'పెళ్ళి అయిన తక్షణం హనీమూన్‌కి కాదండీ మేం వెళ్ళేది. మామగారూ మిమ్మల్ని తీసుకువెళ్ళి మద్రాసులో (కరెంట్ ట్రీట్‌మెంట్) యిప్పిస్తాను. కాలూ చెయ్యీ క్షణంలో వచ్చేస్తుంది అన్నాడమ్మా."

సుమిత్ర తెల్లబోయి చూసూ అలాగే కూర్చుంది. వెంకట్రావు భార్య ముఖం మాడ్చినా లెక్కచేయక యింకా చెప్పుకుపోతూనే వున్నాడు.

"చూడు తల్లీ అతను సూర్యాన్ని ఇంజనీర్‌ని చేస్తానన్నాడు. చెల్లాయిని పదివేలు కట్నంతో పెళ్ళిచేస్తాడు! యీ పాతఇల్లు పీకిపారేసి సరికొత్త డాబా వేయిస్తాను అన్నాడమ్మా అతని కింత డబ్బు యెక్కడిద అని ఆశ్చర్యపోకు. దానికో రహస్యం వుంది. వాళ్ళకి పెరట్లో తవ్వుతూంటే 'లంకెబిందెలు' దొరికాయి. వాటినిండా నవర్సులేనట యీ విషయం యెవ్వరికీ తెలియకూడదని గోప్యంగా వుంచాడు. 'పెళ్ళి అయేవరకూ యెవరికీ యే సంగతీ చెప్పకండి మామగారూ. ఆపైన చూడండి నే చెప్పిన ప్రతిమాటా చెల్లింపుకు తీరతాను' అని ప్రమాణంచేసి మరీ చెప్పాడు అసలు అతనికీ మనకీ మధ్యవర్తులు చెరుకనకనే యీ రహస్యం దాచేశాను" అని యింకా చెప్తున్న తండ్రి మాటలు వినే శక్తి లేక సుమిత్ర తల తిప్పేసుకుంది. కాని పార్వతమ్మ

భగ్గుమంటూ "వాడి యిద్దరు పెళ్లాలూ యెలా చచ్చారో కాస్త విచారించారూ" అంది

"యెలా చస్తే మనకేం?" ఉదాశీనంగా అన్నాడు.

"ఆడపిల్ల నివ్వాలన్నప్పుడు వరుడి వివరాలన్నీ తెలుసుకో నక్కరలేదూ ఆ యిద్దరూ 'వురి' పెట్టుకుని మరీ చచ్చారు తెలుసునా. దబ్బుంది దబ్బుంది అని ఒకటే దబ్బా కొడుతున్నారు. లంకెబిందెలు దొరికాయనటం అదీ అంతా 'హంబక్' నుళ్ళి మోసం చెయ్యటానికే. నిజంగా బిందెలేవుంటే నాకు చూపించమనండి" సవాల్ చేస్తూన్నట్లు అంది

"మనం చూస్తే అవి మాయం అయి నేళ్లు జెర్రులూగా కన్పిస్తాయట."

"యీ కాలంలో కూడా మీలాంటి అమాయకులు వుండబట్టే అలాంటి మాయదారి మాటలు చెప్పేవాళ్ళున్నారు. యెన్నన్నా చెప్పండి మీరు చెప్పిన సంబంధం చస్తే జరగదు కన్నబిడ్డని మాస్తూ చూస్తూ అలాంటి దిక్కుమాలిన పెళ్ళి యే తల్లిదండ్రులూ చెయ్యరు. అసలు మీకు కాలూ చెయ్యాతోబాటు మతి కూడా పోయింది అయినా నా కింకా మతివుంది. కనకనే పెళ్ళి చస్తే జరగనీయను"

"ఏమిటీ దీనికి విఘ్నం నువ్వే తెస్తున్నావా? ఇదిగో సుమిత్ర నా కూతురు. దాని పెళ్ళి నా చేతులలో నా యిష్టప్రకారం జరిగితీరుతుంది. నువ్వు అవునన్నా కాదు అన్నా యీ పెళ్ళి జరిపించేస్తాను. సుమిత్ర వచ్చింది, వచ్చి చూసుకోండని యివాళే కబురుపెడతాను"

సుమిత్ర తల్లిదండ్రులని వారిస్తూ "అబ్బబ్బా యింక ఆగండి. నా కసలు పెళ్ళి యిప్పుడే వద్దు." అంది శాంతింపచేయాలని చూస్తూ.

"అలా అనవే తల్లీ" అని పార్వతమ్మ నెత్తి కొట్టుకుంది

"వద్దూ వద్దూ అనేమాట నేను వినను కాదంటే కాళ్ళుచేతులూ కట్టి మరీ పెళ్ళిచేసి తీరతాను" వెంకటరావు కల్లుతాగిన కోతిలా గంతులు వేస్తూన్నాడు. పార్వతమ్మ యింకా యింకా మాట్లాడాలి అనుకుని సుమిత్ర ముఖంచూసి 'ఛీ' అనుకుంటూ తనే తగ్గి లోపలికి వెళ్ళిపోయింది ఇంక వెంకట్రావు లేస్తూ కర్రసాయంతో నడుస్తూ,

"ఇదిగో సుమిత్రా? నేను వాళ్ళకి మాట యిచ్చేశాను. కనుక వొప్పుకుతీరాలి కాదన్నారా నేనీ యింట్లో క్షణం వుండను. సన్యాసుల్లో కలిసిపోతాను ముందే చెప్తూన్నాను, నీకు తల్లి కావాలో తండ్రి కావాలో నిర్ణయించుకో" అంటూ

బొంగురుపోయిన గొంతు సరిచేసుకోవటానికి ప్రయత్నిస్తూ, "ఒసే చిన్నమ్మాయ్ నోరెండిపోయింది కాస్త కాఫీ అయినా నా ముఖాన తగలెయ్యి" అంటూ వసారాలోని తన సింహాసనంమీద కూర్చున్నాడు కర్ర పక్కన పెట్టుకుని.

సుమిత్రకి గుండె బరువెక్కిపోయింది. తండ్రి స్వభావం యెంతకీ అర్థం కాదు. తల్లి నిస్సహాయతకి జాలి ముంచుకొస్తోంది. తన పెళ్ళి విషయం యింత జరుగుతుందని తెల్సివుంటే అసలు యిక్కడికి రానే రాకపోయేది. శలవులేదని ఒక్కమాట రాసేసేది. కానీ యిప్పుడెలా! భగవాన్. తల పగిలిపోతుంటే కణతలు నొక్కుకుంటూన్న సుమిత్రకి చెల్లెలు "కాఫీ తాగు అక్కా" అని తెచ్చి అందించింది.

వద్దు అనబోయి అదైనా తాగితే కాస్త హాయిగావుంటుందేమో అనుకుంటూ 'యివ్వు' అని కప్పు అందుకుంది. కాఫీ తాగేసి కళ్ళు మూసుకుని పడుకుంది. ఆలోచనలు యెటెటో పోతున్నాయి.

తనీ పెళ్లి చచ్చినా చేసుకోదు. కానీ మనమాట కాదన్నదనే కోపంతో తండ్రి నిజంగానే యిల్లు వదిలి వెళ్లిపోతే! యీ సంసారం గతియేమిటి! యీ మాటకి అమ్మ కాస్త కూడా భయపడదేం! యీయన వున్నా సంసారంకోసం చేసేదేముంది అన్న నిర్లిప్తతా అమ్మకి. భగవాన్ ఎలా యీ గండం గడుస్తుంది!.

సుమిత్రకి తన చిన్నప్పటి విషయాలు కొన్ని గుర్తుకొచ్చాయి అప్పటికి తమ ఆస్తి పూర్తిగా పోలేదు. తండ్రి హుషారుగా వుండేవాడు. చెల్లెలినీ తమ్ముడినీ యెంతప్రేమగా చూసేవాడు. తనకోసం కూడా మంచి ఫ్రాకులు తెచ్చి 'తల్లీ సుమిత్రా' అని గావు కేకలు పెట్టి తను వచ్చిన తర్వాత అమాంతం యెత్తుకుని ముద్దుపెట్టుకుని 'చూడమ్మా యీ ఫ్రాకు యిప్పుడే వేసుకుని నాకు చూపించాలి. క్విక్ వెళ్ళు' అనేవాడు. పార్వతమ్మ అది పండుగకే అట్టే పెడతాను అన్నా ఆయన వీల్లేదు. పండగకి మరోటి తెద్దాం లేవోయ్ అనేసి ఆ గౌను వేసుకుని వచ్చిన కూతురి రెండు చేతులూ పట్టుకుని గిరగిరా తిప్పి,

"వెరీగుడ్. నేను వూహించిన దానికంటే యింకా బాగుంది నా తల్లి" అని పొంగిపోతూ తన తల్లిదండ్రులకేకాక స్నేహితులకి కూడా చూపించి మురిసి పోయేవాడు. నాన్నకి ఆ ప్రేమ అంతా యిప్పుడు యేమైపోయింది. తండ్రి ప్రకృతి పూర్తిగా అర్థంచేసుకుంది సుమిత్ర. తన స్థితి బాగున్నప్పుడు అందరినీ బాగా చూసేవాడు. అయితే ఒకే ఒక్క బలహీనత. తల్లిదండ్రుల మాటకి కాదు'

అని చెప్పటం అలవాటులేదు. ఒకవేళ చెప్పాలన్నా భార్యమాటలు వింటూన్నాడని అనిపోగలరన్ని ఒకే ఒక్క భారం ఆస్తిఅంతా హారతికర్పూరంలా హరించి పోతూన్నా ఆయన్ని పెదవి కదపనీయలేదు భార్య ముందుచూపుతో చేసే హెచ్చరికకి విలువ యివ్వలేదు యింక డబ్బంతా పోయినతర్వాత యీ ఆర్థిక యిబ్బందులు తట్టుకునే శక్తిలేక, సహనంపోయి చీటికీ మాటికీ తల్లిమీద చికాకుపడ తన ఆవేశాన్ని వెళ్ళగక్కి తేలికపడుతూ వుండేవాడు. యివన్నీ ఆలోచిస్తే నిజంగా తండ్రిని ద్వేషించలేదు సుమిత్ర. కానీ జరిగి పోయిన విషయాల అన్నీ తెలియని తమ్ముడూ చెల్లెళ్ళు రాక్షసుడుగా కన్పి చే తండ్రిని చూసి అసహ్యాన్ని పెంచుకుంటూన్నారనేది కూడా గుర్తించగల్గింది సుమిత్ర... యిది మరీ ప్రమాకరదమైన విషయం. కానీ వాళ్ళలో ఆ భావాలు పోగొట్టటం యెలా! తండ్రి మారాలి. అది అసంభవం. అమ్మ అట భర్తతో యిటు పిల్లలతో యెలా సమన్వయపర్చగల్గుతుంది! ఉహూ సుమిత్ర యింక ఆలోచించలేక అలిసిపోయి అలాగే వుండిపోయింది.

సాయంకాలం చెల్లెలు "గుడికి వెళ్ళవద్దాం రా అక్కా" అని బలవంతం పెట్టటంతో బద్ధకంగా వున్నా బయలుదేరక తప్పలేదు సుమిత్రకి ఇద్దరూ కోవెల చేరుకున్నారు. దారిలో సూర్యనారాయణగారు సుమిత్రని పల్కరించి 'బాగున్నావా అమ్మా. ఆడపిల్లవైనా అంతదూరంలో ధైర్యంగా వుద్యోగం చేసుకుంటూ వుండటమేకాక ఆర్థికంగా చితికిపోయిన తల్లిదండ్రులకి ఆసరాగా నిల్చావు తల్లీ యిందుకు మాత్రం నీ తల్లిదండ్రులు చాలా అదృష్టవంతులు" అంటూ అరవైయేళ్ళ మాష్టారు అంటూంటే సుమిత్రకి కాస్త తృప్తిగా పిసరంత గర్వంగా అన్పించింది. తను చేసే యీ పనిలో యిన్ని అర్థాలు వున్నాయనే తెలియదు. యీ భారం నెత్తినపడిందని చాలాసార్లే విసుక్కుంది కానీ ఉత్తమోత్తముడైన సూర్యనారాయణ మాష్టారు యింతగా అభినందిస్తూ వుంటే సుమిత్రకి తృప్తితోపాటు యీ సంసారం ఒకదారికి వచ్చేవరకూ అసలు వెళ్ళేసుకోకూడదు అనిపించింది ఆక్షణంలో. యీ మాష్టారిని చిన్నప్పటినించీ యెరుగుంది తను. ఈయనంటే చెప్పలేనంత గౌరవం సుమిత్రకేకాదు ఆ వూళ్ళో చాలా మందికి ఆయనకి జీవితంలో తనకంటూ మిగుల్చుకున్నది యిది ఒక్కటే నిస్వార్థపరుడిగా బతికి ఆస్తి అంతా యిఖరైనా ఆయన ఆసరాతో యెందరో పైకి వచ్చారన్న నిజం ప్రత్యర్థులు కూడా ఒప్పుకుతీరతారు. ఆయన ఆ రోజుల్లో పొంగిపోలేదు యీ నాడు కృంగిపోవడంలేదు. పిల్లలందరూ దూర




దేశాలకి బ్రతుకుతెరువు వెతుక్కుంటూ వెళ్ళిపోయినా ఈయన మాత్రం యీ వూరినీ, యీ దేవాలయాన్నీ వదలలేక యిక్కడే ఓ చిన్న కుటీరంలో వుంటూ యీ యీశ్వరుడిని సేవించుకుంటూ పదిమంది పిల్లలకి పాఠాలు చెప్పుకుంటూ వారిచ్చే కాస్తరవ్వలతో నిరాడంబరంగా జీవిస్తూ తనకి మంచివి అని తెల్సిన విషయాలు అవి తెల్సుకోవాలని దగ్గరకి వచ్చిన వాళ్ళకి చదివి విన్పిస్తూ కాలం వెళ్ళదీస్తున్నా రీయన. యీయన అంటే సుమిత్రకి చిన్నప్పటినించీ భక్తిశ్రద్ధలు అసలు ఇంగ్లీషు, హిందీ కొంతవరకు, యీయన దగ్గరే నేర్చుకుంది. 'నువ్వు పట్నంలో సంస్కృతం నేర్చుకోకూడదూ తల్లీ వీలుంటే ప్రయత్నించు.' అంటూ ఆయన చాలాసార్లే చెప్పారు సుమిత్రకి

'ఔను నిజంగా నేర్చుకుంటే బాగుండు' అనుకుంది చాలాసార్లు అయితే ఉద్యోగం వంటా పీటల్లోనే విసిగిపోయే సుమిత్రకి చదువుమీద ధ్యాసపోయేంత విశ్రాంతి మాత్రం లేదు.

ఆయన అలా అయిదునిముషాలు నిల్చునే మాట్లాడి "యింక వెళ్ళవస్తా తల్లీ. నీకు వీలుంటే ఊరికి వెళ్ళేలోపల ఒక్కసారి మా కుటీరానికి రామ్మా" అంటూ ఆయన మెల్లగా నడిచి వెళ్ళిపోతూంటే అలాగే చూస్తూ నిల్చిపోయింది. 'మాస్టారు మరీ పెద్దవారై పోయినట్లు కన్పిస్తున్నారు కదూ చెల్లాయే అంది.' ఔను, ఈ మధ్య ఆరోగ్యం కూడా బాగుండటంలేదు. యెంత వంట్లో బాగా లేకున్నా

తెల్లవారి ఆయిదింటికి దేవాలయం కోనేరులో చన్నీళ్ళ స్నానం చేయాల్సిందే. ఆ దేవుడిని మొట్టమొదట తను చూడాల్సిందే" అంది.

"ఔను కదూ" అంటూనే దేవాలయంలోకి అడుగుపెట్టారు. నాలుగిళ్ళ అవతలున్న రాజమ్మ కన్పించి, "అబ్బో సుమిత్రా యెప్పుడొచ్చావూ! యేమిటీ! బాగున్నావా! యింతకీ నీకు జీతం యెంత! రోజూ సినిమాలు చూస్తావా! వుద్యోగం చేసే పిల్లలకి వంటెలా కుదురుతుందో హోటలు భోజనమేనా! హాయిగా వుంటుంది కదూ! అన్నట్లు సుమిత్రా నీ పెళ్ళెప్పుడే! మాకు పప్పన్నం యెప్పుడే నీ వింకా అలా కుర్రపిల్లలా కూర్చుంటే నీ చెల్లెలు చూడు గుర్రంలా యెదిగిపోయింది. అంతపొడుగ్గా ఫుల్‌స్టాప్ లేకుండా ఎదిగేస్తోంది" అంది ఆవిడ గంట గణగణా మోగిస్తూనే.

ఆవిడకి మెల్లిగానే జవాబిచ్చి దేవుడిని దర్శించుకుని ఆలయం యివతలికి వచ్చి కూర్చున్నారు అక్కచెల్లెళ్ళు యిద్దరూ చెల్లెలు యేదో చెప్పాలనీ చెప్ప లేక మరేవో కబుర్లు చెప్తోన్నదనీ యిప్పటికి గ్రహించిన సుమిత్ర తనే ఆప్యాయంగా చెల్లెలి చేతికి తన చేతిలోకి తీసుకుని అడిగింది "ఏం చెల్లాయ్. ఏమైనా చెప్తావామ్మా. ఆలోచనెందుకు, చెప్పు అసలు విషయం యేమిటి'' అని అడిగింది. లక్ష్మి మెల్లగా గొంతు సవరించుకుని "అక్కా మరేం అనుకోకు. నాన్న చెప్పలా ఆ సంబంధం నువ్వు చేసుకుంటావా'' అంది బెరుగ్గా చూస్తూ.

''ఎందుకు?''

''వూరికేనే '

''కాదు. యేదో కారణం వుంది. చెప్పు.''

"నీకు తగిన సంబంధంకాదది నువ్వు చేసుకోవనీ తెలుసు నాకు."

''ఔను చస్తే చేసుకోను.''

"అలా అయితే... అక్కా... పోనీ ఆ అబ్బాయిని నేను చేసుకుంటాను"

'లక్ష్మి'' సుమిత్ర చెల్లెలి చెయ్యి గట్టిగా పట్టుకుంది.

"నేనిలా మాట్లాడటం బాగుండదని తెల్సు నాన్న గొప్ప సంబంధం తేలేదనీ తెల్సు నాఅంతట నేను యెవరినీ ఆకర్షించలేననీ తెల్సు? అందుకే యెవరో ఒకరు. నాకు పెళ్ళిఅయిపోయి యిక్కడినించి దూరంగా వెళ్ళిపోవాలనివుంది మళ్ళీ తిరిగి యిక్కడికి రావాలని లేదు" అక్క కళ్ళలో నీళ్ళుతిరిగాయి. తల్లి దండ్రుల మధ్య సామరస్యం లేకపోవటంతో యెప్పుడూ దగ్గర వుండవల్సిన లక్ష్మి అశాంతిపడి ఈ అభిప్రాయానికి వచ్చేసిందని గ్రహించిన సుమిత్ర

ఆత్మీయంగా చెల్లెలివి దగ్గిరికి తీసుకుని భుజంమీద చెయ్యివేసి "చెల్లీ! త్వరలోనే మన కష్టాలు గట్టెక్కుతాయమ్మా. భయపడకు. నేను పెళ్ళి తర్వలోనే చేసుకుంటాను అయితే నీకూ వరుడిని ఖాయంచేసి సుమా. రెండు పెళ్ళిళ్ళూ ఒకేసారి అయిపోవాలి అన్నట్లు అమ్మ ఓ సంబంధం చెప్పిందే అతన్ని నువ్వు యెరుగున్నావా. ఈ ఊరు చాలాసార్లు వచ్చారటగా."

"చూశాను బాగానేవుంటాడు కానీ... అతన్ని చూస్తున్నది నీకు"

సుమిత్ర లక్ష్మి అమాయకత్వానికి నవ్వి. "నేను చూస్తున్నది నీకు. సరేగానీ అమ్మతో మాట్లాడి చెప్తాను" చాలా సేపయిందని ఇద్దరూ లేచి ఇంటి ముఖం పట్టారు. అప్పటికే ఏడుగంటలయింది. యింకా పిళ్ళిద్దరూ రాలేదా అని వెంకట్రావు గంతులేస్తూన్నట్లు యెగిరెగిరి పడుతున్నాడు.

## 6

సుమిత్ర యింక తల్లిదండ్రులకి ఈ రోజు యెలాగో నచ్చచెప్పి ఒకటిరెండు రోజుల్లో వెళ్ళిపోవాలని ఆలోచిస్తోంది కూతురు వచ్చిందని పార్వతమ్మ "కాస్త పులిహోరన్నా చేస్తాలే అమ్మా" అంటూ ప్రయత్నం ప్రారంభించింది. వంటయింట్లో యేవేవో శబ్దాలు విన్పిస్తూన్నాయి. అప్పటివరకూ సూర్యం "వ్యాపారం వ్యాపారం" అంటూ వంద ప్లానులూ వాటికి వివరాలూ చెప్పి "అక్కా అసలు వ్యాపారం అంటే అంత భయం యెందుకే. రెండు వేలతో ప్రారంభించవచ్చు. అదీ యెక్కువే అనుకుంటే అయిదువందలు నా ముఖాన పారేయి. దాంతో మునిగినా తేలినా మళ్ళీ నిన్నో నయాపైసా అడగను." అని అన్నాడు. సుమిత్ర "తర్వాత చూద్దాంరా" అని విసుక్కున్న తర్వాతగానీ అక్కడనుంచి కదలలేదు. "పీడిప్లానులు బాగానే కన్పిస్తూన్నాయి. కానీ పెట్టుబడే వచ్చేదారి లేదు" అనుకుంటూ "స్నానం చెయ్యి అక్కా" అన్న లక్ష్మి పిలుపుకి 'వస్తూన్నా' అని జడవిప్పి నూనెరాసుకుని తువ్వాలూ మరోచీరా పట్టుకుని పెరటిలోకి వెళ్ళబోతూ "అబ్బ! యివాళ ప్రొద్దున్నించే ప్రారంభమైంది వెధవ వాన' అనుకుంటూ వుండగా వాకిట్లో యెవరిదో కొత్తగొంతు విన్పించింది.

"వెంకట్రావుగారి ఇల్లు యిదేనా అండీ" అని

'యెవరబ్బా' అనుకుంటూ యివతలకి వచ్చింది సుమిత్ర. ఓ ఇరవై యేళ్ళ కుర్రాడు వర్షంలో పూర్తిగా తడిసిపోయి చేతిలో ఓ సూట్ కేస్ పట్టుకుని నిల్చుని అడుగుతూ 'ఇదే ఇదే' అని పిల్లలు అరవటంతో వసారా దగ్గరగా వచ్చి "ఆయన వున్నారా అండీ" అడిగాడు.

"నేనే వెంకట్రావుని యేంపనీ" నులకమచంమీద లేచి కూర్చుంటూ తండ్రి అడుగుతూంటే సుమిత్ర లోపల వాకిలిదగ్గరే నిల్చుండిపోయింది.

"నేను... నేనూ..."

"నువ్వేనయ్యా. యెందుకూ యేమిటీ అని అడుగుతున్నాను" ఆయన కంఠం ఖంగుమంది. ఆ కుర్రాడు సూట్ కేస్ అక్కడపెట్టి, ముఖంమీద తడి తుడుచుకుంటూ "మీ... తమ్ముడు లేరండీ... ఆయన... అదే హరికృష్ణ గారు..."

"మా తమ్ముడి దగ్గరనుంచి వచ్చావా? ఆ! అయితే లోపలికిరా నాయనా. ఔనూ మా తమ్ముడు యిప్పుడెక్కడవున్నాడూ, బాగున్నాడా. వాడికి అన్నయ్య యింకా గుర్తువున్నాడా! వుంటే యిన్ని సంవత్సరాలు నా దగ్గరికి రాకుండా వుంటాడా. ఒసేయ్ చిన్నమ్మాయ్... తర్వగా ఓ గ్లాసు కాఫీ పట్టుకురా. యిదిగో మీ చిన్నాన్న దగ్గరనుంచి మనిషి వచ్చాడని మీ అమ్మకి చెప్పవే. చెప్పి ఆ వంటింట్లోనించి ఓసారి యివతలకి తగలడమను. అన్నట్లు అక్కయ్యని కూడా రమ్మని చెప్పమ్మా... ఆ .. యేమయ్యా అలా కూర్చో యిప్పుడు చెప్పు— ఫర్లేదు కూర్చో. అన్నట్లు మా తమ్ముడెలావున్నాడు. భాగా డబ్బు సంపాదిస్తూన్నాడని తెల్సింది మధ్య. నిజమేనా ఆ సంగతి. అన్నట్టు నీకు బాగా తెల్సివుండాలి కదుటోయ్. చిన్నమ్మాయే లక్ష్మి ఇతని కిచ్చేవ్వుడే నాకూ మరోగ్లాసు కాఫీ తీసుకురామ్మా" అని గుక్కతిప్పుకోకుండా చెప్పిన తర్వాత కుర్రాడు,

"ఆయన...దే యీ పెట్టె... యిదీ..." అతని నోట్లోనించి మాట రావటం లేదు. "యేమిటీ ఈ పెట్టె వాడిదా! నిజంగానే... వాడు నీ వెనక వస్తున్నాడా? హటాత్తుగా వస్తే ఆ సంతోషంలో గుండె ఆగి చస్తానేమో అని ముందు నిన్ను పంపాడా నా తమ్ముడు. చెప్పవయ్యా నీళ్ళనమలక. చెప్పు నాయనా మరేం ఫర్లేదు. ఈ గుండె ఇనుముతో కాదు వుక్కుతో చేసింది. కాకుంటే మా తల్లి దండ్రులు చచ్చినప్పుడూ ఆస్తిఅంతా అప్పులవాళ్ళు వేసుకు వెళ్తూన్నప్పుడూ చెల్లాయి లేచిపోయినప్పుడు యెప్పుడో ఆగి వూరుకునేది. కనుక నీకా భయం అక్కర్లేదు. తమ్ముడే వస్తూంటే చెప్పు. నేనే యెదురు వెడతా, ఏం...."

"అదంతా యేం కాదండి".

"మరేమిటండీ"

"పెట్టెలోని వస్తువులన్నీ ఆయనవే. అవన్నీ మీకు యిచ్చిరమ్మనీ..."

"రమ్మని!?"

"మా అక్క పంపింది" పెట్టె మీసు అన్నమాట వినటంతోనే సూర్యం గభాలున వచ్చి పెట్టెలాగి తాళంచెవి అందుకుని తెరిచే ప్రయత్నంలో పడ్డాడు.

ఇంతలో పార్వతమ్మ వచ్చి "అయ్యో తడిసావు. యీ తువ్వాలుతో తుడుచుకో'' మంచినీళ్ళు కావాలా. కాఫీ తర్వగా తేవే అమ్మాయీ అని "నీ పేరేంటి బాబూ" అంది పెట్టె చుట్టూ చేరిన పిల్లలు కోలాహలం చేస్తూన్నారు. ఒకటే రణగొణ ధ్వనిగావుంది.

"నా పేరు గోవిందు" అంటూన్న అతని ముఖం వాడిపోయివుంది.

సూర్యం పెట్టెతాళం లాగేసి వస్తువులన్నీ తీసి యివతల పారేస్తూన్నాడు. కొన్ని ఖరీదైన పంచలూ లాల్చీలూ పాంట్లూ షర్టులూ ఒక స్వెట్టరూ మఫ్లరూ కొన్ని నాటకాల పుస్తకాలూ నాలుగు వెండి కప్పులూ (బహుమతి గెల్చుకున్నవి) యివన్నీ కాక పెట్టె అడుగున గాల్డాడబ్బా మూత బిగించివున్నా మధ్యగా సన్నటి రంధ్రం వుండి రెండు ఇంచిల వెడల్పున డబ్బా నిండా కాయితం అంటించివుంది. దానిమీద అందమైన అక్షరాల్లో "సుమిత్రా కళ్యాణం" హుండీ అని రాసివుంది. ఆ వాక్యాన్ని సూర్యం గట్టిగా చదివి డబ్బాని యిటూ అటూ కదిలించి ఒక కన్ను మూసి రంధ్రంలోకి చూసి 'అమ్మోయ్... దీంట్లో నోట్లు న్నాయమ్మా...డబ్బువుందే... చాలానే వున్నట్లుందమ్మా'' గావుకేక పెట్టాడు.

సూర్యం కేక, 'సుమిత్రా కళ్యాణం' అన్నమాట విని సుమిత్ర నిర్ఘాంతపడింది. ఆ డబ్బానీ దానిమీద రాసిన అక్షరాలనీ చూస్తూ బొమ్మలా నిల్చుండిపోయింది. ఇంతలో "ఒరే అన్నాయ్... యిదేంటి పుస్తకంలావుంది" అన్న తమ్ముడి చేతి లోని డైరీలాంటి పుస్తకం యిటూ అటూ తిప్పిచూసి "బూడిద. దీంట్లో యేంలేదు" అని గిరాట్టు కొట్టాడా డైరీని. అది సరిగా సుమిత్ర కాళ్ళదగ్గరే పడటంతో అది అందుకుని తిప్పి చూస్తూ 'చిన్నాన్న డైరీ' అనుకుంటూ యింతలో సూర్యం కేకకి అటు తలతిప్పింది.

"నాన్నోయ్... వుంగరం..." అంటూ చేతివేలికి సరిపోతుందో లేదో అని వేలికిపెట్టి చూసుకుంటూ మురిసిపోయాడు క్షణం సూర్యం. "ఒరే సూరిగా. అది యిలాతే" అంటూ తండ్రి గట్టిగా అరిచేసరికి ముఖం ముడుచుకుని వెళ్ళి తండ్రి చేతిలో పడేశాడు. వెంకట్రావు వేలుకి తొడుక్కోవాలని ప్రయత్నించీ రెండో చెయ్యి స్వాధీనంలో లేక "అరె సూరిగా యిలారా. నా వేలికిపెట్టు'' అని పెట్టించుకుని దాన్ని తిప్పి తిప్పి చూసుకుంటూంటే ''నీకు బాగా యిరుకైంది

నాన్నా. నాకు సరిగ్గా సరిపోయింది'' అన్నాడు. "కుర్ర వెధవ్వి నీకేందుకు ఇంకా యేమున్నాయో సరిగ్గా చూడు. అన్నట్లు ఆ డబ్బా పగలగొట్టు. యెంత డబ్బుందో చూద్దాం" అన్నాడు ఆశగా పెట్టెవైపు చూస్తూ సూర్యం డబ్బా పగలగొట్టే ప్రయత్నంలోవుండగా వెంకట్రావు గోవిందు వైపుకి తిరిగి అడిగాడు.

"చూడు యీ పెట్టి మా తమ్ముడు అసలెందుకు పంపినట్లూ?"

"ఆయనకాదు... మా అక్క పంపింది''

"అంటే"

''మా అక్క అంటే మీ తమ్ముడుగారి భార్య. పేరు సుమతి."

"ఏమిటీ! మా తమ్ముడికి పెళ్ళిఅయిందా! నాకు తెలియకుండానే?"

''నాకు తెలియదు ఆ విషయాలన్నీ"

"పెళ్ళాం అన్నమాట అబద్ధం. బహుశా వుంచుకున్నాడేమో! అంత మాత్రాన తాళికట్టిన భార్య అయిపోతుందా! సరేగానీ అయితే మీరెన్ని కాజేసి మాకీ కాసినిపంపారూ."

"మాటలు జాగర్తగా రానీయండి. మా అక్క అలాంటిది కాదు. యివాళా రేపూ కులమింటి స్త్రీలే శీలాన్ని అమ్ముకుని వేశ్యలకన్నా కనాకష్టంగావున్నారు. కానీ మాకింకా 'నీతి' వుంది"... ఆవేశంతో వూగిపోతూన్నాడు గోవిందు.

"యేం కూశావురా" యెప్పుడూ ప్రక్కనేవుండే కర్రనిగోవిందుమీదకి విసిరి కొట్టాడు వెంకట్రావు. గోవిందు భయపడి రెండడుగులు వెనక్కి వెయ్యకుంటే ఆ కర్రదెబ్బకి ముఖం పగిలిపోయేదే. యింతలో సుమిత్రాకళ్యాణం డబ్బా మూత లాగేసి "మూత వచ్చేసిందోచ్" అని బిగ్గరగా అరిచారు పిల్లలు.

"సూరిగా! ముందా డబ్బా యిలా నా దగ్గరకి పట్రా" గభాలున లేవలేదు గానీ లేకుంటే ఆ డబ్బా లాక్కోవాలన్నంత బంగారు కన్పిస్తోంది ఆయనలో.

"నీకు చస్తే యివ్వను నాన్నా. యీ డబ్బాతో వ్యాపారం పెడతాను." అంటూన్న సూర్యానికి ఆఖరి చెల్లెలు "అసలెంతవుందో ముందు లెక్కపెట్టరా అన్నయ్యా" అని సలహాయిచ్చింది. వెంకట్రావు "ఒరే వెధవా నా మాట వినరుటరా. యిలా యివ్వకుంటే 'మీ ప్రాణాలు తీసేస్తాను" అనేసరికి ఆఖరి పిల్ల భయపడి, ''చచ్చినా యివ్వను" అంటూన్న అన్నగారి చేతిలోనించి అమాంతం డబ్బాలాక్కుని తండ్రి దగ్గరకి పరుగెత్తింది. యింక ఆ డబ్బావైపు చూసుకుంటూ "ఒరే సూరిగా దీంట్లో యెంతవున్నా సరే యీ డబ్బుతో

మద్రాసు వెళ్ళి కరెంటు ట్రీట్‌మెంట్ తీసుకుని కాలూ చెయ్యీ తెచ్చుకుని పెద్ద వుద్యోగం సంపాదించి మీ అందరినీ అందలాలు యెక్కిస్తానురా. పెద్దక్కా చిన్నక్కా పెళ్ళి, సూరిగాడి వ్యాపారం యింకా యింకా వీటిన్నిటికీ సరిపడంత డబ్బు నే సంపాదిస్తాగా" అంటూండే సూర్యం అవన్నీ జరిగి చచ్చేవేలే" అని వుక్రోషం పట్టలేక డబ్బాలాక్కున్న చెల్లెలిని అని వీపుమీద రెండు వేసేసరికి ఆ పిల్ల భారుమంటూ యేడవటం మొదలుపెట్టింది

పార్వతమ్మ ఆ పిల్లని దగ్గరికి తీసుకుని "ఒరే సూర్యం. ఆ డబ్బు నీ వ్యాపారానికీ కాదు మీ నాన్న వైద్యానికీ కాదు అది సుమిత్ర పెళ్ళి కింద ఖర్చు చేయాల్సింది. పెళ్ళికొడుకు కట్నం వద్దన్నా ఖర్చులు మనవి కావాలిగా ఇల్లు అమ్మకుండా దాని పెళ్ళి క్లుప్తంగా కానిచ్చేస్తాను" అంది దృఢస్వరంతో.

"యేమిటీ కూస్తూన్నావ్! నేను జీవితాంతం మంచంలో పడేవుండాలనా నీ వుద్దేశ్యం! నీ కూతురు పెళ్ళికి ఖర్చు చేస్తావా డబ్బుని యేడవ లేక పోయావ్. ఆ మూడో పెళ్ళివాడికిస్తే యెంచక్కా వాడే మనకి ఎదురు ఓ యిరవైవేలు యిస్తాడుగా యీ దరిద్రం తీరికపోదు అని నేను సలహా యిస్తే నువ్వు మళ్ళీ పాతపాటే పాడుతూన్నావా ఇదిగో నువ్వుగానీ నీ కూతురుగానీ నా మాటకి యెదురు చెప్పారా గొంతు నొక్కేస్తాను."

ఆయన ఆవేశంతో వూగిపోతున్నాడు గుంటలు పడిన కళ్ళు. పెరిగిన గడ్డం ఆయన్ని చూసేందుకే భయం వేస్తూన్నట్లుంది ముఖం. ఇదంతా విన్న పార్వతమ్మలో సహనం చచ్చిపోయింది. భర్తముఖంలోకి తీక్షణంగా చూస్తూ నేను నా మాట అక్షరాలా జరిపించి తీరతాను. నా జీవితంలా నా బిడ్డ జీవితం కాకూడదు. దాని బ్రతుకులో బంగారం పండాలి."

"ఏమిటీ" అంటూ ఆవేశం పట్టలేక చేతిలోని డబ్బాని విసిరి భార్యముఖాన కేసికొట్టాడు. ఒక్కరూపాయినోటూ అయిదు పదుల కాయితాలూ కొంత చిల్లరా అయిదు వందరూపాయల కాయితాలూ ఇల్లంతా చెల్లాచెదురుగా పడి పోయాయి పిల్లలందరూ అయ్యోయ్యో అంటూ అవన్నీ యేరుతూండే సూర్యం ముందుకొచ్చి అందరి చేతుల్లోవీ తీసుకుని లెక్కపెట్టి మళ్లా డబ్బాలో వేస్తూండే సుమిత్రకి పిచ్చి ఆవేశం వచ్చింది "అమ్మా...ఛీ ఛీ... యివేం మాటలమ్మా! నాన్నతోబాటు నువ్వూ ఆవేశపడిపోతూన్నావేమిటి! చూడమ్మా నా పెళ్ళికి యీ డబ్బేకాదు యే డబ్బూ వద్దు. పెళ్ళికాకున్నా నేను యేడవను మీ యిద్దరికీ నమస్కారం. యిలా యెప్పుడూ తగూ పడకండి అవతల ఆ

అబ్బాయి యెప్పటినించో అలా నిల్చునే వున్నారు కాని మీరూ మీ తగులూ ఆవేశాలూ యివేనా అమ్మా."

పార్వతమ్మ కూతురు మాటలకి ఆవేశాన్ని తగ్గించుకుని అభిమానపడిపోతూ "ఛీ ... పొరపాటు చేశాను." అనుకుంది తనలో తను ఇంతలో సూర్యం "అమ్మా రెండు వేలకి యిరవైతక్కువ వుందమ్మా" అన్నాడు. డబ్బా మూత బిగించేస్తూ తల్లిదగ్గరకివచ్చి అంతక్రితం అక్కగారి మాటలన్నీ వినితనూ బాధ పడుతూ "అమ్మా నేనూ త్వరపడి తెలియక వ్యాపారం...అదీ అన్నాను కానీ యీడబ్బు అక్క పెళ్ళికే ఖర్చుచేద్దాం అమ్మా..."అంటూ డబ్బా అందించాడు. "సరేలేరా. ఆవేశపడినాఆత్మీయతపంచుకున్నా యిందులో పరాయివాళ్ళెవరూ. అన్నట్టు లక్ష్మి గోవిందుకి కాఫీ యివ్వనే లేదుటే. అయ్యో బాబూ నిల్చునే వున్నావు కూర్చో," అంది

"వద్దమ్మా. నే నిప్పుడే వెళ్ళిపోవాలి."

"అహ అలా వీల్లేదు! భోజనంచేసి వెళ్ళాలి. అన్నట్లు యీ వెధవ గోలలో అసలు విషయం అడగనేలేదు. మా మరిది యెప్పుడొస్తానన్నాడు. బాగున్నాడా"

గోవిందు వులికివచ్చే కన్నీళ్ళని తుడుచుకుంటూ"

"నే నా విషయమే చెప్తామని నిల్చున్నాను కానీ మీరు యెవరూ విన్పించు కోవటంలేదు...ఆయన...వారంక్రితం విషజ్వరం వచ్చిపోయారు.

"ఆ..." అందరూ ఒకేసారి కేకపెట్టారు

"ఆయన మా అక్కతో యీ వూళ్ళో తన వాళ్ళందరూ వున్నారని అప్పు డప్పుడూ చెబుతుండేవారుట. ఆయన పోయేప్పుడు స్పృహలో లేరు. అంత త్వరగా పోతారని గ్రహించని అక్క మీకు కబురు చెయ్యలేకపోయింది."

"ఆయనే లేరు. ఆయన వస్తువులు మా అక్కకి యెందుకుఅని అవన్నీ మీకు అందించి రమ్మని పంపింది. ఇంతే" ఆ మాటలన్ని విన్న వెంకట్రావు "అయ్యో తమ్ముడూ" అంటూ భోరుమన్నాడు. గోవిందు ఒక్కక్షణం అక్కడ వుండలేక వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

పార్వతమ్మా సుమిత్రా సూర్యం అలాగే నిర్ఘాంతపోయారు. వెంకట్రావు యేడుపు విని యిరుగూ పొరుగూ అక్కడికి వచ్చి విషయం విని 'అయ్యో' అంటూ అనునయవాక్యాలు చెబుతూంటే సుమిత్ర చేతిలోని డైరీని చూస్తూ ఇదంతా నిజమేనా! కలకాదుకదా! అనుకుంటూ కాస్త కాస్త గుర్తువున్న పిన తండ్రిని గుర్తుకి తెచ్చుకుంటూ కన్నీళ్లు తుడుచుకుంది! వెంకట్రావు తన తమ్ముడి

మంచిగుణాలు రకరకాలుగా చెపుతూ దుఃఖాన్ని వెళ్లబోసుకుంటున్నాడు. పార్వతమ్మ అందరిచేతా స్నానాలు చేయించే యేర్పాటు చేస్తోంది

## 7

రెండురోజులు భారంగా గడిచాయి సుమిత్ర పెళ్లి సంబంధం విషయం తమ్ముడు పోయాడనే దుఃఖంలో వాయిదా వేశాడు వెంకట్రావు. పార్వతమ్మకి మరిదిపోయాడనే బాధ ఒకవైపు, పిల్లపెళ్లి కల్సివస్తుందేమో అనుకుంటే మధ్య యీ దుర్వార్త తెల్సినందుకు బాధపడిపోయింది. సుమిత్ర తల్లినీ తమ్ముడినీ దగ్గర కూర్చోబెట్టుకుని మెల్లగా నచ్చచెప్పింది పినతండ్రి కూడబెట్టిన డబ్బులో అయిదువందలు తమ్ముడికి యిచ్చి ఆ వ్యాపారమేదో జాగ్రత్తగా చెయ్యి. చూసు పెట్టుబడికే నష్టం వచ్చేలా చెయ్యకు అని మరీ మరీ చెప్పింది. ఒక్క పైసాకూడా ఖర్చుచేయవద్దు మిగతాది లక్ష్మి పెళ్లి ఖర్చుకి సరిపోతుంది. వుంచమని చెప్పింది. తన పెళ్ళి గురించి బాధపడవద్దు అనీ, సమయం వచ్చి నప్పుడు తప్పకుండా చేసుకుంటాననీ చెప్పింది సూర్యనారాయణ మాస్టారు వెంకట్రావుని పరామర్శించి తర్వాత పార్వతమ్మతో కష్టసుఖాలు మాట్లాడి తన తమ్ముడి మనవడు హైదరాబాదులో వున్నాడనీ, కట్నంలేకుండా పెళ్లిచేసుకోవా లన్నదే వాడి ఆదర్శం అనీ కొద్దిరోజుల్లో అతన్ని కలుసుకుని మాట్లాడి సుమిత్ర విషయం చెప్తాననీ చెప్పేసరికి పార్వతమ్మకి బోలెడంత ధైర్యం వచ్చింది. "బాబాయిగారూ. ఆ సంబంధం యెలాగైనా ఖాయం అయెలా చూడండి" అని ప్రాధేయపడుతూంటే ఆయన నవ్వి,

"ముందు విజయవాడవాళ్ళు లక్ష్మిని చేసుకొనే యేర్పాట్లు చూడమ్మా." అన్నారు

"అవునమ్మా. నాలుగువేలు కట్నం యిస్తాం. పెళ్లి మాత్రం చాలా సింపుల్‌గా చేస్తాం అని ముందే చెప్పించమ్మా" అంది తేలికగా వూపిరిపీలుస్తూ

"అనుకున్నవన్నీ అనుకున్నట్లు కలిసివస్తే ఆ భగవంతుడికి ఆకుపూజ చేయిస్తాను" అని దణ్ణం పెట్టుకుంటూవున్న పార్వతమ్మని చూసి చిరునవ్వు నవ్వి మెల్లగా లేచారు సూర్యనారాయణ మాస్టారు. సుమిత్ర ఆయన్ని సాగనంపుతూ కొంతదూరం వెళ్ళింది ఆయన చెప్పిన వరుడు వున్నది హైదరాబాదే అయినా అతని వివరాలు చెప్పలేదని ఆదుర్దా మనస్సులోవున్నా పైకి శాంతంగా అతిమామూలుగా మాట్లాడుతూ వుంది. ఆయన వూరివిషయాలూ, దేవాలయానికి

చెందిన ఆస్తి దుర్వినియోగం వగైరా యేవేవో చెబుతూ "యింక వుండు తల్లి నేను త్వరలోనే హైదరాబాద్ వస్తాను." అని మెల్లగా వెళ్ళిపోయారు.

సుమిత్ర ఇంటిముఖం పట్టింది. ఆలోచిస్తూనే నడుస్తోంది.

"సుమిత్రఅక్కా బాగున్నావా" చాకలి వెంకి వీపుమీది బట్టల మూటని కింద గిరాటుకొట్టి దగ్గరగా వస్తూ అడిగింది. వెంకి చిన్నప్పుడు సుమిత్రతో ఆటలు ఆటలు ఆడుకునేది యెన్నెన్నో కబుర్లు చెప్పేది. వెంకికిప్పుడు పదహారేళ్ళు అయినా పెళ్ళి అవటం ఓ పిల్లతల్లి అవటం జరిగిపోయింది. సుమిత్ర దాని సంసారవిషయాలు అడిగి అది చెబుతున్న జవాబులకి నవ్వుతూవుంటే వెంకి "నీ పెళ్ళి యింకెప్పుడూ" దీర్ఘంతీస్తూ అడిగింది సుమిత్రని

"లగ్నంనాడు" నవ్వేస్తూ అంది.

"ఆ మాట నువు చెప్పేదేంటికానీ హైదరాబాదులో యెవర్నో ప్రేమించావంటగా, అబ్బాయీ నువ్వూ కల్సితిరుగుతున్నారంటగా. సినీమాకీ, సికారుకీ..."

సుమిత్ర నిర్ఘాంతపోయింది "అలా అని యెవరు చెప్పారు నీకు?"

"యెవరేంటక్కా, వూరువూరంతా చెప్పుకుటావుంటే నేను అడిగానంతే. మన ఊరి పెసిడెంటుగారి బావమరిది అ మధ్యన పట్నం వెళ్లాడంట. ఆయన నిన్ను హోటల్లో సూశాడంట. నిన్నేకాదు నీక్కాబోయే అబ్బాయిని కూడా. అబ్బాయి దొరబాబులాగున్నాడు. అతను అల్లుడైతే పార్వతమ్మ పంట పండినట్లే అన్నాడంట ఆయన కరణంగారితో. ఆ మాట అలాఅలా నా చెవుల దగ్గర కొచ్చిందక్కా అయినా యిది మంచి విషయంగదా మరెందుకూ ముఖం మాడ్చుకుంటావూ..." వెంకి గడగడా చెప్తోంది యింకా. సుమిత్ర యింక పని వుంది అంటూ చెప్పి యిల్లుచేరింది కానీ మనసు మనస్సులో లేదు. యీ విషయం అమ్మకీ నాన్నకీ కూడా తెల్సిందా!

తెలిస్తే నాన్న వూరుకోరే! అమ్మ యేం అనుకుంటోందో! ఛీ ఛీ రాజేంద్రతో కల్సి తిరిగిన విషయం అప్పుడే యింతదూరం తెల్సిపోతుందని తను కలలోకూడా అనుకోలేదు. సుమిత్ర యేంచేయటానికీ తోచక అలా అని ఖాళీగావుండలేక సతమతమైపోతూవుంది యింతలో లక్ష్మి కాఫీయిస్తూ "అక్కా యీ నవల చదివావూ చాలా బాగుందక్కా నేను రెండుసార్లు చదివాను. చూడు యిది మొదలుపెట్టావంటే అసలు టైమే తెలియదు..." అంది పుస్తకం యిస్తూ



"విపాశ" నవల పేరు. బెంగాలీ నవలకి తెలుగుఅనువాదం. కాఫీతాగి ఖాళీ గ్లాసు అందించేసి పుస్తకం చదవటంలో లీనమైపోయి చాలా టైము గడిచినా తల్లి 'అన్నానికి రామ్మా' అని పిల్చినా ఆ పుస్తకంలోనించి తల తిప్పలేదు సుమిత్ర.

"నే చెప్పలేదూ బాగుంది కదక్కా"

"బాగుంది" అంటూనే చదివే కూతుర్ని పార్వతమ్మ మళ్ళీ పిల్చింది యింక పుస్తకం పక్కకిపెట్టి టైము చూసుకుని అరె' అనుకుంటూ వళ్ళు విరుచుకుని లేచింది సుమిత్ర. మంచి పుస్తకాలే మనిషికి అసలైన స్నేహితులు మళ్ళీ మళ్ళీ అనుకుంటూ చెల్లెలిని అడిగింది మరేమైనా వుంటే తెప్పించు లైబ్రరీనుంచి చదివేస్తాను" అని

"ఉండటానికి చాలానే వున్నాయి కానీ నీకు శలవే లేదు." అని నవ్వింది లక్ష్మి "ఔను కదూ నేను రేపే వెళ్ళాలి కదూ," యీ విషయం గుర్తుకి

వచ్చేసరికి నీరసం ముంచుకు వచ్చింది. మళ్లీ అక్కడ యాంత్రికజీవితం కమలా భవానమ్మ వాళ్ల బుజ్జిబాబు బొంగురుగొంతులో తెల్లవారుఝామున చదివే పెద్దబాలశిక్షలోని పాఠాలూ సుమతీశతకం కృష్ణశతకంలోని పద్యాలూ వగైరా. అసలు అక్కడ ప్రతిరోజూ బుజ్జిబాబు పాఠాలే తనకి మేలుకొల్పులు

"అమ్మా నీకు వూరగాయలన్నీ సీసాల్లో పెట్టి సర్దానమ్మా" అంటూ తల్లి యింకా యేదో చెప్తోంటే సుమిత్ర ఆలోచనలు కట్టిపెట్టింది.

"నువ్వు వెళ్లిపోయిన తర్వాత నాలుగురోజులు యేంతోచదక్కా" లక్ష్మి ముఖం యిప్పుడే చిన్నబోవటం గుర్తించి సుమిత్ర మళ్లీ త్వరగానే వస్తాగా చెల్లాయ్. యీ లోపల లైబ్రరీలోని నవలన్నీ పూర్తిగా చదివేసేయి" అంది చెయ్యి కడుక్కుంటూ. తల్లిమాత్రం యేం మాట్లాడకుండా అలాగే కూర్చుండి పోవటం చూసి "అన్నం తినమ్మా. నేనూ యిక్కడే కూర్చుంటాను." అంది తిరిగిపీటమీద కూర్చుంటూ సుమిత్ర. వెంకట్రావు మాత్రం యెందుకో మౌనంగా వుండిపోతున్నాడు

## 8

సుమిత్ర తిరిగి హైదరాబాద్ వచ్చేసింది బస్‌స్టాండుకి వచ్చింది కమల, ఆ మేడలో కాపురంవున్నవాళ్ళ అబ్బాయి చక్రవర్తిని వెంట తోడుతీసుకుని

"చీకట్లో యెందుకొచ్చావే" కోపం తెచ్చిపెట్టుకుంటూ అంది.

"నీ మీద బెంగపడింది కమలక్క" అంటూనే సుమిత్రచేతిలోని సూట్‌కేసూ ప్లాస్టిక్ బుట్టా అందుకున్నాడు. యీ కుర్రాడికి పదిహేను సంవత్సరాలుదాటినా పదో తరగతి రెండుసార్లు తప్పి, 'వెధవ చదువు చదవను సినీమాల్లో చేరతాను. లక్షలు సంపాదిస్తాను' అంటూ యేవేవో కబుర్లు చెప్తూ సుమిత్రకీ కమలకీ బజారు పనులు చేసిపెడుతూ అస్తమానం "అక్కా అక్కా" అంటూ వచ్చి కూర్చుని కబుర్లు చెబుతూవుంటాడు. అతని కబుర్లు పనిలేనప్పుడు కాలక్షేపంగా వున్నా ఒక్కొక్కప్పుడు విసుగు తెప్పిస్తూవున్నా 'అమాయకుడు. పోనీ పాపం' అని స్నేహితురాళ్లు యిద్దరూ అతని 'బోరు' భరిస్తూ వుంటారు

"సుమిత్ర నీ మీద బెంగపడింది నేను కాదు, చక్రవర్తి సరేగానీ పదండి పోదాం" అని ఆటోలో ముగ్గురూ యిల్లుచేరారు

తిరిగి వంటా భోజనం ఆఫీసూ పీటికి మళ్ళీ అలవాటు పడేసరికే నాలుగు రోజులు పట్టింది. అసలు రాగానే తల్లికి వుత్తరం రాసేసింది క్షేమంగా చేరినట్లు.

యివాళ అసలే ఆదివారం. అందులో నెలాఖరు. యేం తోచటంలేదు. కమల ఓ ఫ్రెండ్ భోజనానికి పిల్చింది అని వెళ్ళింది పొద్దున్నే. సుమిత్ర ఒక్కర్తీ భోజనంచేసి విశ్రాంతి తీసుకుంటూ వుంది.

ఊరినుంచి తెచ్చుకున్న వాటిల్లో పినతండ్రి డైరీమాట గుర్తుకివచ్చి అది అంతక్రితం చదవటానికి వీలుకాక యీ రోజు తీసుకుని పేజీలు తిప్పి చూస్తూ ముత్యాల్లాంటి అక్షరాలని చూసి, "చిన్నాన్న దస్తూరి యెంత బాగుంది" అనుకుంటూ మొదటినించీ చదవటం ప్రారంభించింది సుమిత్ర.

'నాకు యీ రోజుతో ఇరవై నాలుగేళ్ళు నిండాయి. యింతవరకూ సాధించింది యేమిటి!' అని మనసు నిలదీస్తోంది. బి యస్సీ పూర్తిచెయ్యలేదు. అమ్మా నాన్నా అప్పుడే పోయారు. ఆస్తికి రెక్కలొచ్చి యెగిరిపోయింది. యింక మిగిలింది అసహాయుడైన దుర్వాసమునిలాంటి అన్నయ్యా, దేవతలాంటి వదిన. యింక తన అందంతో కోరినదంతా కొనుక్కోవచ్చు అనే అవివేకి అయిన చెల్లి రమణి. అన్నయ్య నిర్ణయించిన వరుడిని కాదని ఆవారా వెధవ రామూతో లేచి పోయినందుకు అన్నవదినలు యెంత ఆవేదన చెందారు! అసలు చిన్నప్పటినించీ రమణి ఆలోచనావిధానమే సరియైనది కాదు అని సమయం వచ్చినప్పుడల్లా నేను హెచ్చరిస్తూన్నా అన్నయ్య అతిగారాబం చెల్లిని సరైన ఆలోచనావిధానాన్ని అలవర్చుకో నియ్యలేదు. రమణి ప్రవర్తన బాగా లేదు అని తెలిసి కోపగించుకున్నానని ఆరోజు యెంత గొడవచేసింది చెల్లాయి ఆ రాత్రే యిల్లు వదిలి వెళ్ళిపోయింది. చెల్లెలు చేసిన యీ పనీ వూళ్ళోవాళ్ళు వేలెత్తి చూపటం భరించలేని అన్నయ్య తలగోడకేసి కొట్టుకుంటూవుంటే నేనేం చేయలేక అలా అని దూరంగా వుండలేక యెక్కడున్నాసరే రమణిని వెతికి తీసుకుని మరీ నీ దగ్గరికి వస్తానన్నయ్యా. లేకుంటే యీ యింటి గడప తొక్కను అని ఆవేశంతో వదిన వారిస్తూన్నా, అన్నయ్య వద్దురా తమ్ముడూ యిద్దరం కలిసే వెతుకుదాం అని యెంత చెబుతున్నా వినక యిల్లు వదిలేశాను.

వూరువాడా వెతికాను. కనిపించిన ప్రతి ఆడపిల్లనీ అడిగాను నా చెల్లాయి రమణిని మీరెరుగున్నారా అని. కానీ రమణి కన్పించలేదు నా మనస్సుకు శాంతి దొరకలేదు. కాలం యెవరికోసమూ ఆగదుగదూ! అన్నయ్యదగ్గరికి తిరిగి వెళ్ళలేక యెలా బ్రతకాలో తెలియక తెగిన గాలిపటంలా తిరిగి తిరిగి ఆఖరుకి ఓ స్నేహితుడి సలహాతో నాటకం కంపెనీలో చేరి అందులో చిన్న చిన్న వేషాలూ వేస్తూ కొన్నాళ్ళ తర్వాత హీరోగా స్థిరపడ్డాను ప్రేక్షకుల్లో ప్రత్యేకమైన

గుర్తింపు తెచ్చుకున్నానో అదే వచ్చిందో నాకు తెలియదు. కానీ నా కివాళ ఇరవై నాలుగో పుట్టినరోజు. యీవాళ ప్రదర్శన పూర్తిచేసుకుని మేకప్ మార్చుకుంటూ వుండగా ఆ రూములోకి ఓ పద్దెనిమిదేళ్ళ అందమైన అమ్మాయి ఇరవైయేళ్ల అబ్బాయీ వచ్చారు. వారిద్దరూ యీ వూళ్ళో చాలా శ్రీమంతులైన కనకరావుగారి కూతురూ కొడుకూ. మిమ్మల్ని చూడాలని వచ్చారు అని మానేజర్ పరిచయంచేసి మళ్ళా ఆయన యేదో పనిమీద అవతలికి వెళ్ళిపోయారు.

"మీరు చాలా బాగా యాక్ట్ చేశారు. యీ అమ్మాయి మా చెల్లెలు సుష్మ. నా పేరు శ్రీకాంత్. మా యిద్దరికీ అసలు స్టేజీ డ్రామాలంటేనే బోర్. కానీ మీరు బాగా చేస్తారని తెలిసి చూద్దాం అని వచ్చాం. నిజంగానే చాలా బాగా చేశారు. యింత మా చెల్లెలైతే అబ్బ మరీ మరీ చెప్తోంది మీరు బాగా చేశారని"

ఆ అమ్మాయి ముఖంలోకి చూశాను 'నిజంగానా' అన్నట్లు.

"నిజం – నా మనస్సులోని భావాన్ని వ్యక్తీకరించటానికి భాష చాలక మౌనం వహించాను. హరికృష్ణగారూ చాలా బావుంది మీ పాత్ర పోషణ. నా జ్ఞాపకార్థంగా యీ డైరీ తీసుకోండి అన్నట్లు మీకు డైరీ రాయటం అలవాటుందా" అందిస్తూ అంది.

"లేదు. థాంక్స్"

"పోనివ్వండి యివాళనుంచీ ప్రారంభించండి" అరవిచ్చిన గులాబీలా నవ్వు ముఖంతో అంది.

"అలాగే" అంటూ కాఫీ తెప్పించి యిచ్చాను. ఆ అమ్మాయి మోహమాటపడిపోతూ నా ముఖంలోకి తదేకంగా చూస్తోంటే నాకు చాలా యిబ్బందిగా వుంది. ఆ అమ్మాయి కళ్ళల్లో కన్పిస్తూన్న ఆరాధనా భావం స్వచ్ఛంగా కన్పిస్తూంటే మనస్సు క్షణం పరవశత్వం చెందింది. యిలా యిదివరలో చాలాసార్లు చాలా మంది ప్రత్యేకంగా కల్సుకుని నా నటన గురించి చెప్పినా యిప్పుడీ అమ్మాయి కళ్ళల్లో కన్పించే ఆరాధనా భావం నా మనస్సుని మధుర తరంగాలలా స్పర్శించింది. ఆ అమ్మాయి ముఖంలోకి చూడాలనివున్నా కళ్ళు తిప్పేసుకుని వాళ్ళ అన్నయ్య శ్రీకాంత్‌తోనే రెండు నిముషాలు మాట్లాడాను. "ఏం చదువుతున్నారు యిద్దరూ" అని

"మీ అడ్రస్ యివ్వండి, వుత్తరం రాస్తే జవాబిస్తారా" అంది.

"నాకు పర్మనెంట్ అడ్రస్ లేదు. యివాళ యిక్కడ. రేపు మరో చోట. యెల్లుండి మరెక్కడో నాకే తెలియదు'' అంటూ నవ్వాడు.

"పోనివ్వండి, నా అడ్రస్ మాత్రం మారదుగా. మీకు రాయాలన్పించినప్పు డల్లా రాయరూ" ప్రాధేయపడుతూన్నట్లుంది స్వరం. నేను నవ్వేసి లేచాను. ఆ అమ్మాయి యిచ్చిన డైరీ నా చేతిలోనే వుంది. శ్రీకాంత్ "యీ వూరు మరెప్పుడన్నా వస్తే మిమ్మల్ని తప్పక కల్సుకుంటాం. అన్నట్లు మీరు రేపు వుంటే మా ఇంటికి టీ కి రావాలి.'' అన్నాడు.

"లేదు, వెళ్ళిపోతున్నాం. ''మరోసారివస్తే తప్పక వస్తాను'' అనిమాట తీసు కుని కానీ సుష్మ వదలలేదు. మీ రాకకోసం యెదురు చూస్తూ వుంటాను. యెన్ని సంవత్సరాలైనా సరే సుమా అన్న భావం కళ్ళతోనే చెపుతూ ప్రయత్నిస్తాను" అంటే 'కాదు' 'వస్తాను' 'అనండి' అంటూ అన్నగారి వెంట వెళ్ళిపోయిందా అందాల బాల.

ఇంక మిగతా ఫ్రెండ్స్ చుట్టూ చేరారు. యెవరా అభిమాని అని విచ్చి ప్రశ్నలు వేస్తూ "ఆ పిల్ల నీ పంటే చాలా మోజులావుంది కనక నీ ప్రక్కన హీరోయిన్ వేస్తుందేమో కనుక్కో. అలా గనక జరిగితే మన డ్రామాలకి సువర్ణ వర్షం కురుస్తుంది. అప్పుడు ఓ సినిమా తీసేయచ్చు. మనం అందరం సినీ స్టార్స్ అవచ్చు అని యింకా యింకా మాట్లాడుతూంటే అప్పటివరకూ మనస్సులో కదిలిన మధురభావాలు గభాలున ఆగిపోయాయి. వాళ్ళకి జవాబివ్వటం వృధా అని, నాకుగాను ప్రత్యేకించిన గదిలోకి వెళ్ళాను భోజనం చేశాను. కానీ రాత్రి పన్నెండు గంటలు దాటినా నిద్ర రావటంలేదు సుష్మ యిచ్చిన డైరీ తెరిచి ఆ అమ్మాయి రాసిన అడ్రస్ నాలుగుసార్లు చదివి డైరీ రాయటం ప్రారంభిం చాను. యివాళ జీవితంలో ప్రథమంగా డైరీ రాయటం ప్రారంభిస్తే యిదివరకు జరిగిపోయిన యెన్నో సంఘటనలు అన్నీ ఒక్కుమ్మడిగా గుర్తుకొచ్చి వుక్కిరి బిక్కిరిచేసి యీ డైరీ చోటు చేసుకున్నాయి. కానీ డైరీలో యిలాంటి సంగతులా రాసేది! అని మనస్సు నిలదీసింది. వెంటనే మనస్సు అంది, అతి సామాన్యుంకి యింతకిమించి డైరీలో భద్రపర్చుకునే విలువైన విషయాలేంవుంటాయి! అని. అయినా గతం గుర్తుకి వచ్చింది. రాయాలనిపించినవి రాసేశాను. యిది రాస్తూ వుంటే చెల్లాయి రమణి గుర్తుకి వస్తోంది. యెక్కడ వున్నదో! యేం చేస్తూన్నదో. యెక్కడవున్నా యెలా వున్నా సుఖంగా వుండేలా చెయ్యమని భగవంతుడిని మరీ మరీ ప్రార్థిస్తాను యెప్పుడూ"

సుమిత్ర యింకా చదవాలనుకుంది కాని నిద్ర ముంచుకు వస్తోంది. అందుకని లేచి డైరీ ప్రక్కనపెట్టి చన్నీళ్ళలో ముఖం కడుక్కొని 'స్టౌవ్' వెలిగించి 'టీ' తాగి తిరిగి 'డైరీ' తెరిచింది

హరికృష్ణ ప్రతిరోజూ డైరీ రాయలేదు. మధ్యంలో చాలా పేజీలు వదలి మళ్ళీ రాశాడు దాన్ని చదువుకుంటోంది సుమిత్ర

"ఇవాళ నాటక నాటిక పోటీలు చాలా యెత్తున ప్రోగ్రాములు పూర్తిఅయింది నాటికలో ప్రథమబహుమతి (ఉత్తమనటుడిగా) అధ్యక్షుల పొగడ్తలు, మిత్రుల శుభాకాంక్షలు యివన్నీ చూస్తూంటే చిత్రంగా అన్పిస్తోంది నాకు. నేను చదువు కునే రోజుల్లో యెప్పుడూ నటుడు కావాలనికానీ అవుతాననికానీ ఆలోచించలేదు. పెద్ద ఉద్యోగం, చిన్న ఇల్లూ, ఇంటిని తీర్చిదిద్దుకునే గృహిణీ యిలా సాగిపో యేవి ఆలోచనలు. కానీ యీనాడవి తారుమారు అయాయి. యెంత చిత్రమైంది జీవితం!

అన్నయ్యకి అప్పుడప్పుడూ డబ్బు పంపిస్తూన్నాను. యీ మధ్య తరచుగా వుత్తరాలు రాస్తున్నాడు. యీరోజే వచ్చింది ఒక వుత్తరం.

సుమిత్ర పెద్దదైందనీ పదో తరగతి మంచి మార్కులలో పాసైంది కనుక బస్తీలో వున్న మేనమామ దగ్గర వుంచి కాలేజీలో చేర్పించాలనివుంది. కానీ ఫీజులూ వగైరా కట్టాలంటే కష్టం అని ఆలోచిస్తూన్నానని రాశాడు దానికి వెంటనే జవాబు రాశాను సుమిత్ర చదువు అపవద్దు అనీ జీతం, పుస్తకాలు వగైరా వాటికి నేను డబ్బు పంపిస్తాననీ. వుత్తరం పోస్టుచేసినా ఆలోచనలు మెదడులో. సుమిత్ర పెద్దదైపోయింది. పెళ్ళిచేయాలి. కానీ అన్నయ్య యేం చెయ్యగలడు. నేను ఖర్చులు తగ్గించుకుని సుమిత్ర పెళ్ళికి డబ్బు కూడబెట్టాలని నిర్ణయించుకున్నాను సుమిత్రని ఒకసారి చూడాలనే కోరిక వేధిస్తోంది. కానీ యెందుకో వెళ్ళబుద్ధి కావటంలేదు

సుష్మ నా కంపెనీ ప్రోగ్రాంస్ పేపర్‌లో చూసికాబోలు చాలాసార్లే ఉత్త రాలు రాసింది. వాటికి జవాబులు కొన్నిసార్లు రాసినా అవి పోస్టుచేయకుండానే వుంచేశాను సుష్మ యిప్పుడిప్పుడే యవ్వనంలో అడుగుపెడుతూన్న అందాల బాల. మంచి చెడ్డలు తెలియని అమాయకురాలు. కష్టం తెలియని సుకుమారు రాలు శ్రీమంతుల చిన్నారి ఆ అమ్మాయికి చాలా దూరంగా వుండటం యిద్దరికీ మంచిది అనేది యెప్పుడో అర్థంచేసుకున్నాను. కనుకనే మనస్సు సుష్మ కోసర పరితపిస్తూన్న నా హృదయకవాటాన్ని మూసేశాను. సుష్మకీ నాకూ నక్కకీ

నాగలోకానికి వున్నంత తేడా వుంది. 'ప్రేమ' ఒక్కదానితోనే ముడిపడిలేదు జీవితం అన్న సత్యం యిప్పటికే అర్థమైంది కనుకనే విజ్ఞతగా ఆలోచించి కావాలని దూరంగా వుండిపోయాను. సుష్మ ఒకసారి పుట్టినరోజు అనీ, ఆరోజుకి తప్పక రమ్మనీ మరీ మరీ రాసింది వెళ్ళాలని మనసు తహతహలాడింది. కానీ వెళ్ళలేదు. శుభాకాంక్షలు పంపించాను అంతే దీనికి సుష్మకి చాలా కోపమే వచ్చింది కాబోలు, చాలా రోజులవరకూ వుత్తరం రాలేదు.

మళ్ళీ కొన్ని పేజీలు ఖాళీ. పినతండ్రి డైరీలో తేదీ కానీ సంవత్సరం కానీ వేయకుండా రాయాలన్పించినది అప్పుడప్పుడూ రాశాడు అనుకుంది సుమిత్ర. మళ్ళీ ఖాళీపేజీలు తిప్పి చదవటం మొదలు పెట్టింది.

"స్థిరత్వం నెలకొంటోంది జీవితంలో యిప్పుడిప్పుడే. యీ వూరిలో ఇల్లూ యిల్లాలూ అంటూ పర్మనెంట్ అడ్రస్ యేర్పడింది. అసలు పెళ్ళి అనేది అనుకోకుండా గమ్మత్తుగా జరిగిపోయింది, సుమతితో.

"అసలు సుమతితో జరిగిన పరిచయం అది క్రమంగా పెళ్ళికి దారితీయటం అంతా యాంత్రికంగా జరిగింది. చాలీచాలని జీతంతో బ్రతకలేని బడి పంతులమ్మ సుమతి. అందుకే వయస్సు పాతిక దాటినా కన్యగా వుండి పోయింది. తల్లీ తండ్రీ మృతిచెందటం అన్నగారు చెల్లెలి పెళ్లి బాధ్యత వహించలేకా అసలు అంతకి మించి బాధ్యతలేకా వదిలేశాడు. సుమతిలాంటి ఆడపిల్లలు యీ దేశంలో వేలసంఖ్యలో వుంటారు. అసలు సుమతిని పరిచయం చేసిందీ పెళ్ళివరకూ తెచ్చిందీ మిత్రుడు గోపి.

"అందానికంటే అణకువా అహంలేని ఆత్మీయతా నేనంటే పిచ్చి ప్రేమా పెంచుకున్న సుమతిని వివాహం చేసుకున్న తర్వాత కాస్త సుఖంగానే గడుస్తూ న్నాయి రోజులు. సుమతికి ఆత్మాభిమానం యెక్కువ, పైస కట్నం లేకనే తాళిగట్టానని అందులోనూ దేవాలయంలో అయిదురూపాయల ఖర్చుతో పెళ్ళి జరిగిపోయిందని నేనంటే గౌరవం పెంచేసుకుంది సుమతి.

"మీలాంటి యువకులే అందరూ అయితే ఆడపిల్ల పెళ్లి యెంత తేలిక అవు తుంది అంది ఒకసారి. సుమతి తమ్ముడిని చదివిస్తోంది. గోపాల్ మంచి కుర్రాడు. పై చదువులకి పంపితే మంచి స్థితికి వెళ్లగల తెలివితేటలున్నాయి. అతని భవిష్యత్తు యెలావుంటుందో యేం చెప్పగలం.

"ఒకరోజు సుమతి నా వివరాలన్నీ తెల్సుకుని సుమిత్రాకల్యాణం హుండీలో తన కష్టార్జితంలోనించి కూడా కొంతవేస్తూ హఠాత్తుగా నా దృష్టిలోపడి యెంత

సిగ్గుపడింది సుమిత్ర తెలియకున్నా ఆ పిల్ల పెళ్ళికి తను కూడా రావాలని నా వాళ్ళని అందరినీ చూడాలనీ కలలు కంటోంది పిచ్చి సుమతి నా అలవాట్లూ పద్ధతులూ నచ్చినా నచ్చకున్నా ఒక్కరోజూ విమర్శించదు. కానీ ఆరోగ్యాన్ని పాడుచేసే దురలవాట్లు మాత్రం పనికిరావంటూ చివరికి సిగరెట్లు కూడా తగ్గించుకునేలా చేస్తోంది.

"సుమతిని పెళ్ళిచేసుకున్న వెంటనే అన్నయ్య యింటికి వెళ్ళాలన్పించింది కానీ...వెళ్ళలేదు కనీసం యిలా పెళ్ళిచేసుకున్నాను అని కూడా రాయలేక పోయాను. యిది చాలా పొరపాటే అయినా యేదో బలహీనత నన్ను రాయనీయలేదు.

"సుమిత్ర కాలేజీ చదువు అయిపోయిందని అన్నయ్య వుత్తరం రాశాడు. వుద్యోగప్రయత్నంకంటే పెళ్ళి ప్రయత్నం చేయాలని వుంది అని రాశాడు.

మరికొన్ని పేజీలు ఖాళీ.

మద్రాసు నగరంలో నా నాటకం యిదే మొదటిసారి. అవిరధులూ మహారధులూ ఆహ్వానితులుగా వచ్చారు. వారందరి సమక్షంలో నాటకం పూర్తి అయింది. కరతాళధ్వనులు మిన్నుముట్టాయి. కర్టెన్ క్లోజ్ పడింది. మా మానేజర్ మహదానందంతో అభినందించాడు. నన్ను నా ప్రక్కనేవున్న హీరోయిన్ శకుంతనీ.

మేకప్ తూర్చుకుంటూన్నాను రూములోకి వెళ్ళి. యింతలో వెనకనుంచి అమాంతంవచ్చిన రెండుచేతులు నన్ను చుట్టేశాయి.

"చిన్నన్నయ్యా...చిన్నన్నా..." అనే పిలుపు. చాలా సంవత్సరాల క్రితం అది పరిచయమైనదే అయినా యిప్పుడు యిక్కడ ఆ పిలుపు విని ఆశ్చర్యపోతూ వెనక్కి తిరిగాను యెదురుగా రమణి తెల్లటి బెనారస్ పట్టుచీరెలో మెడలో యేవేవో నగలతో నన్ను చుట్టుకున్న రెండుచేతుల నిండుగా బంగారు గాజులు తలనిండా మల్లెలు. ముఖాన నయాపైసంత కుంకుమ నిండుగా అందంగా కన్పిస్తూన్న రమణిని నిర్ఘాంతపడి అలా చూస్తూనే వున్నాను. మెర్క్యురీలైటు కాంతితో రమణి బెనారస్ చీరెమీది జరీపువ్వులు మెరుస్తున్నాయి చెల్లాయినీ ఆమె నగలనీ చీరెనీ చూస్తూ నిల్చిపోయాను "చిన్నన్నయ్యా గుర్తుపట్టలేదూ! నేను...నేను రమణిని" నా చెయ్యి లాగుతూ పల్కరిస్తోంది. ఆ సమయంలో అక్కడ రమణిని చూడాలనికానీ చూస్తాననిగానీ అనుకోలేదు. అందుకే స్థాణువులా నిల్చిపోయాను. రమణి గడగడా మాటాడేస్తోంది.



"అసలీ డ్రామాలో నువ్వువున్నావని తెలియనే తెలియదు సినిమాకి వెళ్ళి టికెట్ దొరక్క యింటికివెళ్ళి "బోర్" భరించలేక యేదో తెలుగు డ్రామాట చూద్దాం అని వచ్చాను. తీరా స్టేజీమీద నువ్వూ నీ పేరూ నీ గొంతూ అబ్బ ...యివాళ యెంత అదృష్టం అని మొదటి సీను కాగానే లేచి లోపలికి రావాలని ప్రయత్నించాను. కానీ మీ మానేజరు వెధవ మధ్యలో వీల్లేదు, అంతగా కల్సుకోవాలంటే డ్రామా అయింతర్వాత చూడండి అని వెనక్కి పంపేశాడు. అబ్బ యిప్పటికైనా రానిచ్చారు లోపలికి. అతను మా అన్నయ్య అని నేనంటే వాళ్ళు నా వైపు యెలా చూశారనీ! చెప్పలేను. నేను అబద్ధం చెప్పాను అని కాబోలు. అవన్నీ సరేగానీ ముందు మా యింటికి వెళ్ళిపోదాం పద' చెయ్యి పట్టుకుని లాక్కుపోవాలని చూసింది.

"నేను కదలకుండానే నిల్చోవాలని ప్రయత్నించాను. కానీ రమణి బలవంతంగా లాక్కువెళ్ళి హాలుబైటవున్న ఫియట్ కారు డోర్ తెరిచి లోపల కూర్చో అంటూ తోస్తోంది. కాస్సేపు పనిచేయని మెదడు తిరిగి యదార్థ స్థితికి వచ్చింది. ఆ రాత్రి రెండుగంటలకే బయలుదేరి నెల్లూరువెళ్ళి పోవాలన్న ప్రయత్నాలు పూర్తి అయాయని గుర్తుకివచ్చింది. బస్‌కూడా సిద్ధంగా వుంది అక్కడికి కాస్త దూరంలో మరుసటిరోజే ఆ వూరిలో ప్రదర్శన వుంది. కనుక వెళ్ళక తప్పదు మా అందరికీ. అందుకే కార్‌డోర్ పట్టుకుని నిలబడిపోయిను.

"రమణీ" అన్నాను, గొంతు పెగుల్చుకుంటూ.

అన్నయ్యా అబ్బ యెంతసేపటికి మాట్లాడావు. పోనీ యిప్పటికైనా రమణీ అన్నావు అంతేచాలు గానీ పోదాం రా" అభిమానం ఆత్మీయతా నిండుగా వుంది ఆ మాటలో.

"వీల్లేదు. మేం యిప్పుడే నెల్లూరు వెళ్ళిపోవాలి."

'వీల్లేదు. నువ్వు వెళ్ళటానికి వీల్లేదన్నయ్యా. నా యింటికి రాకుండా నువ్వు వెళ్ళద్దురా'

".........! నా కృత నిశ్చయాన్ని గ్రహించి రమణి మరీ గొడవచేస్తూ 'అన్నయ్యా నాతోవచ్చి ఒక్కరోజైనా నా యింట్లో వుండవా! నేను చెప్పేది వినవా! కాదు విని తీరాలి. నా దగ్గర వుండితీరాలి. చిన్నన్నయ్యా నన్ను మర్చిపోయావా! కోపం యింకా పోలేదా! యిదిగో నీ కంత అర్జెంట్ అయితే రేపు నా కారులో పంపిస్తాను సరేనా పద. యెక్కు కారు.'' మొండిగా లాగుతోంది.

"అవన్నీ లాభంలేదుగానీ ఒక్క మాటకి జవాబు చెప్పు. సుఖంగానే వున్నావా?" అసలేం మాట్లాడాలో తెలియక అలా అనేశాను

యెలా కన్పిస్తున్నాను?"

యెదురు ప్రశ్నకి జవాబు చెప్పబుద్ధికాక మరేం మాట్లాడాలో తెలియక నిల్చున్నాను. రమణి 'అన్నయ్యా నా మీద కోపం పోనేలేదా!' అంటూవుంది. యింతలో 'త్వరగా రమ్మంటున్నారు. మిమ్మల్ని కల్సుకోవాలని యెవరో వెయిట్ చేస్తూన్నారు.' అంటూ మానేజర్ దగ్గరనుంచి కబురొచ్చింది.

"వెడుతూన్నాను రమణీ" అనేసరికి 'అన్నయ్యా' అంది కన్నీళ్ళని తుడుచుకుంటూ... "తప్పదమ్మా వెళ్ళాలి"

'అన్నయ్యా నీవెంత కఠినుడివి! నా యిల్లు చూడాలనీ నేనెలా బ్రతుకుతున్నానో చూడాలనీ అన్పించటంలేదూ నీకు. యిన్ని సంవత్సరాలబట్టీ చిన్నన్నయ్య అయితే నన్ను అర్థంచేసుకుని ఆదరిస్తాడు అనుకున్నాను నువ్వూ పెద్దన్నయ్యలాగే చేస్తూన్నావా! నీ మనస్సు మంచిదనీ పరిస్థితిని అర్థంచేసుకునే విజ్ఞత నీకుందనీ అనుకున్నాను కానీ కానీ...' రమణి పొంగుకొచ్చే కన్నీళ్ళని కర్చిఫ్‌తో వత్తుకుంటూ వుంది. నేను జవాబు చెప్పలేదు రమణిలోని దుఃఖం ఆవేశంగా మారింది. అయినా నా చెయ్యి వదల్లేదు. తీవ్రంగా చూస్తూ అంది.

'ఔను నేను మీరు చెప్పినట్లు యే మూడో పెళ్ళి ముష్టివెధవనో మనస్సు చంపుకుని చేసుకుని పైకి సుఖంగా బ్రతుకుతూన్నట్లు నటిస్తూ లోపల కుళ్ళి కృసిస్తూంటే మీ పరువూ మర్యాదా నిల్చినదాన్ని అయేదాన్ని అప్పుడు మీ అన్నదమ్ములిద్దరూ చెల్లీ అంటూ ప్రేమ వొలకబోసేవారు సంవత్సరానికో సారి తీసుకువెళ్ళి ఓ ముతకచీరెపెట్టి 'చెల్లీ యివే చీనిచీనాంబరాలు. అని సంతోషించు తల్లీ అని వోదార్చేవాళ్ళు కానీ నేను నా యిష్టం వచ్చినవాడు కావాలని కోరి యిల్లు వదిలి వచ్చాననీ, నీ చెల్లెలు అని చెప్పకోవటానికి అవమానంగా వుందా? అయితే చెప్పు నిన్ను వదిలి వెళ్ళిపోతాను. పెద్దన్నయ్య నేను చచ్చిపోయానని చెప్పేశాడు నువ్వు అలాగే అంటావా?"

"............"

'యిదిగో చిన్నన్నయ్యా నేను యీ గుడ్డి సమాజానికి భయపడను. అసలు 'కేర్' చేయను. నా సుఖం నాది. నా సంతోషం నాది. నా తెలివితేటలతో అన్నింటినీ కొనగల డబ్బుని పుష్కలంగా సంపాదించుకున్నాను యీ డబ్బు ఎవరిదగ్గరవుంటే వాళ్ళే గౌరవనీయులు యీ రోజుల్లో. అతి ముఖ్యమైంది డబ్బు కనకనే ఆ డబ్బుని రెండు చేతులా పోగుచేసేను. రా చూపిస్తాను, యీ డబ్బుని చూసే నన్ను అందరూ గౌరవిస్తున్నారు.'

"............"

'అన్నయ్యా. నీ జీవితం అంతా డ్రామాలు వేసినా వుద్యోగంచేసినా సంపాదించలేని డబ్బు నేను పోగుచేసుకున్నాను డబ్బుతో యెన్ని సుఖాలని పొంద వచ్చో చూపిస్తాను. రా అన్నయ్యా. యేం నా ఐశ్వర్యం చూడటానికి యిష్టం లేదా? అసూయపడుతున్నావా? నువ్వు అలాంటివాడివి కాదు. నీకు యెంత కావాలంటే అంత యిస్తానురా చిన్నన్నా.'

"రమణి నాకు టైములేదు. వెళ్ళిపోతూన్నాను ఒక్కో అక్షరం తూచి తూచి అనే నన్ను ఆపి కారులో తీసుకువెళ్ళాలని విశ్వప్రయత్నం చేసింది

"లాభంలేదు చెల్లీ అన్న నన్ను మరేం అనలేక తన హాండ్‌బ్యాగ్‌లోని అడ్రెస్‌కార్డు నా షర్టు జేబులో కుక్కి 'నీ అడ్రెస్ యివ్వు' అంది కోపాన్ని మింగేస్తూ.

"నాకు అడ్రెస్ లేదు' అనేసి చరాచరా వచ్చేశాను. కానీ తలపగిలిపోతోంది నా కోసం వచ్చినవారితో మాట్లాడలేక యెలాగో వాళ్ళని వదిలించుకుని నా

గదిలోకి వెళ్ళి మంచంమీద వాలిపోయాను. తల పగిలిపోతోంది నెప్పితో. కర్చీఫ్‌తో గట్టిగా కట్టినా తగ్గలేదు

రమణికోసం యిల్లునీ అన్నయ్యనీ వదిలిన నేను చెల్లాయికోసం వెతికి వెతికి వేసారిన నేను కొన్ని సంవత్సరాల తర్వాత హఠాత్తుగా కన్పించిన రమణితో మనస్సు విప్పి యెందుకు మాటాడలేకపోయాను నువ్వు చేసేదంతా తప్పు అని యెందుకు చెప్పలేకపోయాను! వాళ్ళయింటికి వెళ్ళలేదు! యెందుకు? యేమో తెలియదు రమణిమీద కొన్ని సంవత్సరాల క్రితంవరకూ కోపంవుంది. అసలు నా చెల్లెలు రమణి నాతో ఆడిపాడిన రమణి ప్రొద్దుకూకితే పెరట్లోకి వంటరిగా వెళ్ళలేక 'చిన్నన్నా భయంరా' అని హడావుడిచేసే బిక్కిమిటాడే రమణేనా యివాళ కన్పించిన రమణి చిన్నన్నా పెద్దన్నకి కోపంరా! వాడంటే నాకు భయం. నువ్వు నన్ను వదిలి యెక్కడకూ వెళ్ళకు అన్నయ్యా' అని ఓ రోజు చేతిలో చెయ్యి వేయించుకున్న చిన్నారి చెల్లెలు రమణి యీ రమణి కానే కామ. ఆ రమణి మాలిన్యం అంటని మాణిక్యం కానీ యీనాటి యీ రమణి అ దమైన శరీరాన్ని అమ్ముకోగా వచ్చిన డబ్బుతో కొనుక్కున్న ఆడంబరాన్ని చూసుకుని సుఖంగా బ్రతుకుతూన్నానని భ్రమపడి ఆ సంపద అంతా నాకు చూపి మురిసిపోవాలనుకునే రమణి ఆనాటి రమణి కాదు. తన సుఖం తనదేట తన ఆనందం తనదేట. మంచిదే కానీ జీవితం అంతా యిలాగే సాఫీగా గడిచిపోతుందా!

"ఏమో! అయినా తెలియని భవిష్యత్తుని గురించి ఆలోచించటం అవివేకం. భగవంతుడు చెల్లాయిని చల్లగా చూడాలి అని ప్రార్థించటం మినహా మరేం చేయలేరు నాలాంటివాళ్ళు.

'రమణి ఆలోచనలనుంచి మనస్సుని తిప్పాలని చేసిన ప్రయత్నం వృధా అయింది. ఆలోచనలు తినేస్తూన్నాయి. తలపోటు ప్రారంభమైంది. చాలా పొరపాటుచేశాను చెల్లాయితో ఆత్మీయంగా మాట్లాడివుండవల్సింది. ఊహూ మాట్లాడలేను. అసలీరోజు రమణిని చూడగానే ఆశ్చర్యం ముంచుకొచ్చినా తర్వాత ఆవేశం ఆగ్రహం యింకా యెన్నో వుక్కిరిబిక్కిరి చేశాయి వాటి ధాటికి తట్టుకోలేకనే మౌనం వహించవల్సివచ్చింది. భగవాన్! ఒకే తల్లి దండ్రులు అయినా పిల్లల భవిష్యత్తు యెవరిది వారిదే. అదృష్ట దురదృష్టాలు యెవరివి వారివేనా!

ఆలోచనల్లో తెలియకుండానే కన్నీళ్ళు కాల్వలు కట్టాయి. యీ కన్నీళ్లు తుడవగల శక్తి యెవరికీ లేదు, అలా యెంతసేపో వున్న తర్వాత ప్రయాణం అవాలి అన్న వార్త అంది సూట్‌కేస్ సర్దుకుని బస్ యెక్కేశాను. చల్లటిగాలి వీస్తోంది. మద్రాసుకి దూరం అయిపోతున్నాను. మనస్సులో యేదో వ్యధ. చెప్పలేని బాధ

సుమిత్ర కుతూహలంగా చదువుతూ వుంది. కొన్ని పేజీలు వదిలి మళ్ళీ రాసిన పేజీల్లోకి దృష్టి పోనిచ్చింది.

"దాదాపు నెలరోజులు గ్రామాలు వరుసగా వేసి యిల్లు చేరిన నాతో సుమతి 'మీకో శుభవార్త' అంటూ అర్ధగంట సస్పెన్స్‌లో పెట్టి ఆఖరుకి చెప్పింది. మీ చెల్లెలు రమణి కారులో వచ్చింది పళ్లు స్వీట్లూ పువ్వులూ చాలానే తెచ్చింది. చిన్నన్నయ్యే యేడీ అని యిల్లంతా వెతుక్కుంది. మీరింకా టూర్‌నించి రాలేదు అని యెంత చెప్పినా నమ్మలేదు కానీ యింకోరోజు వుండమన్నా వినక వెళ్ళిపోతూ 'వదినా అన్నయ్యని ఒక్కసారి నా దగ్గరికి పంపు। తప్పక పంపాలి. అని మరీ మరీ చెప్పి వెళ్ళింది" అని చెపుతుంటే నాకు ఆశ్చర్యం వేసింది నా అడ్రెస్ యెలా సంపాదించగల్గింది అని. రమణిని సుమతి ఆదరంగా ఆహ్వానించే వుంటుంది. సందేహం అనవసరం. అయినా సుమతి చెప్పే మాటలన్నీ మౌనంగా వినటం మినహా మరేం చెయ్యలేక వూరుకున్నాను

"మన యిద్దరినీ కల్సి రమ్మన్నది.' అని చెపుతున్న సుమతి ముఖంలోకి పరిశీలనగా చూశాను, యే భావమూ కనపడనీయకుండా రమణి చెప్పిన వన్నీ పాఠంలా అప్పగించేస్తోంది. అని అర్థమై యింక మరేం ప్రశ్నించలేదు నేను.

ఆ రాత్రే జ్వరం ప్రారంభం అయింది. అసలు నాకు అనారోగ్యం అన్నా డాక్టర్లుయిచ్చే యింజెక్షన్ లన్నా విపరీతమైన చికాకు కానీ యీ మధ్య తరచుగా ఆరోగ్యం దెబ్బతింటోంది.

"సుమిత్రా ఓ సుమిత్రా" అన్న భవానమ్మ కేకకి సుమిత్ర ఉలిక్కిపడి డైరీ మూసేసి లేచి తలుపుతీసింది.

"అబ్బబ్బ. యెన్నిసార్లు పిల్చాను. యీ గిన్నెడు కాఫీపొడి అప్పు యివ్వమ్మా, చుట్టాలు తగలబడ్డారు. ఆదివారం అంటే హడలిచస్తున్నాను. యే వైపునుంచి చూసినా వచ్చే చుట్టాలే. మరీ మా యిల్లు సత్రం అయిపోయింది. సుమిత్రమ్మ తల్లీ" అంటూ ఆపసోపాలు పడుతూ కుర్చీలో కూర్చుని కబుర్లు మొదలెట్టింది. సుమిత్రకి వళ్ళు మండిపోయింది. అయినా పైకి నవ్వు ముఖంతోనే గిన్నెలో కాఫీపొడి పోసి యిచ్చింది.

"అమ్మయ్య పరువు దక్కించావు అసలే నెలాఖరు. మీ దగ్గర వుందో లేదో అనుకుంటూ వచ్చాను. ఆ కమలమ్మ తల్లి వుంటే కనీసం దబ్బాముూత అయినా తీసిచూడకుండా 'లేదండీ పిన్నిగారూ' అనేస్తుంది. నా ముఖం అయినా సుమిత్రమ్మా కమలకి పిన్నిలా కన్పిస్తున్నానా నేను. అంత వయస్సుందా నాకు. మా వాళ్ళు పన్నెండోయేట పెళ్ళిచేశారు. పదమూడోయేట కాపురాని కొచ్చాను. పద్నాలుగు నిండకుండానే కడుపొచ్చింది. కనక వరసగా ముగ్గురు పుట్టారే అనుకో. జాగ్రత్త పడకుంటే యింకో ముగ్గురు పుట్టివుండేవారు, కాదనను. కానీ ఒక్కమాట. యీ కాలం ఆడపిల్లలకి ముప్పైయేళ్ళు వచ్చినా యింకా కుమారీలు గానే వుండి మాలాంటి వాళ్ళని పిన్నిగారూ అమ్మమ్మగారూ దొడ్డమ్మగారూ అంటూ పిలుస్తారు పోనివ్వు అలా పిల్చినంత మాత్రాన నేను ముసలిదాన్నీ కాను ఆ పిల్ల చాలా కుమారీ కాదు" అనుకుంటూ గింజుకుంటూనే వెళ్ళిపోయింది భవానమ్మ.

"అబ్బ! యేం మనుషులో. కమల యెప్పుడో యేదో అన్నదని యిప్పుడు అర్థగంట నన్ను బోర్ చేసి వెళ్ళింది మహాతల్లి!" సుమిత్ర నుదురు నొక్కుకుంటూ కూర్చుంది. అసలింకా సుమిత్ర మనస్సు వినతండ్రి రాసిన డైరీలోని విషయాల లోనే పరిభ్రమిస్తోంది బాబాయి జీవితంలో యెన్ని చిత్రమైన సంఘటన లున్నాయి. అది పూర్తిగా చదివేయాలనిపిస్తోంది. కానీ యింతలో సుడిగాలిలా కమల వచ్చిపడింది,

"సుమిత్రా త్వరగా రెడీ అవు. పిక్చర్‌కి రిజర్వేషన్ చేయించాను." అంటూ యింక వూపిరి సలపనీయలేదు. సుమిత్ర ముఖం కడుక్కోవటానికి లేచింది. కమల హుషారుగా వుంది

## 9

సినీమా హాలులోకి వెళ్ళి కూర్చున్న తర్వాత నల్లగా కాస్త లావుగా పొట్టిగా వున్న ముప్పైయేళ్ళ యువకుడు ఖరీదైన సూటూ కళ్ళద్దాలూ ఖరీదైన వాచ్‌తో ప్రక్కనవచ్చి కూర్చున్నాడు. కమల స్నేహితురాలికి పరిచయంచేస్తూ "ఇతను ధర్మారావుగారు. ఈ వూళ్లో రెండు హోటళ్ళూ, ఓ పెద్ద మందులషాపూ వగైరా వుందట." అంటూ పరిచయంచేసి యింక అతనితో కబుర్లలో పడింది. ఆ అమ్మాయికి సినీమామీద దృష్టిలేదు

సుమిత్రకి వళ్ళంతా కంపరపెట్టేసింది. కమల యింటిదగ్గర యేం చెప్ప కుండా యిక్కడికి తీసుకువచ్చినందుకు మండిపోతోంది. అతను కోకోకోలా

చిప్స్...వగైరా తెప్పిస్తూ సుమిత్రవైపు ఆదోలా చూస్తున్నాడు. కమల తెగ వాగుతోంది. మధ్య మధ్య 'కేక్' కావాలా 'కాఫీ' కావాలా సుమిత్రా! అంటోంది

"యేంవద్దు! అసలు సినిమా చూడలేను తలనొప్పి పగిలిపోతోంది" అని లేచి వెళ్ళిపోతాను అంటూన్న సుమిత్రని కళ్ళతోనే బ్రతిమిలాడ్తూ, "ప్లీజ్ కాస్సేపు ఓపిక పట్టు" అంటూండే సుమిత్ర అసహనంగా తిరిగి కూర్చుంటూ 'పద యింటికి చెప్తాను నీ పని' అని కళ్ళతోనే బెదిరించింది. సినిమా అసలు బాగాలేదు 'అబ్బ' కళ్ళు మూసుకుని కుర్చీలో వెనక్కి వాలి తల పట్టుకుంది సుమిత్ర కమలా అతనూ మాట్లాడుతూనే వున్నారు.

ఎలాగో సినిమా ఆయి హాలు వదిలి యివతలికి రాగానే అతను వెంటవస్తూ నా కారులో 'డ్రాప్' చేస్తాను రండి అంటూంటే,

"థాంక్స్ కానీ మీకు అనవసరశ్రమ...మేం వెళ్ళిపోతాం" అనేసి అతని జవాబు కూడా వినకుండా అక్కడే వున్న ఆటో దగ్గరికి కమలని బరబరా ఈడ్చుకువెళ్ళి లోపలికితోసి తనూ కూర్చుని డ్రైవర్‌కి అడ్రెస్ చెప్పి కమల చెవి పట్టుకుని,

"యేమిటిదంతా" అంది కోపంతో మండిపడుతూ. కమల భయంగాచూస్తూ, "యేంలేదు సుమిత్రా అతనూ ... అతను ... నిన్ను చూపమనీ చాలాసార్లు అడిగాడు. ముందే చెప్తే ఒప్పుకోవనీ..."

చాచి చెంప పగిలేలా కొట్టింది సుమిత్ర కమలని. కమల కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. తను తప్పుచేసిందని తెల్సే సుమిత్రకి జవాబు చెప్పలేక అలాగే కూర్చుండిపోయింది. ఇద్దరూ యిల్లు చేరారు. కమల 'అన్నం అక్కర లేదు' అంటూ బట్టలైనా మార్చుకోకుండా పక్కమీద వాలిపోయింది 'అయితే నాకూ అక్కరలేదు' అని అన్నదేకానీ సుమిత్రకి ఆకలి మండిపోతోంది. తెలిసో తెలియకో కమల చేసిన పనికి వెర్రికోపం వచ్చేసి చెంపదెబ్బ లేసిందేకానీ సుమిత్ర ఆ తర్వాత లోలోపల బాధపడిపోతూనేవుంది. అందుకే బ్రతిమిలాడి చెయ్యిపట్టుకుని లేవదీసి మరీ అన్నంతినేలా చేసి తనూ తిని గిన్నెలుసర్ది ఈరాత్రికిపడుకో. రేపు అసలు విషయం అక్షరం వదలక చెప్పు, అతనూ అతని చూపులూ నడవడీ విషరంత కూడా నచ్చలేదు చూడు కమలా జాగ్రత్త" అనేసి కళ్ళుమూసుకుని పడుకుందేకానీ కంటిమీదకి కునుకురావటంలేదు

తల్లిదగ్గరనుంచి ఉత్తరం రాలేదు ఎలా వున్నారో అని ఆవేదనగా వుంది. యీ వస్తుకి వాళ్ళకి యింకాస్త డబ్బు యెక్కువ పంపటానికి ప్రయత్నించాలి.

ఏ ఖర్చు తగ్గించాలి అని ఆలోచించింది సుమిత్ర. ఆ మేడలో అంతా నిశ్శబ్దంగా వుంది. బహుశా అందరూ సుఖంగా నిద్రపోతూండవచ్చు కానీ తనకి నిద్రరావటంలేదు.

యెక్కడనుంచో దూరంగా పాట విన్పిస్తోంది మైక్‌లో 'మనసు పాడింది సన్నాయిపాటా' అని. ఈ పాట అంటే చాలా యిష్టం సుమిత్రకి, ఆ పాట తదేకంగా వింటూ వింటూ అలా అలా నిద్రలోకి జారిపోయింది.

## 10

తెల్లవారి కాఫీ స్నానం అయిన తర్వాత యింకా ముభావంగానేవున్న కమలతో మెల్లగా చెప్పింది. "కమలా దూరంగా ఆలోచించాలి అతన్ని గురించి వివరంగా తెల్సుకోవాలి" అని.

కమల అన్నీ విని తల ఎగరేస్తూ, "అతని వివరాలు నా కనవసరం. అతను నన్ను ప్రేమించాడు. నేనూ అంతకన్నా ప్రేమించాను. అతనికి బోలె డంత డబ్బుంది. నాకింకేం అక్కరలేదు. నా తల్లిదండ్రుల అనుమతికూడా అక్కరలేదు."

కమలకి ప్రేమపిచ్చి బాగా పట్టింది. యింక యేం చెప్పి ప్రయోజనం లేదని గ్రహించిన సుమిత్ర "సరే, అయితే వెంటనే పెళ్ళిచేసేసుకో. అంతేగానీ పెళ్ళి వాయిదావేసి ముందు స్వేచ్ఛగా తిరగటం నీకు క్షేమంకాదు. స్నేహితురాలిననే గౌరవంవుంటే నా మాటకి విలువ యివ్వు. లేకుంటే నీ యిష్టం. యింకేం చెప్పను" అనేసి ఆఫీసుకి వచ్చేసింది పని చేస్తోంది కానీ కమల గురించే ఆలోచనలు. ఆ ఆఫీసులోనే పనిచేసే ఓ క్లర్కుకి కూతురు పుట్టిందని పార్టీ యిస్తూ రమ్మని పిలిస్తే వెళ్ళింది టిఫినూ కాఫీ అయి అతనికి అభినందనలు తెల్పి వస్తూ అనుకుంది. యీాయనకి మొదటి కూతురు కనుక యింత సంతోషం. మరో నలుగురు అమ్మాయిలె పుడితే! పాపం వద్దులే అనుకుంటూ ఆఫీసు అయిన తర్వాత యింటికి వస్తూ బస్లో రద్దీకి విసుగుకల్గి మెల్లగా నడక ప్రారంభించింది.

"హల్లో సుమిత్రాదేవిగారూ" రాజేంద్ర తెల్లపాంటూ తెల్ల షర్టుతో యెదురుగా వస్తూ సుమిత్రని పలకరించాడు. సుమిత్ర అతని ముఖంలోకి చూసింది ఓ క్షణం చిన్నవైనా అవో వింతకాంతితో మెరుస్తూన్నట్లుండే కళ్ళు యెదటి వాళ్ళని అయస్కాంతంలా ఆకర్షించేస్తాయి. ముఖంలోకి తదేకంగా చూస్తున్న సుమిత్రని నవ్వు ముఖంతో మళ్ళీ పలకరించాడు.

"కాంపగ్రీసు మీ వాళ్ళింటికి వెళ్ళిరావటంతో పాతమిత్రులని మరచినట్లున్నారు. నేను రాజేంద్రని యిప్పటికైనా గుర్తించారా సుమిత్రగారూ...సారీ సుమిత్రాదేవి గారూ." అన్నాడు

"నా పేరుకు చివర దేవి మీరు యెప్పుడూ తగిలిస్తూంటారు కానీ నేను ఒట్టి సుమిత్రనే..."

"అలాగా! పోనివ్వండి నా పేరు మా తాతగారిది. అంటే ఆయన పేరు రాజయ్య. అది నాకు రాజేంద్రగా స్థిరపడింది. అసలు మనవాళ్ళకి సెంటిమెంట్లు యెక్కువంటాను కాదంటారా!'

"యే విషయంలో?"

"ప్రతి విషయంలోనూ! చూడండి నూటికి 99 వరకూ దేవుళ్ళూ దేవతలూ పేర్లే అందరికీ. యింక కొందరికి పతివ్రతల పేర్లు పెడతారు. సుమిత్రలూ సావిత్రులూ యెక్కువకానీ మండోదరీలూ ఊర్మిళలూ హిడింబిలూ పేర్లు యెక్కువగా పెట్టరేమి? అమాయకంగా చూస్తూన్నట్లేవున్నా అతని ప్రశ్నలో వ్యంగ్యం గుర్తించిన సుమిత్ర "మీ మగవాళ్ళ పేర్లూ అంతేగా రాములవారు పేర్లు యెక్కువకానీ రావణాసురుడు అని ఎందరు పెట్టుకుంటూన్నారు చెప్పండి?"

రాజేంద్ర నవ్వేటోయి ఆపుకుంటూ అలా పార్కులో కూర్చుందాం రండి కాఫీ తాగుదాం అభ్యంతరం లేకపోతే."

"అక్కరలేదు పార్కుకి రావటానికి వీల్లేదు త్వరగా వెళ్ళిపోవాలి"

"అలాగా! అన్నట్లు మీ కమలగారు బాగున్నారా!"

"బాగుంది. కానీ నేను ఊరికి వెళ్ళినట్లు మీకెలా తెల్సు?"

"ఆవిడే చెప్పారు. వెళ్ళినపని యేమైంది."

"యేం పని?" కోపం తెచ్చుకుంటూ అంది నడుస్తూనే.''

"నాకు తెల్సు. కానీ చెప్పండి! మీరు... అహ కమలగారికి చెప్పనని మాటిచ్చాను"

"మీ యిద్దరి పరిచయం చాలా దూరం వచ్చిందన్నమాట. సరేగాని నే వెళ్ళిన పని యేమైవుంటుంది అనుకుంటూన్నారు."

"బావుంది! ప్రశ్నకి ప్రశ్న?".

"చెప్పండి."

"నిజం చెప్పమంటారా .."

"అబద్ధం వద్దు," అతన్ని వారిస్తూ అంది.

"అయితే వద్దినే తిరిగి వచ్చేసివుండచ్చు"

"యెందుకని ?"

"విపులంగా చెప్పాలంటే కట్నకానుకలు బేరసారాలు కుదరకపోవచ్చు. లేక అబ్బాయి నచ్చకపోవచ్చు. యింకా యింకా..."

"పప్పులో కాలువేశారు. అబ్బాయికి అమ్మాయి నచ్చక కాన్సిలే అయింది."

"అసంభవం" అలా జరిగివుండదు

"యేం యెందుకు జరగకూడదు ."

"మీలాంటి అమ్మాయి నచ్చలేదని యే తెలివివున్నవాడూ వదులుకోడు."

"అంటే ?"

"ఆ స్థానంలో నాలాంటివాడుంటే ., పెళ్ళి తప్పక జరిగిపోయివుండేది."

"అలాగా ! మీ రిలానే సంబంధం ఖాయం చేసుకునే పెళ్ళి చేసుకున్నారా." అనబోయి ఆగిపోయింది సుమిత్ర.

"అదేమిటి యేదో అనబోయి ఆగిపోయారు."

"యేంలేదు మీ వుద్యోగం యెలావుంది" మాట మారుస్తూ అంది.

"అది నా వుద్యోగం యింకా కాందే."

"అంటే ?"

"ఆరువేలు అప్పుచేసి ఈ వుద్యోగాన్ని అప్పుయిచ్చిన రాజేశ్వరి అక్కకి తాకట్టుపెట్టాను ఆ బాకీ తీరితేకానీ స్వంతం కాదుగా.

"మీరు చెప్పింది అర్థంకాలేదు "

"యిందులో అర్థం అయేందుకు యేంలేదు డిగ్రీ వుంది. బ్యాంక్ పరీక్ష రాశాను యింతక్రితం రెండుసార్లు, అయినా వుద్యోగం రాలేదు చిదంబర రహస్యం తర్వాత తెల్సింది. దక్షణాయనం యివ్వలేక రాలేదని ఈసారి ఆ దక్షణ యిచ్చి వుద్యోగం కొనుక్కున్నాను. అమ్మాయిలు మొగుళ్ళని కొనుక్కున్నట్లు" అంటూ నవ్వేశాడు కానీ పేలవంగానేవుందా నవ్వు.

'మీకంత అప్పుపెట్టిన రాజేశ్వరిఅక్క పోనీ వుద్యోగమే వేయించలేక పోయిందా ? అయినా ఆవిడ మీ స్వంత అక్కగారా?"

"కాదు. దేశం. కాదు . ఈ సమాజం యిచ్చిన అక్క."

"అలా చెప్తే అర్థం అవటానికి నేనేం పోస్టుగ్రాడ్యుయేటేని కాను"



"వీటికి డిగ్రీలెందుకండీ. సరే. అదో కథలెండి వింటానంటే చెప్తాను. కానీ యింటికి వెళ్ళిపోవాలని త్వరపడుతున్నారుగా."

సుమిత్రకి ఆ రాజేశ్వరి యెవరో తెల్సుకోవాలని కుతూహలంగా వుంది. కానీ రాజేంద్రతో మాట్లాడుతూ కూర్చోవాలనిలేదు. అయినా వెనక్కి తిరిగి పార్కులోకి వచ్చి పచ్చగడ్డిమీద చతికిలబడి దగ్గరలోనే కూర్చున్న రాజేంద్రతో 'చెప్పండి' అంది

"యే విషయం" అనేసరికి సుమిత్రకి కోపం వచ్చేసినా మింగేస్తూ,

"మీ రాజేశ్వరక్క విషయం. మీకు వుద్యోగం కొని యిచ్చిన భాగ్యవంతురాలి విషయం" తెలియని అసూయ ధ్వనించింది సుమిత్ర గొంతులో, రాజేంద్ర అదేం పట్టించుకోనట్లు యిప్పుడేవస్తాను, అంటూ వెళ్ళి మిరపకాయబజ్జీలు, వేరుశనక్కాయలూ తెచ్చి సగం సుమిత్రకి యిస్తూ,

"తింటూ వుండండి. నేను చెవుతూంటాను, అంటూ మిరపకాయబజ్జీలు తినేసి తలెత్తి చూసి "అరె తినటం లేదేం" అంటే,

"అవంటే నాకు వళ్ళుమంట" అంది అక్షర అక్షరం నొక్కిపలుకుతూ.

"అలాగా! అయితే నా వేరుశనక్కాయలూ మీరే తినేయండి" అనేసి సుమిత్ర దగ్గరున్న మిరపకాయబజ్జీలు తీసుకుని తినేసి కాయితం అవతల పారేసి పాంటుజేబులోని స్ట్రాంగ్ పిప్పర్‌మెంట్ ఒకటి తీసుకుని నోట్లో వేసుకుని "అమ్మయ్య కారం యిప్పటికి తగ్గింది మీక్కూడా కావాలా! తీసుకోండి సుమిత్రాదేవిగారూ" అంటూ పాకెట్ అందించాడు. అంతవరకూ అతన్నీ అతని అలవాట్లనీ చూస్తూ ఆలోచిస్తూన్న సుమిత్ర 'ఒక్కటి చాలు' అంటూ తిరిగి పాకెట్ ఇచ్చింది "యింక చెప్పండి" అంది వేరుశనగపప్పులు తింటూ. రాజేంద్ర ఒక చెయ్యి క్రింద ఆన్చి వొరిగి కూర్చుని కళ్ళజోడు తీసుకుని కర్చీఫ్‌తో తుడుస్తూ

"సుమిత్రాదేవిగారూ నే యిప్పుడు చెప్పబోయే ప్రతి అక్షరం యదార్థం. వినటానికి కొన్ని నిజాలు వెగటుగావున్నా జీవితాల్లో జరుగుతూనే వుంటాయి. ప్రతివ్యక్తి జీవితం వడ్డించిన విస్తరిలా వుండదండీ అసలు విషయంలోకి వస్తాను నేను డిగ్రీ తీసుకుని యీవూరు వచ్చి బ్రతుకు తెరువు వెతుక్కుంటూ చెప్పుల జతలు అరిగిపోయేలా తిరుగుతున్న రోజుల్లో రోజూ సరిగ్గా ఈపార్కులోనే నిరాశగా కూలబడేవాణ్ణి వెళ్ళిన ఇంటర్వ్యూలో సెలెక్ట్‌కాలేదే అన్న బాధ, అక్కడ జరిగే అవకతవకలకు రక్తం వుడికిపోయి అప్పుడు అక్కడున్న వాళ్ళందరినీ హతమార్చాలన్నంత ఆవేశం వచ్చినా ఆపుకుంటూ కాళ్ళీడ్చుకుంటూ యీ పార్కులో కూలబడ్డాను. చల్లగాలికి సేదదీరుతూ. -రోజు సాయంత్రం అయిదు గంటలప్పుడు పరిసరాలని మర్చి కూర్చున్న నా దగ్గరకి ఓ యిరవై అయిదూ ముప్పై యేళ్ళ అందమైన అమ్మాయి పల్చటి సిల్కుచీరె కట్టుకుని పమిట నిర్లక్ష్యంగా వేసుకుని కాలాకిల్లీనవులుతూ నా దగ్గరగా వచ్చి యిటూ అటూ రెండుమూడుసార్లు తిరిగినా నేను గుర్తించే స్థితిలో లేనని అర్థంచేసుకుని కాబోలు మరీ దగ్గరగా వచ్చి చాలా అసహ్యకరంగా చూస్తూ నిలబడింది. నేను అర్థంచేసుకుని ఆమెవైపు కోపంగా చూసేసరికి వెళ్ళిపోయింది. మరో పదిరోజుల తర్వాత యిరవై యేళ్ళ అమ్మాయి 'రెండు రూపాయలు కావాలి' అంది చెయి చాస్తూ. వేరుసెనగపప్పులు తింటూ కాఫీ తాగాలనే 'తిక్కని' వదుల్చుకోవాలని ప్రయత్నిస్తూన్న నాకు మరో చిరాకువచ్చి యిదివరకటి అమ్మాయేనేమో అని తలెత్తి కోపంగా చూశాను ఆమెకాదు, యీ అమ్మాయి.

"ఎందుకు?" అన్నాను విసుగ్గా.

"ఆకలిగావుంది" అంది.

[illegible] అన్నాను.

"దొరకలేదు."

"నాకూ దొరకలేదు" అన్నాను కోపంగా.

''యేంటి" అంది అమాయకంగా చూస్తూ.

''వుద్యోగం" అన్నాను కసిగా. ఆ అమ్మాయి చాచిన చెయ్యి వెనక్కి తీసుకోలేదు. నాకు కోపం తగ్గనూలేదు. ఆ ప్రదేశంలో నాకు ప్రతిరోజూ రకరకాల భిక్షకులు కన్పించి చెయ్యి చాచటం అలవాటే కానీ యీ అమ్మాయి వారందరిలోకీ భిన్నంగా కన్పిస్తోంది. ఆ అమ్మాయి వివరాలు కనుక్కునే వోపికలేదు యెందుకంటే యెవర్ని కదిలించినా కష్టాల 'ఖాతా' ముందు విప్పిపరుస్తారు అనే భయం. ఆ పిల్లకళ్ళలో కన్పించే యేదో తెలియని భావానికి చకితుడినై జేబులోవున్న రెండు రూపాయలనీ ఆ చేతుల్లో పెట్టి 'పో' అన్నాను.

ఆ పిల్లకళ్ళు మెరిసాయి క్షణం ఆ కాయితాన్ని గట్టిగా పట్టుకుని అంది. "బహుశా యీ బాకీ తీర్చలేకపోవచ్చు. అందుకే... మీకు కావాలంటే యిక్కడైనా.. యెక్కడైనా." అంది నా కళ్ళలోకి చూస్తూ అయిదు నిముషాల తర్వాతగానీ ఆ అమ్మాయి చెప్పిన మాటలోని భావం అర్థంకాలేదు. అయేసరికి అసహ్యం ముంచుకొచ్చింది. "ఛీ..." అని వురిమిచూశాను. ఆ పిల్ల భయపడి త్వరత్వరగా వెళ్ళిపోతూనే వెనక్కి చూసింది ఓసారి. నాకు ఆవేశం వస్తోంది. చివాలునలేచి అన్నాను "యిదిగో నీ పేరేంటో నాకు తెలియదు. కానీ యీ బాకీ తీర్చటానికి అంటూ మళ్ళీరాకు, వచ్చావా జాగ్రత్త. నీకు వూరికే యిచ్చాను పో" అని అరిచాను ఆ అమ్మాయి క్షణం ఆగి అంతా విని వెళ్ళిపోయింది నా తల వేడెక్కిపోయింది

ఆ తర్వాత రకరకాల వుద్యోగాలూ చేశాను, ప్రయివేటు కంపెనీల్లో. నెలరోజులేవుంది, ఓ వుద్యోగం. పదిరోజులువుంది మరో వుద్యోగం. అసలు యీనాటి సాంఘిక పరిస్థితి యీ మాధ్యనే పూర్తిగా అర్థం చేసుకోగల్గాను స్థిరంలేని వుద్యోగాలు చేస్తూనే మంచి వుద్యోగానికి ప్రయత్నిస్తూ సతమతమవుతూండగానే రెండు సంవత్సరాలు కాలగర్భంలో కలిసిపోయాయి 'బ్యాంక్' యింటర్వ్యూలూ పరీక్షలూ వగైరా ఒకరోజు నూటముప్ఫై రూపాయల వుద్యోగానికి ఆశపడ్డా అదిపోయి నిరాశతో కాళ్ళీడ్చుకుంటూ రూముకి వస్తూ వుండగా ఓ తెల్లఫియట్ సర్రున దూసుకువచ్చి నా ప్రక్కనే ఆగింది హడిలిపోయాను. దానిక్రింద పడిపోయానే అనుకుని అసలే కోపంగావున్న నాకు మరీ

పిచ్చికోపం వచ్చింది. ఆగిన కారులో నున్న డ్రైవర్‌మీదకి వెళ్ళే నన్ను వెనక సీట్లో కూర్చున్న అందమైన అమ్మాయి చెయ్యిచాచి గట్టిగా పట్టుకోవటంతో విస్తుపోయి తలతిప్పిచూశాను.

తెల్ల ఫారెన్ నైలెక్స్ చీరెమీద అందంగా కుట్టిన యెంబ్రాయిడరీ మెరిసి పోతోంది. తెల్ల జాకెట్టు, మెడలో ముత్యాల హారం, చేతులకి ముత్యాల గాజులు. వేలికి ముత్యపు టుంగరం, తలలో తెల్లటి మల్లెలు. ఆ ముఖాన్ని యెక్కడో యెప్పుడో చూసినట్లు అన్పిస్తోంది. కానీ యిలా కారూ నగలూ వున్న అమ్మాయి నాకెవరూ పరిచయంలేదు అన్నది యదార్థం. ఆమె ముఖంలోకి చూస్తూనే చెయ్యి వెనక్కి లాక్కుంటూంటే వదలకుండా "గుర్తించలేదూ" అంది నవ్వుతూ

"ఉహూ" అన్నాను బహుశా తనే పొరబడివుండవచ్చు అనుకుంటూ.

''లేదూ?'' అంది దృఢంగా.

"నా పేరు రాజేంద్ర మీరు కావాలనుకున్నవారు మరొకరు కావచ్చు."

"పేరు యింతవరకూ తెలియదే అనుకోండి. కానీ నేను వెతికేది మీ కోసమే" అంది

"నా కోసం వెతుకుతున్నారా? అంటే?"

"మా యింటికి రండి చెప్తాను" ఆమె అలా అంటూంటే డ్రైవరు డోర్ తెరిచి పట్టుకున్నాడు. ఆ కారు వెనక సీట్లో మరెవరూ లేరు ముందూ లేరు.

"క్షమించండి. నాకు తెలియనివాళ్ళ యింటికి రాలేను.''

"మీకు తెల్సు కానీ మర్చిపోయి వుండవచ్చు."

"అహ నాకు పరిచయం అయితే మర్చిపోవటం అసంభవం".

"సరే నేనే గుర్తుచేస్తాను. యిక్కడకాదు, యింటిదగ్గర. కారు యెక్కండి."

నేను తల అడ్డంగా వూపాను. ఆ అమ్మాయి లాభంలేదని కాబోలు మెల్లిగా అంది, "నేను రాజేశ్వరిని" అని.

"రాజేశ్వరా!" నా మెదడు తీవ్రంగా పనిచేస్తోంది. కళ్ళు ఆ అమ్మాయిని పరీక్షగా చూస్తున్నాయి. యెవరెవరి ముఖాలో సినీమారీలులోలాగా తిరుగు తున్నాయి. ఆఖరున పార్కులోని దృశ్యం గుర్తుకొచ్చింది. కానీ ఆశ్చర్యం ముంచుకొచ్చింది. 'ఆ రాజేశ్వరా. . యీ... రాజేశ్వరి' నాకు తెలియకుండానే వెలువడ్డాయి యీ మాటలు యింక ఆ అమ్మాయి నా చేతిని బలవంతంగాలాగి తన ప్రక్కనే కూర్చోబెట్టుకుంది కారు కదిలి ముందుకు దూసుకుపోయింది"

అంటూ ఆగి సుమిత్ర చాలా శ్రద్ధగా వినటం గ్రహించి యింకా చెప్పకు పోతున్నాడు.

"ఆ తర్వాత అంతా మామూలుగా జరిగేదేలెండి. పెద్దమేడ, బోలెడంత డబ్బూ, నౌకర్లూ వగైరా. రెండే సంవత్సరాల్లో యింత సంపదని యెలా పోగుచేసుకుందో యిప్పటికీ ఆశ్చర్యమే అన్నట్లు తన బాకీ రెండు రూపాయలకీ రెండువేలు తెచ్చి నాకిచ్చి తీసుకో' మంది.

ఆ డబ్బుతో చాలా అవసరంవుంది కానీ తీసుకోబుద్ధికాలేదు. ఆ సంపద యెలా వచ్చిందో ఆమె చెప్పకుండానే అర్థమైన నాకు ఆ ఇంట్లో అరకప్పు కాఫీ తాగబుద్ధికాలేదు. వెంటనే లేచేశాను. రాజేశ్వరి కళ్ళలో నీళ్ళు తిరిగాయి నా చేతులు పట్టుకుని మరీ మరీ ప్రార్థించింది. తన దగ్గర చాలా డబ్బుందనీ, నాకు అవసరం అయితే తీసుకోమని తను యెంతో కష్టంలో యిచ్చిన ఆ రెండు రూపాయలూ రెండు లక్షల విలువకలవి అని అన్పిస్తూవుంటుందనీ కృతజ్ఞతని మరీ మరీ చెప్పింది మీకు యే అవసరం వచ్చినా నా సహాయం వుంటుంది, రాజేంద్రగారూ. అప్పుడప్పుడూ వచ్చిచూసి వెళ్ళండి, అని అన్నది.

నేను యింటికి వచ్చేశాను. తర్వాత చాలారోజుల వరకూ ఆ యింటికి వెళ్ళలేదు. అసలు అక్కడికి వెళ్ళవలసిన అవుసరం వస్తుంది అని యెప్పుడూ అనుకోలేదు. కానీ యీ వుద్యోగాన్వేషణలో విసిగివేసారి చాలా అలిసిపోయాను. ఆరువేలుయిస్తే బ్యాంక్ జాబ్. అన్ని అర్హతలూవున్నా డబ్బు లేక, పోయిన అవకాశాలని గుర్తుచేసుకుని, ఆదర్శాన్ని చెత్తబుట్టలో పారేస్తే. అన్న ఆలోచనతో రాజేశ్వరి యింటికి వెళ్ళాను. కానీ విషయం చెప్ప టానికి మనస్సు యెదురు తిరిగింది. అంతరాత్మ ఆగ్రహించింది. అందుకే తిరిగి యిల్లుచేరాను. యేదో తప్పు చేయబోయీ తప్పించుకున్నాననే తృప్తితో హాయిగా గాలి పీల్చుకున్నాను. అయితే యీ విషయాలన్నీ వివరిస్తూ మా తాతయ్యకి వుత్తరం రాశాను."

"మీ తాతయ్యా! ఆయనెవరు?"

"ఆయన చినతాతగారే అయినా నాకు అతిముఖ్యుడు. నా కేసలహాకావల్సినా ఆయనదే తీసుకుంటాను. యిది తెల్సుకుని ఆయన తన స్నేహితులతో రిక మెండ్ చేయించారు అలా వచ్చింది వుద్యోగం. కానీ తర్వాత మా చెల్లాయి పెళ్ళికి ఓ ఫ్రెండ్ దగ్గర అప్పుతీసుకున్నాను. ఆ అప్పు యిప్పటికి తీరి పోయింది అమ్మయ్య ఋణవిముక్తుడిని అయానని సంతోషంగా వుంది!" రాజేంద్ర హాయిగా గాలి పీల్చుకుంటూ అన్నాడు.

సుమిత్రకి నవ్వూ, కోపమూ వస్తున్నాయి. అతన్ని ఆటపట్టించాలని చిన్నగా నవ్వుతూ "యింతకీ యీ కష్టసుఖాలన్నీ నాకెందుకు చెప్పినట్లు?" అనగానే రాజేంద్ర ముఖం యెర్రగా కందిపోయింది. పాంటు జేబులోని కర్చీఫ్ తీసుకుని ముఖం తుడుచుకుంటూ.

"క్షమించండి, సుమిత్రాదేవిగారూ యెంత నిబ్బరంకల మనుషులకైనా ఒకొక్కొక్కప్పుడు మనస్సు ఆదోలాఅయి అటూయిటూ పరుగులు తీస్తుంది అందులోనూ ఆత్మీయులదగ్గర అదుపు తప్పుతుంది. యిది నా బలహీనతే కావచ్చు. మీకు విసుగు కల్గించినందుకు సారీ!" అంటూ రాజేంద్ర ముఖం చిన్నబుచ్చుకుని లేచేశాడు

సుమిత్రకి జాలేసింది. ఛీ ...తప్పుగా మాట్లాడాను పాపం అతని అభిమానం దెబ్బతింది అనుకుని పైకి "అహహ అదేంలేదు. యెవరికైనా మనస్సులోని బాధని భరించలేనప్పుడు తరుచుగా యిలా జరుగుతూనే వుంటుందిలెండి." అన్న తర్వాతగానీ రాజేంద్ర ముఖం మామూలుగా కాలేదు.

"మీకు తల్లిదండ్రులు లేరా?" అంది.

"లేరు. కానీ ఒక్కగాను ఒక్క చెల్లాయికి పెళ్ళి జరిపించేశాను. ఆమె హాయిగా సంసారం చేసుకుంటోంది. యింక నాకు చింతలేదు. మా తాతయ్య ఓల్డుస్టూడెంట్ సాయంచేసి నన్ను నిరుద్యోగాన్నుంచి రక్షించాడు. యిప్పుడింక నాకు దిగులులేదు," అని వాచ్ చూసుకుని "వెళ్ళివస్తానండీ" అంటూ వెళ్ళిపోయాడు.

## 11

అలిసిపోయి ఆఫీసునించి యిల్లుచేరిన సుమిత్రకి తలుపు తియ్యగానే పోస్టుమేన్ పడేసిపోయిన కవరు కన్పించి ఆతృతగా అందుకుని తన అడ్రెస్ చూసుకుని తల్లి దస్తూరీ గుర్తించి ఆశ్చర్యపోతూ కవరు చించింది పార్వతమ్మ సామాన్యంగా రాయదు. కొడుకుచేతే రాయిస్తుంది. కానీ యీ రోజు అమ్మ రాసిన వుత్తరం సుమిత్ర మనస్సులో యేవేవో ఆలోచనలు గుండె వేగంగా కొట్టుకుంటూంది. ఉత్తరం చదవటం మొదలెట్టింది.

చి|| సుమిత్రకి

అమ్మ ఆశీస్సులు. సూర్యం వ్యాపారం జాగ్రత్తగానే చేసుకుంటున్నాడు. పెట్టుబడి తక్కువ గనక లాభాలూ అంతంత మాత్రమే అనుకో. యేమైనా ఫర్లేదు. విజయవాడ వారికి చెల్లాయిని యిస్తాం. నాలుగువేలుకట్నం యిస్తాం పెళ్ళి మాత్రం చాలా సింపుల్‌గా చేస్తాం అని కబురు పంపాను. వారు వచ్చి

పిల్లని చూసి అన్నిటికీ సరే నినీ ఆడబడుచు లాంఛనాలూ, అప్ప గింతల బట్టలూ అంటూ మరో వెయ్యి వరకూ లెక్క చెప్పారు. మనకిది బరువే అయినా 'సరే' అన్నాను. మరి మీ నాన్న మాత్రం బెల్లం కొట్టిన రాయిలా చూస్తూ కూర్చున్నారు. అయినా పట్టించుకోను నేను వారికి చెప్పాను పెద్దమ్మాయికీ త్వరలో సెటిల్ చేసుకుని యిద్దరికీ కలిపి చేస్తాం అని సరే అన్నారు. పెళ్ళి కొడుకు మాత్రం పిల్ల నచ్చింది కానీ వుద్యోగం చేసుకునేదైతే బాగుండేది. అని నసుగుతున్నాడట. అప్పుడు సూర్యనారాయణ పంతులుగారు "పెళ్ళి అయిన తర్వాత నువ్వే ప్రయత్నించుకుని వుద్యోగం వేయించుకో. హైస్కూలు చదువు పూర్తిచేసిన పిల్లేగా" అన్నారు. అతను 'సరే' అన్నట్టు తలపూపాడు యివన్నీ సరే. యిల్లు బేరం పెట్టవద్దన్నావు. మరి నీ పెళ్ళికి ఖర్చూ, కట్నం యెలాగమ్మా.

యెలాగైనా సరే ఒకే నెలలో మీ యిద్దరి పెళ్ళిళ్ళూ జరగాలన్నదే నా ఆరాటం. యివన్నీ సరే నీ క్షేమం రాయి నీ స్నేహితురాలు కమలని అడిగానని చెప్పు. మరో విషయం. మీ నాన్న యిల్లు వదిలి యెక్కడికో వెళ్ళిపోయారు. ఆయనే వస్తారులే అని యీ రోజువరకూ యెదురుచూశాను. కానీ రాలేదు. నాన్న యిలా వెళ్ళినందుకు నువ్వేం దిగులుపడకు. యెందుకంటే ఆయనకి బైటి ప్రపంచంలో 'సుఖం' వూరికే దొరకదని తెలియదు.

తెల్లవారకముందు కాఫీ, స్నానానికి వేడినీళ్ళూ, రుచిగా భోజనం వగైరా బైట యెవరు పెడతారు యీ మధ్య తరుచుగా సన్యాసుల్లో కల్సిపోతాను అనే వారు అయితే సన్యసించటం అంటే యెంత కష్టమో తెల్సుకున్న రోజున యీ యిల్లునీ యిల్లాలినీ వెతుక్కుంటూ వచ్చేస్తారనే ధైర్యంతో వున్నాను. నువ్వే దిగులుపడకమ్మా యిలా బైటికి వెళ్ళటం ఒకందుకు మంచిదే. కొందరి విలువలు తెలియటానికి అవకాశం దొరుకుతుంది కనుక.

తిరిగివచ్చినప్పుడు మనస్సు కాస్త అయినా మారుతుందని నా ఆశ. యీ ఆశతోనే నిబ్బరంగా వున్నాను వెంటనే వుత్తరంరాయి నాన్న నీ దగ్గరికి గనుక వస్తే వెంటనే యింటికి పంపేసెయ్యి. యిక్కడికి వస్తే నీకు వుత్తరం రాస్తాను. నీ ఆరోగ్యం జాగ్రత్త.

ఇట్లు

అమ్మ

సుమిత్ర తల గిర్రున తిరిగిపోతున్నట్లే వుంది, వుత్తరంలోని విషయానికి. నాన్న అసలు యిల్లు వదిలి వెళ్ళిపోవటానికి కారణం యేమిటి? యేంచేయాలని

వెళ్ళారు! అహంభావంతో అనారోగ్యాన్ని కూడా లెక్కచెయకుండా యెక్కడికి వెళ్ళారో! యేం అవస్తపడుతున్నారో! భగవాన్. అమ్మకి నేను ధైర్యం చెప్పవల్సిన పనిలేదు. ఆవిడే నన్ను అధైర్యపడవద్దు అని రాసింది!

సుమిత్రకి తల్లి ధైర్యం ఆశ్చర్యమూ, ఆనందమూ కల్గించింది. పరోవైపు తండ్రికోసం బాధగానూ వుంది. అసలు ఆయన మాట కాదని నేనూ నొప్పించాను అని తనమీద తనే విసుక్కుంది. తలనొప్పితో కుర్చీలో అలాగే పడుకుని వుండిపోయింది. కాస్త 'టీ' యిచ్చే దిక్కుకూడా లేదు యింటికి వస్తే. కమల యేమైందో, యెక్కడ తిరుగుతుందో అర్థమే కావటంలేదు. యీ రోజు ఉదయం చాలా హుషారుగా వెళ్ళింది 'ఆఫీసుకి' అని. కానీ యెందుకో నమ్మబుద్ధికాలేదు ఆమె మాటని యెవరి ఖర్మకి వారే కర్తలు, అనుకున్నా సుమిత్రకి శాంతిగాలేదు చీకటిపడినా రూములో లైటు వేసుకోవాలన్పించలేదు.

''సుమిత్రక్కా చీకట్లో కూర్చున్నావేం" అంటూ చక్రవర్తి వచ్చి సినిమా కబుర్లు మొదలెట్టాడు. కొత్త సినీమాలో హీరో యే రకం డ్రెస్‌లు వేసుకున్నాడో అవి యెంత బావున్నాయో, అలాంటివి కుట్టించుకుని వేసుకుంటే యెంత బాగుంటుందో వర్ణించి చెప్తూ "అలావున్నావేం అక్కా ? తలనొప్పా కాఫీ తాగలేదా? పోనీ నేను కాచియివ్వనా?" అంటూ అయిదు నిముషాల్లో రెడీచేసి తెచ్చి 'తాగు అక్కా' అంటూ యిచ్చాడు 'నువ్వూ తాగు' అన్నా అతను తాగలేదు.

"వద్దక్కా, అమ్మ టిఫినూ, టీ యిచ్చింది యిప్పుడే" అంటూ యేవేవో కబుర్లు చెప్తూండగా కమల కాళ్ళీడ్చుకుంటూ వచ్చి హేండ్ బ్యాగ్ ఓ ప్రక్కకు గిరాటుకొట్టి చాపమీద బోర్లపడిపోయింది.

"ఏమైంది" అని అడుగుతూనేవుంది సుమిత్ర. 'పనివుంది వెళ్ళివస్తానక్కా' అని చక్రవర్తి వెళ్ళిపోయాడు. కమల నల్లరాయిలా బిగుసుకుపోయి జవాబు చెప్పకపోయేసరికి సుమిత్రకి చిర్రెత్తుకొచ్చింది. అయినా శాంతం తెచ్చుకుని "కమలా, యేం జరిగిందో చెప్పు, తర్వగా" అడిగింది.

"నువ్వు అన్నంతా అయింది."

"యే విషయంలో ?"

"ధర్మారావు..."

"యేంచేశాడు ?" ఆతురతగా అడిగింది.

"ముత్యాల నెక్లెస్ చేయిస్తాననీ చేయించాననీ ఆశపెట్టి యిదిగో అని చూపించి ఆఖరికి అన్నాడూ...''

"చెప్పు."

"సుమిత్రని నా దగ్గరకి తీసుకువస్తే యీ నెక్లెస్ నీకిస్తా అన్నాడు."

సుమిత్ర ముఖం యెర్రగా కందిపోయింది. కళ్ళు యెర్రబడిపోయాయి. ఆ ముఖాన్ని చూసి ఆగిపోయింది కమల.

"చెప్పుపెట్టి కొట్టాలి వెధవని" వూగిపోతూ ఆవేశంగా అంది

"ఆ పనే చేసి వచ్చేశాను."

"నిజంగా" కమలచెయ్యి చటుక్కున తీసుకుని.

"నిజంగా" అంది కానీ కమలకి కన్నీళ్ళు ఆగలేదు. "సుమిత్రా నీ మాట విననందుకు శాస్తి బాగా అయింది. మరెప్పుడూ యిలా నమ్మను. వాడి మాటలన్నీ నిజం అనుకున్నాన మొదట నన్ను పెళ్ళిచేసుకుంటానని తర్వాత 'నీవు కావాలి' అన్న ఆ ఛండాలుడి ముఖం జన్మలో చూడను."

వెక్కి వెక్కి యేడుస్తోంది కమల. సుమిత్ర అనునయంగా దగ్గరకి తీసుకుని "పోనివ్వు సమయం మించకుండా తెల్సుకున్నావు. యిదీ వొకందుకు మంచిదే."

"సుమిత్రా. ధర్మారావుతో పెళ్ళి సెటిల్ అయిందని చాలామందితో చెప్పాను. రేపటినించీ యే ముఖం పెట్టుకు తిరగను."

"............"

"మా అమ్మావాళ్ళకి వుత్తరంరాశాను, కానీ కట్నం లేకుండా లక్షాధికారి భర్త దొరికాడని. రేపే మా చిన్నాయన వస్తానని రాశారు. వాళ్ళకి యేం చెప్పను? యెలా చెప్పను" కమలకి కన్నీళ్ళు ఆగటంలేదు.

"నువ్వు చెప్పవద్దు నేను యెలాగో సర్దిచెప్తాను. కానీ ఒక షరతు"

"షరతా! చెప్పు. దేనికైనా ఒప్పుకుంటాను సుమిత్రా యిప్పుడు వాళ్ళకి సర్దిచెప్పటమే కావాలి నాకు."

"అయితే నే చెప్పేది విను. ఆర్థిక యిబ్బందులు లేకున్నా చదువుకున్నావు గనుక వుద్యోగం చేస్తూ నా భర్తని నేనే వెతుక్కోగలను అని యిక్కడికి వచ్చినా ప్రపంచపుపోకడ కొంత అర్థం అయిందికదూ. నీవు యెన్నిక చేసు కోవటంలో యెంత అభాసు అయావో అర్థమైందిగా పోనివ్వు. మీ పెద్దలు కుదిర్చిన పెళ్ళిచేసుకుని హాయిగా వెళ్ళిపో అవసరంలేని నీలాంటి ఆడపిల్లలకి వుద్యోగం అనవసరం సుఖంగా సంసారం చేస్తూ పిల్లాపాపలతో అనుకూలుడైన భర్తతో సుఖసంసారం కలిగేలా చెయ్యమని భగవంతుడిని ప్రార్థించు."

"సుమిత్రా! అలాగే చేస్తాను" అంది కళ్ళు తుడుచుకుంటూ. మళ్ళీ అంది

కమల ", సుమిత్రా ప్రపంచంలో అందరూ చెడ్డవాళ్ళే వుండరుకదూ" అని.

"వుండరు కానీ మంచివాళ్ళతో మనకి పరిచయం కావద్దూ అలా అయితే అదృష్టమే ! సరే నేను వంటచేస్తాను'' అంటూ లేచింది సుమిత్ర కమల వద్దు నేనే చేస్తాను అంటూ అడ్డువచ్చి 'సుమిత్రా నీవెంత మంచిదానివి. నీ సలహా కొంత పాటించాను కనుక యీ రోజు కొంత బాధగావున్నా కొంత అదృష్ట వంతురాలిని సుమా అనుకుంటున్నాను నేను కోపగించుకున్నా నువ్వు అపోహ పడక నన్ను స్వంత చెల్లెలికన్నా యెక్కువగా చూసుకుంటున్నావు" అంది సుమిత్రని గట్టిగా కౌగలించుకుని.

సుమిత్ర నవ్వేస్తూ "సరే వదులు పిచ్చిపిల్లా" అంటూ కమల వీపు ప్రేమగా నిమురుతూవుంది. సుమిత్ర కళ్ళలో నీటిపొర కదిలింది కమల పమిట తిప్పి దోపి చకచకా వంటపని ప్రారంభించింది సుమిత్ర సాయంచేస్తోంది కానీ మనస్సులో తెలియని బాధ, తండ్రి తిరిగివచ్చేనా అని ప్రక్కయింట్లోనించి భవానమ్మ పెద్దగా అరుస్తోంది మొగుడిమీద యెందుకో. ఆయన పిల్లిలా జవాబు చెప్పటంలేదు బహుశా ఆ క్రితంరోజు పేకాటలో ఓడిపోయిన డబ్బు వివరాలు అడుగుతూ వుండి వుంటుంది అనుకున్నారు స్నేహితురాళ్ళిద్దరూ. ఆయన అన్ని విషయాల్లోనూ మంచివాడేకానీ పేకాటా, రేసులూ, లాటరీ టిక్కెట్లూ అంటూ చాలా డబ్బు తగలేస్తాడు. ఆయన్ని కమల యెప్పుడూ అంటుంది, 'మంచి మొగుడు' అని.

## 12

ఆఫీసునించి సరాసరి ఇంటికి రాబుద్ధికాలేదు సుమిత్రకి. ఆఫీసులో పని యాంత్రికంగా చేసింది కానీ మనస్సులో చెప్పలేనంత అశాంతిగావుంది అప్పుడే తండ్రి ఇల్లు వదిలివెళ్ళిపోయి మూడు నెలలు దాటిపోయింది తల్లి అందరం క్షేమంగానే వున్నాం అని వుత్తరాలు రాస్తున్నా సుమిత్రకి శాంతిలేదు

నేను నాన్న మాటకి యెదురు చెప్పకుండావుంటే యిలా ఇల్లువదిలి వెళ్ళి వుండేవారు కారేమో ! అనే బాధ నిలువునా దహిస్తోంది. యీ అశాంతిలో అన్నం సయించక బాగా చిక్కిపోయింది సుమిత్ర రాజేంద్ర అప్పుడప్పుడూ కన్పించినా యెక్కువసేపు మాట్లాడకుండానే వెళ్ళిపోతున్నాడు. అతని మనస్సు యెందుకో గాయపడింది అది స్పష్టంగా తెలుస్తూనేవుంది యీసారి అతను కన్పిస్తే, సారీ చెప్పాలి అనుకున్నది కానీ రాజేంద్ర కన్పించటంలేదు. సుమిత్ర పార్కులో యెనిమిదిగంటలవరకూ కూర్చుని తరువాత యింటికి చేరింది

కమల ఈ మధ్య చాలా బుద్ధిమంతురాలై పోయింది. సుమిత్రని చూడగానే లేచి "భోజనం చేసేద్దాం బట్టలు మార్చుకురా సుమిత్రా" అని యిద్దరికీ వడ్డించేసింది. సుమిత్ర యాంత్రికంగా భోజనం చేస్తున్నా ప్లేటులో కొత్తరకం వూరగాయి రుచి తెల్సుకుని "యిదెక్కడిది" అంది యింకాస్త అన్నం కలుపుకుంటూ.

"పంగనామాల పద్మనాభంగారి భార్య భద్రకాళి పనివేళా వచ్చి 'కమలమ్మా పాపం ఆడపిల్ల లిద్దరూ ఆఫీసుకి పరుగెత్తే హడావుడిలో యేం చేసుకుంటున్నారో అని నా ప్రాణం కొట్టుకుంటూ వుంటుందమ్మాయ్. వేపుడు కూరలు చేసుకుని తింటే నోటి రుచి చస్తుందిమరి అందుకే ఈ వూరగాయ తెచ్చాను. తిని రుచి యెలావుందో చెప్పండి. అన్నట్లు మేం యిద్దరం కొత్త సినీమా వచ్చిందని వెళుతున్నాం. కాస్త మా చిట్టిని (కస్తూరిని) మీ గదిలో పడుకోనివ్వండి' అని అసలు విషయం చల్లగా చెప్ప వెళ్ళింది. అదుగో ఆ మూలకస్తూరి ముసుగు తన్ని నిద్దరోతోంది అమాయకురాలు." కమల యేకధాటిగా చెప్పి గ్లాసుడు నీళ్ళు తాగి యింక మజ్జిగ అన్నం కలుపుకుంటోంది.

సుమిత్రికి అసలు భద్రకాళి కుటుంబం అంటేనే మంట. ముసలాళ్ళు అయినా భార్యా భర్తా వచ్చిన ప్రతి చెత్త సినీమా చూడకుండా వుండలేరు. కానీ చిన్న పిల్లలు యెప్పుడన్నా సరదాపడి 'వస్తాం' అని వెంటపడితే 'ఛీ ఛీ తప్పు తప్పు, చిన్నపిల్లలు సినీమా చూడకూడదు' అని అర్ధగంట వుపన్యాసం దంచేస్తా డాయన ఆవిడా 'ఔనౌను' అంటూ వంతపలుకుతుంది.

మంచి తల్లిదండ్రులే అనుకుంది సుమిత్ర. యిద్దరి భోజనాలూ అయినాయి. కమల పడుకున్న వెంటనే గుర్రుకొట్టి నిద్రపోయింది. సుమిత్రకి నిద్రవచ్చేలా లేదు. చదువుకోవడానికి పుస్తకం కూడా లేదు విసుగు యెక్కువై పోయింది. ఒకవైపు కమలా మరోవైపు కసూరి పోటీలు పడ్డట్లు గుర్రుపెట్టేస్తున్నారు. అసలే ఆ గదిలోకి గాలి రాదు. ఫాను అసలులేనేలేదు యేం జీవితం యిది. తన ఒక్కరికేకాదు. వేలాలక్షలూ ప్రజలకివున్న జీవితమే తనదీనూ, యే ప్రత్యేకతా లేదు కనీస అవసరాలైనా తీరని సంపాదనతో జీవితం అంతా యిలా గడిచి పోవల్సిందేనా ! ఈ చేసే వుద్యోగం తప్ప డబ్బు సంపాదనకి మరో మార్గం కన్పించటంలేదు. సుమిత్రఆలోచించి ఆలోచించి అలిసిపోయింది. అయితే ఒకనెల క్రితం కొత్తగా పరిచయం అయిన అరవింద ఒక వుపాయం చెప్పింది. మిషన్ ఎంబ్రాయిడరీకి యిప్పుడు చాలా గిరాకీవుంది. అవి నేర్చుకుంటే ఖాళీసమయాన్ని

ఖర్చుచేసుకుని నెలకి జీతం డబ్బుకితోడు కొంత సంపాదించవచ్చుననీ అలా తను చేస్తున్నాననీను కావాలంటే నీకూ నేర్పిస్తానని చెప్పింది.

అదైనా నేర్చుకోవాలి. యింక బద్ధకించకూడదు అని నిశ్చయంచేసుకున్నా నిద్రరావటంలేదు. సుమిత్ర ఆలోచనలు యెటెటో తిరిగి పినతండ్రి డైరీవైపు తిరిగాయి. చటుక్కున లేచి పెట్టెలో అడుగున దాచిన డైరీ తీసి అంతక్రితం వరకూ చదివినది వదిలి మిగతాది చదవటం మొదలుపెట్టింది.

"ఆరోగ్యం బాగుపడింది. మళ్ళీ డ్రామాల టూర్ ప్రారంభమైంది. నా నటన నచ్చిందంటూ వుత్తరాలు రాసే అమ్మాయిలూ, అబ్బాయిలూ యెక్కువైనారీ మధ్య. ఒక వయస్సు మళ్ళిన ఆవిడ నాకు ఆరోగ్యాన్ని ప్రసాదించమని భగవంతుడిని ప్రార్థించి ప్రత్యేక పూజలు జరిపించి ఆ ప్రసాదం పోస్టులో పంపింది. వుత్తరంలో తన ఆవేదన వ్యక్తంచేస్తూ. 'హరికృష్ణగారూ మీరు నా వూహల్లో యెలా వుంటారంటే బాధ్యత వహించిన పెద్దకొడుకుగా చెల్లాయిల పెళ్ళి చేయటానికి క్షణక్షణం శ్రమించే అన్నగా వ్యక్తిత్వంవున్న యువకుడిగా యింకా యింకా చాలా రూపాల్లో కన్పిస్తూంటారు. యివన్నీ నీవు వేసిన నాటకాల్లోని పాత్రలేకావచ్చు. అవన్నీ చూసి మాలాంటివారు యేర్పరుచుకున్న భావాలేకావచ్చు. అయినా యీ వూహలు యెంత తియ్యగావుంటాయి. హరికృష్ణా ! నువ్వు సామాన్యంగా సాంఘికాలే వేస్తావెందుకు. పౌరాణికాలు వేస్తే యెలాగుంటావో చూడాలనివుంది. ఒక్కసారి కృష్ణుడిగా వెయ్యి నాయనా చూడాలనివుంది. నాకే కాదు బాబూ మా శ్రీవారికీ వుంది. నాకు వుత్తరాలు రాయటం అలవాటూలేదు. అవసరమూలేదు. కనుకనే నాఅభిప్రాయాలని సరిగా వ్యక్తం చేయలేకపోయాను, అనుకుంటున్నాను. ఒకసారి 'మీరనీ' ఒకసారి 'నీవనీ' భావావేశంలో రాసేశాను. మన్నిస్తావుకదూ ! నా అడ్రస్ యిచ్చానుగా. వీలుంటే ఒకసారి రా నాయనా.

యిలా రాశానని యేం అనుకోకు. నా కొడుకులు యిద్దరూ 'వార్'లో చచ్చిపోయారు. వాళ్ళు పోయారు కానీ నీలాంటి యువకులని చూసినప్పుడు నాకన్పిస్తుంది వీళ్ళందరూ నా పిల్లలుకారూ! అని. యీ సారికి యింక చాలులేవే అని మా శ్రీవారు తొందరపెడుతున్నారు, కనుక ఆపేస్తున్నాను.

ఇట్లు

ఆదిలక్ష్మి వ్రాలు.

అన్న వుత్తరం అపురూపంగా దాచుకుని అప్పుడప్పుడూ చదువుకుంటూ

వుంటాను. యీవిడ యెలా వుంటుందో? యీమె భర్త యెలా వుంటారో. పాపం పుత్రశోకాన్ని మింగేసి నాలాంటివాళ్ళని బిడ్డలుగా భావించుకునే యీ దంపతులని ఒక్కసారి తప్పక చూడాలి. కానీ వీలుకావటంలేదు

సుమిత్రకి ఆవలింతలు వస్తూన్నాయి. అయినా డైరీ మూసేయబుద్ధి కావటం లేదు. మళ్ళీ ఖాళీపేజీ వదిలి చదవటం మొదలుపెట్టింది.

"యీ వూళ్ళో రాత్రి నాటకం పూర్తిఅయింది. యీ రోజే వెళ్ళిపోవల్సింది కానీ అభిమాన సంఘంవారు యేదో సన్మానం అంటూ యేర్పాటుచేసి పెద్దగా హడావుడి చేస్తున్నారు. యిందుకిగాను నేను యీ ఒక్కరోజుకీ ఆగక తప్ప లేదు హోటల్ రూములో విశ్రాంతిగాపడుకుని వార, మాస పత్రికలు దినపత్రిక తిరగేసి క్రితంరాత్రి వేసిన డ్రామాగురించి ప్రశంసలూ విమర్శలూ చూస్తూ న్నాను. నా నటన అమోఘంగా వుందని రాయటం పరిపాటే కనుక అది వదిలి మిగతా రాజకీయాల వార్తలు చదువుతున్నాను. యింతలో గది తలుపు టిక్ టిక్ శబ్దం చేసినట్లు విన్పించి తలతిప్పి చూస్తూ "యస్ కమిన్" అన్నాను, యీ సమయంలో యెవరు వచ్చారబ్బా అనుకుంటూ. తలుపు తీసుకుని ఓ పోలీస్ ఆఫీసర్ లోపలికి వచ్చాడు. తెల్లగా భారీగా యూనిఫారంలో వున్న అతను సుమారు ముప్పై సంవత్సరాల వయస్సువుండచ్చు. హేట్ తీసి పట్టుకుని లోపలికివస్తూ తెల్లపైజామా తెల్లలాల్చీ వేసుకుని మంచంమీద అడ్డంగా పడుకుని చుట్టూవున్న పుస్తకాల్లోనే నన్ను ఆయన యక్స్‌రే కళ్ళతో చూస్తూంటే ఆశ్చర్యపోతూ వెంటనే లేచి మర్యాదాపూర్వకంగా ఆహ్వానిస్తూ "కూర్చోండి... మీరు..." అసలు నా కోసమేనా వచ్చింది. అయితే యేంపని అన్నట్లు చూస్తూంటే ఆయన

"మీరు హరికృష్ణగారే కదూ," అన్నాడు. "అంటూ" లాల్చీబటన్స్ సరిచేసుకుంటూ ఆయన ముఖంలోకి చూస్తూన్నాను.

"మిమ్మల్ని అరెస్టుచేస్తూన్నాను" అన్నాడు సీరియస్‌గా ముఖంపెట్టి

"అరెస్టా? నన్నా?" నిర్ఘాంతపోతూ చూస్తున్న నన్ను ఒక క్షణం అలాగేచూ. పెద్దగా నవ్వేస్తూ" సారీ హరికృష్ణగారూ జోక్‌చేశాను. కంగారుపడకండి అంటూ చెయ్యి అందించాడు. కానీ నేనా చేతిని అందుకోలేదు.

"యిదేం జోక్? అసలు మీరెందుకు యిక్కడికి వచ్చారు" అన్నాను చిరాకుగా చూస్తూ

"హరికృష్ణగారూ మీకు ఫ్రెండ్‌లాంటివాడిని. నా యీ డ్రెస్ చూసి అనుమానపడకండి. అన్నట్టు ముందే మీకు ఫోనుచేసి యిక్కడికి వద్దాం

అనుకున్నాను. కానీ హఠాత్తుగా వచ్చి మిమ్మల్ని చూడాలన్న కుతూహలంతో అలా చేయలేకపోయాను. సారీ చెప్పానుగా. అన్నట్లు నన్ను నేను పరిచయం చేసుకోలేదు కదూ! నా డ్రెస్ వుద్యోగాన్ని చెప్పేసింది. యింక చెప్పవల్సింది- నా పేరు హరీన్. మీ కోసం వెతుక్కుంటూ యెందుకు వచ్చానంటే యీ పూట మీరు మా ఇంటికి రావాలి మాతోపాటు భోజనం చేయాలి. రండి వెడదాం" అంటూ సోఫాలో కూర్చున్నాడు.

"క్షమించాలి. నాకు కొత్తవాళ్ళ యింట్లో భోజనంచేసే అలవాటు అంతగా లేదు. మీ ఆహ్వానానికి థాంక్స్" నేను కూర్చుంటూ అన్నాను హరీన్ చాలా హుషారుగా కన్పిస్తున్నాడు.

"సరే, యింక నిజం చెప్పకుంటే అరంగుళం కూడా కదిలేలాలేరు మీరు. సుష్మా మీకు తెల్సుకదూ! ఆమె నా భార్య. యిక్కడే వుంటూన్నాం రెండు సంవత్సరాలుగా. సుష్మ మీ గురించి చాలాసార్లు చెప్పింది. మీరంటే తనకి చాలా గౌరవం అభిమానం వగైరా వగైరా. నిజం చెప్పద్దూ. నాకు మీరంటే కాస్త జలసీవుండేది. కానీ మిమ్మల్ని చూసిన క్షణంలోనే అదంతా ఆవిరిలా యెగిరిపోయింది. కనుకనే మా యింటికి 'లంచ్'కి ఆహ్వానిస్తూన్నాను. యిప్పుడూ అభ్యంతరం చెప్తారా" నవ్వుతూ చూశాడు నావైపు. నా గుండె వేగంగా కొట్టుకుంది. 'సుష్మ' భర్తయితనా. యితను నన్ను చూడాలని వచ్చాడా! వచ్చినదికాక తమ ఇంటికి రమ్మని పిలుస్తూన్నాడా! అసలు యిదంతా కలకాదుకదా! యెప్పటి సుష్మ! ఆ అమ్మాయికి యింకా నేను గుర్తువున్నానా! నా గురించి భర్తకి అంతా చెప్పేసిందా! యేం చెప్పివుంటుంది! ఛీ ఆడవాళ్ళ నోట్లో నువ్వుగింజ దాగదన్నది యెంత యదార్థం. సుష్మ పరిచయం నా గుండెలో భద్రగావుంది. కానీ సుమతితో చెప్పానా!

నా ఆలోచనలు పసికట్టిన హరీన్ "రండి సుష్మని ఆశ్చర్యపర్చాలి. అసలు మీరీ వూరు వచ్చినది తనకి తెలియదు. వెడదామా" అంటూ లేచి "నేను క్రిందకి వెళ్ళి జీప్ దగ్గరవుంటాను త్వరగా రండి" అనేసి వెళ్ళిపోయాడు.

అమ్మయ్య అన్పించింది నాకు. అద్దంలో ముఖం చూసుకున్నాను. ఒక క్షణం అనుకోకుండా సుష్మని చూడటం అంటే ఆనందంగానేవుంది. కానీ ఆమె భర్త అసలే పోలీస్ ఆఫీసర్. యేమన్నా అనుకుంటే. అబ్బ నా కళ్ళలోకి యెలా చూశాడు. ఆలోచిస్తూనే బట్టలు మార్చుకున్నాను. బట్టలుకూడా మంచివి

అన్నీ మాసిపోయాయి. వాటిలోనే యేరి వైట్‌పాంటూ క్లాక్ వేసుకుని రూము లాక్‌చేసి క్రిందకి దిగివస్తూ సర్వర్‌కి కాఫీ ఆర్డర్‌చేసి క్రింది వరండాలోకి హరీన్‌ని పిల్చి 'కాఫీ తాగుదాం' అంటే అతను అభ్యంతరం చెప్పకుండా తాగి యింకవెడదాం అని జీప్‌లో యెక్కి డ్రైవింగ్ సీటులో కూర్చున్నాడు. నేనూ అతని ప్రక్కన కూర్చున్నాను. జీప్ హోటల్ కాంపౌండ్ దాటి వేగంగా పోతోంది. హరీన్‌ని చూడగానే హోటల్ మేనేజర్ వంగి సలాంచేయటం చూశాను. పోలీసువారికి పలుకుబడికి యేంలోటు.

జీప్ పోతోంది హరీన్ ముఖంలో యేదో చెప్పలేనంత సంతోషం కన్పిస్తోంది చాలా హందాగా కన్పిస్తున్నాడు. 'సుష్మాకి సరైన జోడీ యితను' అన్పించింది.

"హరికృష్ణగారూ! మిమ్మల్ని చూడగానే సుష్మా ఆశ్చర్యపోతుంది" అంటూండగానే యిల్లు వచ్చేసింది. జీప్ స్లో చేసి ఒక చిన్నడాబా యింటి ప్రహరీ గేటులోనించి లోపలికి తీసుకువెళ్ళి ఆపేశాడు. నౌకరు పరుగున వచ్చాడు. హరీన్ వెనుకనే నేనూ దిగాను. 'రండి' అంటూ పరుగులాంటి నడకతో వరండా దాటి హాల్లోకి వెడుతూనే "సుష్మా, ఓ సుష్మా... చూడూ త్వరగా రావాలి, క్విక్" అంటూ అరిచాడు.

"నేను రాను. యింత ఆలస్యం యెందుకు చేశావ్" లోపల గదిలోనించి కోపంగా విన్పించింది సుష్మ గొంతు.

"అరె నీ కోసం యెవరొచ్చారో చూడవోయ్."

"నీ వెప్పుడూ యిలాగే అబద్ధాలు చెప్తావ్"

"కాదు డియర్... ఒక క్షణం యిటు రా."

"రాను" దీర్ఘంతీసింది లోపలినించే నేను వారిద్దరి సంభాషణా వింటూ ఆ యింటిని చూస్తూన్నాను ఇల్లు చాలా అందంగావుంది. హరీన్ నవ్వుతూ

"చూశారా హరికృష్ణగారూ మాపోలీసులంటే బైటవాళ్ళకేగానీ భయంయింట్లో వాళ్ళకి ఆవగింజంత కూడా లేదు. అందులో యీ సుష్మా వుంది చూశారూ అబ్బ మహా పెంకెఘటం. చాలా అలసిపోతున్నాను సార్ మీ సుష్మాతో" అంటూ నవ్వుతూనే లోపలికివెళ్ళి అంతలోనే సుష్మాభుజం చుట్టూ చెయ్యివేసి నడిపించుకుని వస్తూ "చూడు వచ్చింది యెవరో" అంటూంటే సుష్మా నన్ను చూసి ఆశ్చర్యపోయి అంతలోనే తేరుకుంటూ "అరె హరికృష్ణగారా" అనేసి అతని చెయ్యి లాగిపారేసి పరుగున నా దగ్గరకి వచ్చేసి చెయ్యి అందుకుని

"రెలా వచ్చారు. అసలు మా శ్రీవారెలా తెల్సు నా వుత్తరాలకి జవాబులు రాయటం యెందుకు మానేశారు. అరె యీ రోజు యిప్పుడు యిక్కడ మిమ్మల్ని చూస్తానని అస్సలు అనుకోలేదు. బావున్నారా. యీ మధ్య మీ ఆరోగ్యం దెబ్బతిన్నదికదూ?" అంటూ హడావుడిగా అటు తిరిగి

"వీరయ్యా త్వరగా ఐస్‌వాటర్ పట్టుకురా. కాదు, కాఫీ...జల్దీ ఆవ్"

బిగ్గరగా అరిచి నా ప్రక్కనే సోఫాలో కూర్చున్న సుష్మా కళ్ళలో యేదో కాంతి కన్పిస్తూంటే ఆ అమ్మాయివైపే చూస్తూ జవాబు చెప్పటం మర్చి పోయాను. లైట్‌బ్లూ వుల్‌వాయిల్ చీరె, అదే కలర్ బుట్టచేతుల జాకెట్టు, జుట్టు అంతా పైకి మడిచి బ్లూ రిబ్బన్‌తో ముడివేసిన సుష్మా మెడలో ఒక్క వరుస చైన్ మాత్రం వుంది మరింకేం నగలూ లేకున్నా సుష్మా అందంగానే కన్పిస్తోంది. యిదివర కంటే కాస్త లావు అయినట్లుంది చేతులకి గాజులు లేకున్నా ముఖాన నయాపైసంత తిలకం యెర్రగా మెరుస్తోంది. ఆ అమ్మాయి ముఖంలోకి తదే కంగా చూస్తున్నాను. సుష్మా మాటలు మర్చి నా కళ్లలోకి చూస్తోంది. ఆమె కళ్లలో నీటిపొర కదలటం చూశాను నన్ను నేను సంబాళించుకుని

"సుష్మా బావున్నావుకదూ" అన్నాను. "మీ దయవల్ల చాలా బావున్నాను," అంది. గొంతు బొంగురుగా విన్పిస్తోంది. నాకు నవ్వు వస్తూన్నా ఆవుకున్నాను. సుష్మ "హరికృష్ణగారూ" అంటూ నా చేతిని వదలటంలేదు. నాకు ఆదోలా అన్పించింది. హరీన్ ఆ చుట్టుపట్ల లేడుగా అని చురుకుగా చూశాను. అయితే నా వెనుకవున్న గదిలోనించి యూనీఫారం మార్చేసి లుంగీ బనీనుతో భుజం మీద టర్కీటవల్ వేసుకుని మా దగ్గరకి రాబోతున్న వాడల్లా గది వాకిలిదగ్గరే ఆగటం కన్పించింది. సుష్మా మాత్రం యిదేం పట్టించుకోవటంలేదు

నేను కాస్త దూరంగా జరిగి కూర్చుని సుష్మా ప్రశ్నలకి జవాబులు యిస్తున్నాను. యింతలో నౌకరు అందమైన డిజైన్‌వున్న గాజుగ్లాసుల్లో మంచినీళ్ళు తెచ్చి అందిస్తూంటే అందుకుని

'చూడు వీరయ్యా' కాఫీ చెప్పాను కదూ. అది వద్దు. డైనింగ్ టేబిల్‌మీద మూడు ప్లేట్లు పెట్టి అన్నం రెడీ చెయ్యి నేను వస్తున్నాను, అనేసి అతను ఖాళీ గ్లాసులు తీసుకుని వెళ్లగానే "హరికృష్ణగారూ మా బ్రదర్ ఫారెన్ వెళ్ళి పోయాడు" అంటూ మళ్ళీ కబుర్లు మొదలెట్టింది. నేను మౌనంగా వింటూ న్నాను. యింతలో హరీన్ మా యెదురుగావున్న సోఫాలో వచ్చి కూర్చుని

"సుష్మా హరికృష్ణగారికి ఆకలేస్తోందని దారిలోనే చెప్పారు" అన్నాడు



టీపాయ్‌మీదవున్న మాగ్జయిన్ చేతిలోకి తీసుకుంటూ. సుష్మా చటుక్కున లేచి "మీకు ఆకలిగా వుందని చెప్పరాదూ!" అనేసి నవ్వి రండి చేతులు కడుక్కుందురుగాని. "వీరయ్యా, టవల్ తీసుకురా" అంటూ తనే బాత్‌రూము చూపి, ఆ తర్వాత డైనింగ్ టేబిల్ దగ్గరకి దారి చూపింది. అప్పటికే హరీన్ కుర్చీలో కూర్చుని వున్నాడు సుష్మా చకచకా మూడుప్లేట్లలోనూ వడ్డించి తనూ కూర్చున్నది. భోజనం చేస్తూనే హరీన్ తన వుద్యోగం గురించి కబుర్లు చెప్పి "సుష్మా హరికృష్ణగార్ని హటాత్తుగా నీ దగ్గరకి తీసుకువచ్చినందుకు థాంక్స్ అయినా చెప్పవేం," అన్నాడు.

"నిజమే. మర్చిపోయాను సుమా ఔనూ యీాయన యీ వూరు వచ్చినట్లు మీకు యెలా తెల్సింది" నాకు కూరలూ నెయ్యీ వద్దు అన్నా కొసిరి కొసిరి వడ్డిస్తూ భర్తని అడిగింది

నీకీ మధ్య బద్ధకం యెక్కువై డైలీ పేపరు చదవటం మానేశావు నిన్న వీరి డ్రామా జరిగింది. నేను చూడలేదు కానీ చాలా బాగుందని విన్నాను."

"అరెరె...యెంత మంచి అవకాశం పోయిందీ" సుష్మ చాలాసేపు బాధపడింది. హరీన్ భార్య మాటలు కట్ చేస్తూ మధ్య మధ్య తనూ మాట్లాడుతున్నాడు

"హరికృష్ణగారూ మీరు సినిమా యాక్టర్ కాకున్నా పేరు చాలానే సంపాదించు కున్నారు ఆరాధకులూ చాలామంది వున్నారు. యీ కాలంలో డ్రామాయాక్టర్ గా పేరు తెచ్చుకోవటం చాలా కష్టం చాలా డ్రామా కంపెనీలు వెలుస్తున్నా పదికాలాలపాటు నిల్చినవి చాలా తక్కువ మీ కంపెనీకి డబ్బు వుందో లేదో కానీ మంచి పేరు మాత్రం వుంది" అన్నాడు. నేను నవ్వి వూరుకున్నాను. భోజనం అవగానే నాకు ప్రత్యేకంగా ఒక గదిలో పక్క యేర్పాటు చేసింది సుష్మ.

"కాస్సేపు రెస్ట్ తీసుకోండి హరికృష్ణగారూ. యేయ్ సుష్మా నువ్వూ పద." అంటూ ఆ అమ్మాయి యింకా యేవేవో కబుర్లు చెపుతున్నా ఆమె చెయ్యిపట్టు కుని లాక్కువెళ్ళిపోయాడు హరీన్. అతని చెయ్యి వదిలించుకుని రెండుసార్లు వెనక్కి పరుగెత్తుకువచ్చి

"హరికృష్ణగారూ, మీకు రెస్టు అర్థగంట మాత్రమే తర్వాత 'టీ' తాగేసి కబుర్లు చెప్పాలి అన్నట్లు మీకేం కావాలన్నా వీరయ్యని పిలవండి. అరె. పాన్ యిదిగో అనేసి యిచ్చి తనకోసం నిల్చున్న భర్త దగ్గరకి వెళ్ళి గదికర్టెన్ సరిగావేసి ఫాన్ స్విచ్ వేసి వస్తానూ అంటూ అతని చెయ్యిపట్టుకుని వెళ్ళి పోయింది.

మంచంమీద వాలాను కానీ ఆలోచనలు అలా యెక్కడెక్కడికో పోతూన్నాయి. సుష్మా, హరీన్ దాంపత్య జీవితం యెంత బావుంది. అసలు యీ యిల్లు స్వర్గంలా వుంది. ఒకరంటే ఒకరు ప్రాణంలా వున్నారు. నాకు నిద్రరావటంలేదు యీ రాత్రికే వెళ్ళిపోవాలి. సుమతి నా కోసం యెదురు చూస్తూవుంటుంది. 'సుష్మా' నన్ను పెళ్ళిచేసుకుంటే యింత ఆనందంగా వుండ గలిగేదా! వుండలేదు నాకు 'పేరు' వుండచ్చు. కానీ డబ్బులేదు. సుష్మకి దూరంగావుండి సుమతిని పెళ్లాడటం తెలివి తక్కువపని అని యివాళ యిక్కడ మరీ మరీ అన్పిస్తోంది నా ఆలోచనకి నాకే నవ్వు వచ్చింది మన జీవితం మన చేతిలోనే వుందా· వుంటే యెప్పుడూ సరైన నిర్ణయాలు యెందుకు తీసుకో లేకపోతాం!

యీలాంటి ఆలోచనల్లో నాకు అలక్ష్యంగా నిద్రపట్టేసింది. కానీ అర్థగంట అయిపోయింది. మాష్టారూ అంటూ టీ కప్పుతో వచ్చేసింది సుష్మ. కళ్ళు నులుపుకుంటూ లేచి కూర్చుని హరీన్ యేరీ" అన్నాను

"ఆయనకి యేదో అర్జెంట్ కేస్ తగిలిందని వెళ్ళిపోయారు వెధవ ఫోను

అరక్షణం కూడా ఆగకుండా మోగింది. హరికృష్ణగారూ యే ఆడపిల్లా పోలీసు ఆఫీసర్‌ని పెళ్ళాడకూడదు. అందే సుఖం వుండదు. ఛీ ఛీ నేను ఒక్కదాన్నీ వంటరిగా బోర్ కొట్టి చస్తూంటాను" అంది కప్పు అందించి తనూ మరో కప్పు తీసుకుని 'టీ' తాగుతూ.

'నేను మౌనంగా టీ తాగుతున్నాను. సుష్మ మళ్ళీ కబుర్లు మొదలు పెట్టింది

"మీకి రోజు సన్మానంవుందిటకదూ. ఆత్రైముకితప్పకవస్తానని చెప్పమన్నారు. నేను మాత్రం తప్పక వస్తాను. హరికృష్ణగారూ మీరు కనీసం పదిరోజులైనా మా యింట్లో వుండాలి. మా హరీన్ కూడా అలా చెప్పమని చెప్పారు. యేం వుంటారు కదూ : మీకు చాలా కబుర్లు చెప్పాలి.

నేను నవ్వేసి "ఆ చెప్పేవన్నీ యిప్పుడు చెప్పు" అన్నాను.

"అందే" అంది కోపంగా.

"యీ రాత్రికే వెళ్ళిపోవాలి అర్జెంట్ పనివుంది. ఓ పది అబద్ధాలు చెప్తేగానీ వదలలేదు సుష్మ. యేవేవో చెప్పింది. యింక హోటల్‌కి వెళ్ళి అక్కడనుంచి మీటింగ్‌కి వస్తాను అని చెప్పి ఆమె 'అప్పుడే వెళ్ళిపోతారా' అంటున్నా వీల్లేదు వెళ్ళాలి. అని రూముకి వచ్చేసరికే నాకోసం సన్మానసంఘం సెక్రటరీ వెయిట్ చేస్తున్నాడు బట్టలు మార్చుకుని వాళ్ళతో వెళ్ళిపోయాను. సన్మానం అందే నాకు విసుగు. అయినా ఒక్కోప్పుడు వాటిని ఒప్పుకోక తప్పదు. మీటింగ్ జరుగుతూండగా హరీన్, సుష్మా వచ్చారు. చూశాను. అంతా అయి పోయిన తర్వాత స్టేజీ దిగి క్రిందికి వస్తూందే సుష్మా నా దగ్గరకి వచ్చేసింది నాకు వేసిన దండ సుష్మాకి యిచ్చేశాను. నీవు యీ వూరులో కన్పిస్తావని అనుకోలేదు సుష్మా. అసలు నీకు యేం యివ్వాలో యెంత ఆలోచించినా అర్థంకాలేదు. నేను నీకు యేమీ యివ్వలేను కూడా" అంటూందే సుష్మా కళ్ళలో నీళ్ళు తిరిగాయి

"మీరు నాకేం యివ్వక్కరలేదు. కానీ యెప్పుడైనా యిలా వస్తే మాత్రం నన్ను చూసి వెళ్ళండి చాలు," అంది కళ్ళు తుడుచుకుంటూ. యీ మాటలు అంటూన్నప్పుడు ఆ అమ్మాయి గొంతు అదోమాదిరిగా ధ్వనించింది. నే అందించిన దండని అపురూపంగా యెడంచేతిమీద వేసుకుని ఆ దండలో కట్టిన చెంకీని చేత్తో తుంచాలని ప్రయత్నిస్తోంది. యింతలో హరీన్ కొందరిని తప్పించుకుంటూ మా దగ్గరకి వచ్చి చెయి అందించి "సారీ ఆలస్యంగా వచ్చాను. మా వుద్యోగాలే యింత" అంటూ సుష్మ చేతిలోని దండచూస్తూ "యిక్కడ

సన్మానం హరికృష్ణగార్కి కాదా! నీకేంటి" అని నవ్వాడు. ఆ నవ్వు నిష్కల్మషంగావుంది. అసలు హరీన్ యూనిఫారంలోనే మరీ అందంగా హుందాగా కన్పిస్తాడన్పించింది నాకు

వారిద్దరిదగ్గరా శలవు తీసుకుని రైలు యెక్కేసాను. కన్పించేంతవరకూ సుష్మ, హరీన్ చెయ్యి వూపుతూనేవున్నారు. సుష్మతో పరిచయం నా జీవితంలో మరువలేని మధురస్మృతి. వీటికి జీవితంలో అపురూపమైన స్థానం వుండిపోతుంది. బహుశా ప్రతి మనిషికీ యీలాంటివి ఒకటీ రెండూ వుండి తీరతాయా! యేమో! సుష్మనుంచి మనస్సు మళ్ళించుకోవటానికి చాలా ప్రయత్నం చెయ్యవల్సివచ్చింది.

నేను అనుకున్నట్టుగానే సుమతి నాకోసం యెదురుచూస్తోంది.

అంతక్రితం అన్నయ్య దగ్గరనుంచి వచ్చిన వుత్తరం అందించింది సుమతి.

అన్నయ్య వుత్తరంలో సుమిత్ర పెళ్ళి యెలా చేయటం అన్న విషయం గురించే రాశాడు. మిగతా పిల్లలూ సరిగా చదవటంలేదు. వీళ్ళందరినీ యెలా దారిలో పెట్టాలో తెలియటంలేదు. అని రాశాడు నా మనస్సులో అప్పటికప్పుడే అన్నయ్య దగ్గరికి రెక్కలు కట్టుకుని వాలాలి అనిపిస్తోంది. కానీ సుమిత్రా కళ్యాణం హుండీ యింకా నిండలేదు. కనీసం మూడువేలైనా చేసి అది తీసుకుని అన్నయ్య దగ్గరకి వెడతాను వదినతో "యిదిగో నీ చెల్లాయి సుమతి" అని పరిచయంచేస్తాను. సుమిత్ర పెళ్ళి యెలాగో అలా జరిగితే కొన్నాళ్ళైనా అన్నయ్యకి మనశ్శాంతి కల్గుతుంది.

అనుకుని యివాళే అన్నయ్యకి వుత్తరం రాశాను అధైర్యపడవద్దు అని.

సుమిత్ర డైరీ చదవడం ఆపి అబ్బ చిన్నాన్న యెంతమంచివాడు! అసలెంత మంచి మనస్సు ఆయనది అనుకుంటూ డైరీపేజీలు తిప్పింది. హరికృష్ణ ఆ తర్వాత మళ్ళీ యేమీ రాయలేనట్టుంది. అయితే ఆఖరున మరో రెండు పేజీలు మాత్రం రాసినట్లు కన్పించి చదవటం మొదలుపెట్టింది సుమిత్ర.

అసలే ఆరోగ్యం బాగులేదు డ్రామా కంపెనీ పరిస్థితులూ బాగాలేవు. యిలాంటి పరిస్థితుల్లో రమణి దగ్గరనుంచి వుత్తరంవచ్చింది.

తను అమెరికా వెళ్ళిపోతున్నాననీ అక్కడే స్థిరపడిపోవాలని వుందనీ రాస్తూ యీ భారతదేశంలో స్త్రీకి స్వేచ్ఛ లేదు, సుఖం లేదు వెధవ సెంటిమెంట్లు. పాత చింతకాయ పచ్చడి భావాలూ, యివన్నీఅంటే నాకు రోత! అందుకే వెళ్ళిపోతున్నాను నీకు వీలుంటే ఒకసారి ఆఖరుసారి వచ్చివెళ్ళు. నువ్వ

రాకున్నా నేనేం బాధపడనని గుర్తువుంచుకో. సుమతి వదినకి నమస్కారాలు చెప్పు అని రాసింది. యింతే.

రమణి యిదివరకు ఇల్లూ వాకిలీ అన్నా వదినలని వదిలింది. యిప్పుడు దేశాన్ని వదిలేస్తోంది. ఆశ్చర్యపడవల్సిందిలేదు. దాని జీవితం దానిదే దాని సుఖం దానిదే!

నాకు రమణిని చూడాలనివుంది ఒక్కసారి. కానీ అనారోగ్యం నన్ను వదల లేదు. ప్రయాణం చేయలేక క్లుప్తంగా చెల్లాయికి వుత్తరం రాశాను. భగవంతుడు నిన్ను కాపాడుతూ వుండాలనే నా ఆకాంక్ష అని.

తర్వాత రమణి అమెరికానుంచి ఒకే ఒక వుత్తరంరాసింది. అదే ఆఖరు వుత్తరం చెల్లాయి దగ్గరనుంచి. మొట్టమొదట రమణి వెంటవెళ్ళిన రామం ఒక సారి కన్పించి యేదేదో వాగి తన అక్కను అంతా కక్కేశాడు. రమణి తన జీవితం నాశనం చేసింది అంటూ అర్ధగంట వాపోయాడు. అతని మాటలు విన గల శక్తిగానీ అసక్తిగానీ లేని నేను మౌనంగా లేచి వచ్చేశాను.

రమణి యింక వుత్తరాలు రాయదని తెల్సు. అయినా ఆ చెల్లాయికోసం మనస్సు అప్పుడప్పుడూ బాధపడుతూనేవుంటుంది రమణి చెప్పినట్లు యెవరి జీవితం వారిదే కాబోలు ఆ జీవితాల్లోని మంచిచెడ్డలకి వారే బాధ్యులు కాబోలు. యింక ఆలోచించే ఓపికలేదు సుమతి శాంతమూర్తిలా ఇల్లు దిద్దుకుంటూ నన్ను కంటికి రెప్పలా కాపాడుకుంటూ నా అనారోగ్యాన్ని గురించి భయపడుతూ పైకి నాకు ధైర్యం చెప్తోంది. నన్ను జీవితపు ఆఖరి ఘడియల్లో నిలదీసి ప్రశ్ని స్తున్నది ఒక్కటే.

సుమతికి అన్యాయం చేయలేదు కదూ! నేను చేయను. కానీ భగవంతుడే చేస్తే!

యింతే యింక మరేంలేదు డైరీ చదవటం పూర్తిఅయిపోయిన సుమిత్ర కళ్ళ నుంచి రెండు కన్నీటి బిందువులు జారి క్రిందపడినాయి. బహుశా చిన్నాన్న ఆ తర్వాత యెక్కువకాలం బ్రతకలేదు. అంతే అయివుంటుంది. అనుకుంటూ డైరీ పెట్టిలో దాచి పక్కమీద వాలిపోయింది. ఆ డైరీలోని విషయాలే గుర్తుకి వస్తూన్నాయి. సుమిత్రకి నిద్రమాత్రం రావటంలేదు.

## 13

కమలని తల్లిదండ్రులు వచ్చి తీసుకుపోతాం అని గొడవచేశారు. సుమిత్ర వాళ్ళతో "యేదన్నా సంబంధం వెతికి ఖాయంచేయండి. తర్వాత యీ వుద్యోగం వదిలి వచ్చేస్తుంది" అని నచ్చచెప్పి పంపేసింది. నాలుగు ఆయిదు సంబంధాలు

చూశారు. అందులో ఒక అబ్బాయికి కమల నచ్చింది. కమలకీ అతను నచ్చాడు. అంతే. పదివేలు కట్నం యిచ్చి పెళ్ళి ఖాయం అనుకుని పదిహేను రోజుల్లో లగ్నం పెట్టేసుకున్నారు. కమల యింటికివెళ్ళే రోజులు దగ్గరౌతూన్న ప్పటినించీ సుమిత్రలో దిగులు ప్రారంభమైంది. వంటరిగా వుండాలంటే మరీ దిగులు వేస్తోంది

కమలా, సుమిత్రా కల్సి సినీమాకి బయలుదేరారు రూముకి తాళం వెయ్య బోతూంటే కమల పాత ఫ్రెండ్ 'మేరీ' రిక్షా దిగి లోపలికి రావటంతో స్నేహితు రాళ్ళిద్దరూ మళ్ళీ తాళం తీసి లోపలికి వచ్చి మేరీని ఆహ్వానిస్తూ "సుమిత్రా ఈ అమ్మాయి మేరీ" అంటూ సుమిత్రని మేరీకి పరిచయంచేసింది. మేరీ కాస్సేపు కబుర్లుచెప్పి హాండ్‌బాగ్ తెరిచి వెడ్డింగ్‌కార్డ్ యిచ్చి మేరేజ్ ఈ వూళ్ళోనే కనుక తప్పక రమ్మని చెప్పింది. కమల కార్డు చదివి "అరె! మేరీ నువ్వు రాజేంద్రని చేసుకుంటావని అనుకున్నాం" అంది

మేరీ ముఖం కందిపోయింది కోపంతో. కొన్నాళ్ళు ఒకేచోట పనిచేశాం. కొన్నాళ్ళు స్నేహితంగా వున్నాం. నేనే పెళ్ళిచేసుకుందాం అని అడిగాను. అందుకు అతను పెద్ద అబద్ధం ఆడేశాడు. తనకి పెళ్ళి అయిపోయిందనీ ఒక పాప అనీ తను వుండే యింటి అడ్రెస్‌కి వచ్చి కనుక్కోమనీ చెప్పాడు. ఒకటి రెండుసార్లు గ్లాసోకి మిల్కి తీసుకువెడుతూంటే చూశాను. నిజమే కాబోలు. పెళ్ళి జరిగిపోయింది కాబోలు. నేను పొరబడ్డాను అనుకుని అతని విషయం వదిలేశాను ఆ తర్వాత ఆ ఉద్యోగమూ వదిలేశాను. యిప్పుడు చిన్నపిల్లలకి స్కూల్ నడుపుతున్నాను. తర్వాత యితని పరిచయం అయి పెళ్ళివరకూ వచ్చింది" అంది మేరీ కర్చిఫ్‌తో ముఖం వత్తుకుంటూ.

సుమిత్రకి యీ సంభాషణ విసుగ్గా వుంది. కమల మేరీని అంతలో వదిలేలా లేదు. మళ్ళీ సంభాషణ పొడిగిస్తూ అయితే "రాజేంద్రగారికి ఒక అమ్మాయి కూడా అన్నమాట," అంది ఆశ్చర్యం నటిస్తూ.

"కాదు. అతను చెప్పిందంతా పచ్చి అబద్ధం అని ఆ తర్వాత తెల్సింది. అతను ఓ ఫ్రెండ్ యింట్లో పేయింగ్ గెస్ట్‌గా వుంటున్నాడుట. పెళ్ళి సంబం ధాలు వచ్చినా అమ్మాయిలు 'లౌ' చేసి వెంటపడినా వాళ్ళని వదిలించుకోవ టానికిదో యెత్తు వేస్తాడు అంతే. అతనికి అస్సలు పెళ్ళికాలేదు.

"అఁ!" నోరు తెరిచేసింది కమల సుమిత్ర గుండె వేగంగా కొట్టుకుంటోంది.

"మరి నువ్వు అతన్నా అబద్ధం యెందుకు చెప్పావు అని అడగలేదూ!"

"అడిగాను. నాలుగూ కడిగాను. నువ్వుతప్ప యీ ప్రపంచంలో మగాడే లేడా? యిదిగో నా పెళ్ళి సెటిల్ అయింది రావయ్యా" అని చెప్పి మరీవచ్చాను. అంటూ యింక టైము అయిపోయిందని లేచివెళ్ళిపోతూ మరోసారి చెప్పింది పెళ్ళికి తప్పక రమ్మని. అలాగే అన్న తర్వాత వెళ్ళిపోయింది. కమల హుషారుగా వచ్చి సుమిత్రని అమాంతం వాటేసుకుని గిరగిరా తిప్పేస్తూంటే సుమిత్ర "అబ్బ వదులు. కళ్లు తిరుగుతూన్నాయి'' అని గోలపెట్టిన తర్వాత గానీ వదల్లేదు. సుమిత్ర కోపంగా చూస్తూ "యెందుకు యింత సంతోషం" అంది

యెందుకో యిప్పుడు చెప్పను. పద గ్రాండుగా పార్టీ యిద్దువుగాని నీచేత యివాళ చాలా వదిలించేస్తాను. అబ్బ మేరీ యెంత మంచివార్త చెప్పివెళ్ళింది. కమల రూము తాళంవేసి సుమిత్ర చెయ్యిపట్టుకుని బరబరా లాక్కువెళ్లి యివాళ చస్తే బస్‌లో రాను ఆటో పిలువు" అంది రోడ్డుమీద నిల్చిపోయి.

"ఖర్మ" అని పోతూన్న ఆటో పిల్చి యెక్కు అని తనూ కమల ప్రక్కన కూలబడింది సుమిత్ర. కమల సుమిత్ర కళ్ళలో కళ్ళుపెట్టి చూస్తూ

"ఒక్కసారి నవ్వు. నవ్వు..." అంది.

'ఫూ' సుమిత్ర ముఖం తిప్పుకోబోయినా కమల వదల్లేదు.

"త్వరలోనే సుమిత్రా రాజేంద్రల పెళ్ళి జరిగితీరుతుంది. ఆ పెళ్ళికి నేను పెత్తనం చేసితీరతాను."

"కట్టు యింకా గాలిమేడలు కట్టు." సుమిత్ర కోపంగా అంది.

"నావి గాలిమేడలు కావు యీ పెళ్ళి రాయబారం నేనే చేస్తాను. యిది యెలా కాదో చూస్తాను," అంది హోటల్ ముందు ఆగిన ఆటోలోనించి క్రిందికి దిగి సుమిత్ర కమల చెయ్యి పట్టుకుని వెనక్కి లాగుతూ "యిదిగో నా దగ్గర పదిరూపాయలేవున్నాయి నీ యిష్టం, సినిమాయే చూస్తావో షికార్లకే ఖర్చుచేస్తావో" అంటూన్నా కమల వినిపించుకో కుండా సుమిత్రని రమ్మంటూ ముందుకు వెడుతూనేవుంది

"హోటల్ బిల్లూ సినిమా బిల్లూ ఖర్చూ కలిసి పాతిక అయింది, నాకే పది హేను బాకీపడ్డావు సుమిత్రా. ఫర్లేదు వస్తుకిచ్చెయ్." అంది యింటికి వస్తూ.

ఇల్లు చేరేసరికి ఆ యిద్దరి గుండెలూ ఆగిపోయినట్లు అయింది పంగనామాల పద్మనాభంగారి యిల్లు తాళంవేసి యెక్కడికో పోయారుట. యెవరో వచ్చి మారు తాళంచేతితో తలుపుతీసి శుభ్రంగా దోచుకుపోయారుట. పద్మనాభం

భార్య లబో మంటూ యేడుస్తోంది. ఆ యేడుపుకి జనం పోగయి తలోమాటా అంటూ తర్కవితర్కాలు చేస్తున్నారు.

"యెన్ని గుండెలు వాడికి. యింతమంది కాపరాలవాళ్ల కళ్ళలో దుమ్ముకొట్టి దొరబాబులా పట్టుకెళ్ళిపోయాడే" అన్నది పెద్ద ఆశ్చర్యంగా వుంది. అందరికీ అసలు విషయం తెల్సుకుని మరీ కంగారుపడిన కమలా సుమిత్రల తమ వాటా తాళం తెరిచి అన్నీ వోసారి చూసుకుని "అమ్మయ్య అదృష్టవంతులం" అనుకున్నారు. యిద్దరికీ అన్నం సహించలేదు నిద్రరావటంలేదు. పక్కమీద పడుకోగానే గుర్రుకొట్టే కమల కూడా ఆలోచనల్లో మునిగిపోయింది యింక సుమిత్రకి రాజేంద్ర ఆలోచనలే. అసలు అతని వివరాలు తెల్సుకోలేదు. అతను చాలా మంచివాడు అన్పిస్తోంది యెందువల్లనో తెలియదు. అతను నన్ను పెళ్ళి చేసుకోవటానికి అంగీకరిస్తాడా? యేమో?

సుమిత్రకి కళ్ళు మండుతున్నాయి కానీ నిద్రరావటంలేదు. మనస్సుని యెంత మందలిస్తున్నా అది కళ్లెం వదిలిన గుర్రంలా పరుగులుతీస్తోంది యెక్కడెక్కడికో. ఛీ ఛీ దీనికి బుద్ధిలేదు అనుకుని కళ్ళు గట్టిగా మూసుకుని పడుకున్న సుమిత్రకి పద్మనాభం భార్య సోకాలు విన్పిస్తూనే వున్నాయి. "పాపం వాళ్ల కాపురం ఎప్పటికి కుదుటపడును. అతి సామాన్యులు. యే వెధవ వచ్చి పట్టుకుపోయాడో. పోలీస్ రిపోర్టిచ్చారు. కానీ పోయినవి దొరుకుతాయా? అసంభవం, అని అందరికి తెలుసు.

## 14

సుమిత్రకి తల్లిదగ్గరనుంచి వుత్తరం వచ్చింది. లక్ష్మిని చేసుకునేందుకు వాళ్ళు యిష్టపడ్డారనీ, యిల్లు బేరం కుదిరింది, కానీ నీ పెళ్ళి కూడా వరుడిని వెతికి ఖాయంచేసుకుని అడ్వాన్సు తీసుకుంటాను. లేకుంటే డబ్బు ఖర్చుఅయి పోతుంది. అని రాసింది. రెండు సంబంధాలున్నాయి. కనుక సెలవుపెట్టి వచ్చెయ్యి. యిందులో ఒకటి ఖాయం అయేలావుంది. సూర్యనారాయణ మాష్టారు తాలూకు చుట్టాలట. కనుక తప్పక రమ్మని మరీ మరీ రాసింది పార్వతమ్మ.

సుమిత్రకి యేం రాయాలో తెలియలేదు. కమలా తనూ తీవ్రంగా ఆలోచించి "ప్రస్తుతానికి లక్ష్మి పెళ్ళి ఒక్కటీ కానిచ్చేయమని రాసేసింది. యీ వుత్తరానికి పార్వతమ్మ దగ్గరనుంచి తిరుగుటపాలో వచ్చేసింది వుత్తరం

నీకెంత తెలివిలేదే సుమిత్రా. పెద్దపిల్లవి నువ్వు. నీకు కాకుండా లక్ష్మికి




పెళ్లిచేస్తే యింక నీకు యీ జన్మకి పెళ్ళిచేయగలమా మేము. అలా వీల్లేదు యెన్ని విషయాలని వుత్తరాల్లో రాయను వెంటనే వచ్చేయి. నేనిక్కడ నీ కోసం యెదురుచూస్తూన్నాను అన్నట్లు మీ నాన్నగారు యిప్పుడే వచ్చారు. పూర్తిగా ఆరోగ్యం చెడిపోయింది. కళ్ళలో ప్రాణాలున్నాయి యేదియేమైనా నాన్నగారు యిల్లువేరారు. నాకు యే పని చేయాలన్నా యింక ఫర్లేదు. ఏనుగంత బలం వచ్చింది. భగవంతుడు దయదలిస్తే యిద్దరి ఆడపిల్లల పెళ్ళిళ్ళు సవ్యంగా జరిగిపోతాయనే అనుకుంటున్నాను," అంటూ రాసిన వుత్తరం చదివేసరికి సుమిత్ర ప్రాణం కొంత కుదుటపడింది. నాన్న యింటికి వచ్చేశారు ఫర్లేదు. కానీ పెళ్ళిసంబంధాలు అంటూ అమ్మ ప్రాణాలు తీస్తోంది. అని విసుక్కుంటూ ఆఫీసు వదిలిన తర్వాత కాఫీ అయినా తాగాలి అనుకుంటూ హోటల్‌వైపుగా నడుస్తోంది. యింతలో వెనకనుంచి

"హల్లో సుమిత్రాదేవిగారూ" అన్న రాజేంద్ర గొంతు విని వెనక్కి తిరిగి చూసింది.

"బహుకాల దర్శనం!" అంది అతన్ని పరీక్షగా చూస్తూ

యీ మధ్య పడకవేశానండీ జ్వరంతో. వారం క్రితమే డ్యూటీలో జాయిన్ అయాను. అప్పటినించీ మీ కోసం ప్రతిరోజూ వెతుకుతూనే వున్నాను. కానీ యివాళ కన్పించారు, అంటూ నవ్వాడు. బాగా బక్క చిక్కి వున్న రాజేంద్ర ముఖంలోకి మళ్ళీ చూస్తూ ''అరె నాకు తెలియదు," అంది నొచ్చుకుంటూ

"మీకెలా తెలుస్తుందిలెండి, కానీ కాఫీ తాగుతూ కబుర్లు చెప్పుకుందాం." అంటూ హోటల్‌లోకి దారితీసి ఫామిలీ రూములోకి వచ్చికూర్చుంటూ "యివాళ మీకు చిన్న పార్టీ యిస్తాను. చెప్పండి, యేం కావాలి. స్వీటు, హాట్"

''పార్టీనా! యేమిటి విశేషం" కుతూహలంగా చూస్తూ అడిగింది.

"నేను ఋణవిముక్తుడిని అయాను. అంటే చేసిన ఆరువేల అప్పు తీర్చేశాను అమ్మయ్య. అన్పిస్తోంది నాకు. యీ సంతోష సమయంలో మీతో భాగం పంచుకోవాలన్పించింది. మరేం అనుకోరుకదూ", అంటూ "చెప్పండి యేం కావాలి, అని సుమిత్ర యెంతకీ చెప్పకపోయేసరికి తనే కొన్ని ఆర్డర్ చేసి సర్వర్ పెట్టి వెళ్ళిన మంచినీళ్ల గ్లాసు ఒకటి సుమిత్రదగ్గరికి జరిపి తనో గ్లాసు తీసుకని కాసిని నీళ్ళు తాగి,

"చెప్పండి యేంటి కబుర్లు చాలారోజులైందికదూ కల్సుకుని" అన్నాడు అతనిలో యింత హుషారు యిదివరకు యెప్పుడూ చూడలేదు సుమిత్ర.

"ఋణవిముక్తులు అయారుసరే యింక ముందు కార్యక్రమం యేమిటి?" అంది.

"యేముంటుంది. పెళ్ళి. యిల్లూవాకిలీ, పిల్లాపీచూ-వగైరా అంతేగా"

"ఆ ప్రయత్నంలోనే వున్నారా?"

"మనం వున్నా లేకున్నా యీ పెద్దవాళ్ళు వున్నారు చూశారూ, వాళ్ళు వూరుకోరుగా!" అవునూ మరి మీకు యిలాంటివి...యింకా..." యింక యెలా అడగాలో తెలియనట్లు ఆగి సుమిత్ర జవాబుకోసం చూస్తున్నాడు.

"............"

"చెప్పండి... మీకూ ప్రారంభమైందా యీ వత్తిడి?"

"ఔను" అన్నట్లు తలవూపింది సుమిత్ర

"అంటే యిప్పటికే యేదైనా సెటిల్ అయిందా! లేక అవటానికి సిద్ధంగా వుందా?"

యిలా అడుగుతూన్నప్పుడు అతని గొంతులో విన్పించే ఆతురత పసికట్టేసింది సుమిత్ర

''మీకు?"

"అబ్బ మొత్తానికి తెలివితేటలకీ, సమయస్ఫూర్తికీ స్త్రీలదే పైచేయి అని ఒప్పుకోక తప్పదు. కదూ''

"ఇదంతా నా ప్రశ్నకి జవాబుకాదు.''

''ఓః సూటిగా వ్యవహరిస్తున్నారా! అయితే అబద్ధం చెప్పమంటారా" అని నవ్వేస్తూంటే సుమిత్రకి కోపం వస్తోంది కానీ మింగేస్తోంది.

"పెద్దవారికి అంగీకారమైన ఓ అమ్మాయిని చూడటానికి రమ్మని వుత్తరాల మీద ఉత్తరాలు వస్తున్నాయి.''

"నాకూ యింతే" అనబోయి ఆపేసి "అయితే సెటిల్ అయినట్లే అన్న మాట."

"మీ వుద్దేశం చెప్పండి. మనం యెన్నిక చేసుకున్నవారిని చేసుకోవటం మంచిదా! లేక... పెద్దలు చూసిన అమ్మాయిని ఆమోదించటం మంచిదా"

"నాకేం తెలుస్తుంది!"

'మీ విషయంలో యేంచేస్తారు! యేం చేయాలనుకుంటున్నారు!"

"నాకు, నచ్చిన నేను మెచ్చినవారే నాకు కావాలి."

"నిజంగా."

''యస్" వత్తిపలికింది సుమిత్ర

''సరిగ్గా నావీ యివే కావాలు ఐలే ఆశ్చర్యంగా వుందే..." టిఫెన్ తెచ్చి పెట్టాడు. సర్వర్ యిద్దరూ తింటూనే తిరిగి మాటల్లోపడ్డారు అయితే సుమిత్ర యేదో అడగాలనీ అడగక వూరుకుంటోందని రాజేంద్ర గుర్తించేశాడు. రాజేంద్రకూడా తనని యేదో అడగాలి. యెలా అడగాలా అని ఆలోచిస్తూన్నాడని సుమిత్రా అర్థంచేసుకుంది. అయితే యిద్దరికీ ఒకరి మనస్సులో యేముందో మరొకరికి తెలియటంలేదు. అది నోరు తెరిచి అడగకుండానే తెల్సుకోవాలని ప్రయత్నిస్తూన్నారు.

టిఫెను పూర్తికాగానే రాజేంద్ర

"సుమిత్రాదేవిగారూ ఐస్‌క్రీంకి ఆర్డర్ చేస్తున్నాను మీరు తింటారుకదూ?"

"అహ వద్దు," వుండండి..." అని చెప్పి ఐస్‌క్రీం నేను మీకిప్పిస్తాను," అంది.

"విశేషం అడగవచ్చునా" అన్నాడు, కాస్త ముందుకు వంగి.

"మా నాన్నగారు యిల్లువదిలి మూడు నెలలుగా యెక్కడికో వెళ్ళి తిరిగి యింటికి చేరుకున్నారని యీ రోజే మా అమ్మ వుత్తరంరాశారు. నాకివాళ చాలా శాంతి లభించినట్లుంది. అసలు నేనే మీకోసం వెతికాను, పార్టీ యిద్దామని."

"నిజంగా."

"అవును."

"అన్నట్లు, మీ నాన్నగారు యెందుకు యిల్లు వదిలివెళ్ళారు. నాకెప్పుడూ మీ వివరాలు చెప్పలేదు. పోనీ యిదీ చెప్పలేదేం."

"చెప్పినా ప్రయోజనం యేమిటని."

"అంటే మీరంటే నాకున్న ఆత్మీయతాదృష్టి మీకు నా యందు 'లేదు' అనుకోవచ్చునా.''

"అదేంకాదు."

"పోనివ్వండి కానీ".... అంటూ రాజేంద్ర సుమిత్ర కుటుంబ వివరాలన్నీ అడిగి తెల్సుకుని ఆఖరున "అబ్బా మీ మీద యింత బరువు బాధ్యతలున్నాయా!" అన్నాడు.

"యిందులో ఆశ్చర్యపడవల్సింది ఆవగింజంతకూడా లేదండీ. యీనాడు మధ్యతరగతి సంసారాల్లో కొద్దో గొప్పో చదువుకుని వుద్యోగంచేసే అబ్బాయికికానీ అమ్మాయికిగానీ యెంతో కొంత బరువు బాధ్యతలు వుండితీరతాయి" అంది నిర్లిప్తంగా నవ్వుతూ. రాజేంద్ర నిట్టూర్చాడు. సుమిత్ర ముఖంలోకి తదేకంగా చూస్తూ ''చూడండి మన దేశ ఆర్థిక దుస్థితివల్ల సమాజంలో యెన్నో అవకతవక పరిస్థితులు యెదురవుతూన్నాయి అన్నింట్లోకీ ముఖ్యంగా ఆడపిల్లల పెళ్ళి మధ్యతరగతి మనిషిని మరీ కృంగదీసే సమస్య అయికూర్చుంది. సుమిత్రగారూ మిమ్మల్ని ఒక విషయం యెన్నాళ్ళగానో అడగాలనుకుంటున్నాను." అంటూ తన కుటుంబపరిస్థితి చెప్పి. "నా వుద్యోగం యెలాంటిదో మీకు తెల్సుకనుక చెప్పనిలేదు. మీ తల్లిదండ్రుల స్థితి సానుకూలం పడేవరకూ మీరు వుద్యోగం చేసినా ఆ జీతం వారికే ఖర్చుచేసినా నాకు అభ్యంతరంలేదు. నేనంటే మీకు...ఆమోదం అయితే... నేను మిమ్మల్ని పెళ్ళిచేసుకోవటానికి సిద్ధంగావున్నాను. మీరు ఆలోచించుకుని మరీ చెప్పండి జవాబు'' అంటూంటే సుమిత్ర మనస్సు రెక్కలు వచ్చినట్లు యెక్కడికో యెగిరిపోతోంది. జవాబు చెప్పటం, చేతకావటంలేదు.

రాజేంద్ర రెండు నిమిషాలు ఆగాడు. కానీ సుమిత్ర నోటినుంచి ఒక్క అక్షరం బైటకిరాలేదు. మరెవరో ఆ రూములోకి రావటంతో 'పదండి పోదాం' అని లేచాడు. సుమిత్రకి అడుగులు తడబడిపోతున్నాయి. యెలాగో వచ్చింది బైటకి.

యెదురుగా ఆటో చూసి దానిలో కూలబడింది రాజేంద్ర సుమిత్రనే చూస్తూ "ఇంటికి వెళ్ళిపోతూన్నారా" అన్నాడు. సుమిత్ర యెలాగో గొంతుపెగుల్చ

కుని "నేను... నేను అర్జెంట్‌గా వూరికి వెళ్ళాలి... అక్కడనుంచి రాగానే... కలుసుకుంటాను... కాదు... వుత్తరంరాస్తాను... కాదు... మీరే... నా రూముకిరండి... వద్దు... మీకు ఫోన్ చేస్తాను..." అంది తడబడుతూ.

ఆటో కదిలి ముందుకి వెళ్ళబోతూంటే రాజేంద్ర ఒక అడుగు ముందుకువేసి "జవాబు రెడీగా లేదా" అన్నాడు

"వుంది... కానీ... యిప్పుడు చెప్పలేను..." అంటూ అతను చెయ్యి చాచటంతో ఆ చేతిని ఒక్క క్షణం గట్టిగా పట్టుకుని "చూడండి పెళ్ళిచూపుల్లో సంబంధం తప్పిపోయేలా చేయటానికి యేదైనా వుపాయం చెప్పండి" అంది.

"మీరు చూసిన పాత సినీమాల్లో చాలా వుపాయాలు దొరుకుతాయి అవన్నీ గుర్తుతెచ్చుకోండి" అంటూండగానే ఆటో బయలుదేరింది.

సుమిత్రకి కోపం ముంచుకువచ్చింది. అయినా ఆపుకుని యింటి అడ్రెస్ చెప్పి మూతి బిగించుకు కూర్చుంది. యింటికి వచ్చేసరికి కమల మూతి ముడిచి "అమ్మాయిగారికి షికార్లు యెక్కువైనాయి." అంది విసురుగా లేచి భోజనం యేర్పాటు చూస్తూనే. "సారీ... సారీ... కమలా" బ్రతిమలాడింది సుమిత్ర.

## 15

కమల పెళ్ళికి వెళ్ళింది సుమిత్ర. పెళ్ళి బాగా జరిగిపోయింది. కమల "యిదంతా నీ చలవే సుమిత్రా," అంటూ పసుపుబట్టలతోనే వచ్చి కౌగలించుకున్నది. సుమిత్ర కళ్ళు చెమర్చాయి

"అంతా నీ అదృష్టం, ఆపైన భగవంతుడి దయ" అని తను తల్లిదండ్రుల దగ్గరకి వచ్చేసింది.

బస్‌దగ్గరకే యెదురువచ్చాడు సూర్యం. 'అక్కా' యిన్నాళ్ళు ఆలస్యం చేశావేం. నీకోసం ప్రతిరోజూ యిక్కడికి వచ్చిపోతున్నాను" అన్నాడు చేతి బ్యాగ్ అందుకుంటూ. అల్లరితనంపోయి కాస్త కుదురువచ్చినట్లున్న సూర్యాన్ని తదేకంగా చూసి నీ బిజినెస్ యెలావుంది" అంది అభిమానంగా.

"ఫర్లేదక్కా" అంటూ యింటి కబుర్లు చెప్తూనడుస్తున్నాడు

తండ్రి ఇల్లు వదిలివెళ్ళి చాలా మారిపోయివచ్చాడు అనిచెప్పి "అక్కా నాన్నకి అసలు యిప్పుడు కోపమే రావటంలేదు అమ్మ యేది చెప్పినా 'అలాగే' అని అక్షరాలా చేస్తున్నాడు. నా బిజినెస్‌కి కూడా సాయం చేస్తానంటున్నాడు కానీ ఆరోగ్యం బాగా దెబ్బతిన్నది, సరైన టైముకి తిండీ నిద్రాలేక "అంటూ చెప్పుకుపోతున్నాడు

సుమిత్ర నిజంగానా అని విస్తుపోతూనే నడుస్తోంది. "అమ్మాయిగారు వస్తున్నారే" చాకలిపిల్ల నోరంతా తెరిచి పల్కరించి మరీ ముందుకు వెళ్ళింది.

"సుమిత్రమ్మా వచ్చావా, నీకోసం మీ అమ్మ కళ్ళు కాయలుకాసేలా యెదురుచూస్తోందమ్మా" పొలంకి వెళుతూ పల్కరించాడు పక్కింటి పాపయ్య.

"సుమిత్రమ్మా నీకోసం పాపం మీ నాయన కర్ర కొట్టుకుంటూ యింతదాకా యిక్కడ కూకుని యివాళా అమ్మాయి రాలేదు" అనుకుంటూ యిప్పుడే యిల్లు వైపుగా యెల్లారు. యింతకీ బస్సురావటం ఆలస్యమైందామ్మా" కిల్లీకొట్టు నీలకంఠం గౌరవంగా పల్కరించాడు.

"ఔను అర్ధగంట లేటు" అని చెప్పి తమ్ముడి వెంటనడిచి యిల్లుచేరిన సుమిత్రని వీధివాకిట్లోకే యెదురువచ్చిన లక్ష్మి " అక్కయ్యా నువ్వు రావేమో, అనుకొన్నానే" అంటూ గట్టిగా కౌగలించేసుకుంది.

"అబ్బబ్బా దాన్ని లోపలికి రానీయవే చిన్నమ్మాయీ" తండ్రి ఆపేక్షగా చూస్తూ అన్నాడు. సుమిత్ర ఆయనదగ్గరగా వెళ్ళి "నాన్నా" అంది. యింక ఆ అమ్మాయి నోట్లోనించి మాట బయటికి రాలేదు. యేమ్మా నేను యిల్లు వదిలివెళ్ళినందుకు చాలా బాధపడ్డావుటగా. మీ అమ్మ చెప్పిందిలే. అహం కారంతో యిల్లు వదలటం జరిగినా బయటి ప్రపంచంలోకి వెళ్ళిన తర్వాతగానీ నాకీ యిల్లు విలువ తెలిసిరాలేదమ్మా. యీ యిల్లు సగం పడిపోయిన పెంకు టిల్లే కావచ్చు కానీ నా ప్రాణానికి యిదొక భూతలస్వర్గం. యీ స్వర్గంలో మీ అమ్మ ఒక దేవత అనేది బాగా తెల్సుకుని వచ్చానమ్మా. అన్నట్లు కాళ్ళు అయినా కడుక్కోకుండానే కాఫీ అయినా తాగకుండానే కబుర్లతో వూపిరి సలపనీయటంలేదుకదూ. తల్లీ అదుగో మీ అమ్మ వచ్చింది. ఒసేయ్ అమ్మా యికి యిచ్చేటప్పుడు నాకూ ఒక కప్పు కాఫీ యివ్వు ముందే చెపుతున్నా.

ఆయన అలా శాంతంగా మాట్లాడుతూంటే చాలా ఆశ్చర్యంగానూ ఆనందం గానూ వుంది సుమిత్రకి. తల్లి అమాంతం కూతుర్ని దగ్గరకి తీసుకుంది. సుమిత్ర తల నిమురుతూ "పాపిష్టి తల్లిదండ్రులం. నిన్నెంత కష్టపెడుతున్నా మమ్మా. మగపిల్లాడిలా బాధ్యత భుజానవేసి వుద్యోగం అంటూ పట్నం పంపాం. అక్కడ నువ్వు యేం తింటున్నావో యేంచేస్తున్నావో ఒక్కసారివచ్చి చూడటానికి కూడా అవకాశం లేదుకదా! అమ్మా ముందు మంచినీళ్ళు తాగు." అని చెప్పి చిన్న కూతుర్ని కాఫీ తెమ్మని చెప్పింది.

లక్ష్మి క్షణంలో కాఫీ తెచ్చింది. సుమిత్ర కాఫీ తాగి స్నానం అయాక "ఎందుకమ్మా అలా వుత్తరాలు వురికించావూ" అంటూ అసలు విషయం లోకి దించింది. పార్వతమ్మ విషయం అంతా వివరంగా చెప్పి

"పెద్దపిల్ల పెళ్ళికాకుండా చిన్నపిల్ల పెళ్లి జరగటం మన యింటా వంటా లేదు. అసలు మన ఆచారమేకాదు. కనుక నీకూ సంబంధం చూశాం. సూర్యనారాయణమాష్టారి అన్న కొడుకు మరో నాలుగురోజుల్లో వస్తాడుట. అతను సరే. యివాళ మరొకరు వచ్చి చూస్తారు నిన్ను. అతనికి ఆస్తివుంది. అంతస్తువుంది. పిల్ల నచ్చితే పెళ్లిచేసుకుని ఫారన్ తీసుకువెళ్లిపోతాడుట. మంచి సంబంధం. యివాళే సాయంత్రం పెళ్ళిచూపుల యేర్పాట్లు" అని చెప్పింది

"నేను చేసుకోను" అని సుమిత్ర యెంత చెప్పినా తల్లి వినలేదు. "అతన్ని నువ్వు ముందు చూడు.'' అని చెప్పి యింక కూతురు చెప్పేది విన్పించుకో లేదు

పెళ్లిచూపుల తతంగం నిరాడంబరంగా జరిగినా కాఫీలకీ టిఫినులకీ ఖర్చు బాగానే అయింది. సూర్యం యీ యేర్పాటులన్నీ జాగ్రత్తగా చేశాడు వరుడు బాగానే వున్నాడు. సుమిత్రని సూటిగా కొన్ని ప్రశ్నలువేసి జవాబులు విని "ఆల్ రైట్ నాకు అమ్మాయి నచ్చింది" అని చెప్పి "మీ అభిప్రాయం కబురు చెయ్యండి" అని వెళ్ళిపోయాడు.

"నేను చేసుకోను" అన్న సుమిత్ర ఆ క్షణంలో ఆ ఇంట్లోని వారందరికీ పిచ్చిదానిలా కన్పించింది వెంకట్రావు కోపాన్ని తెచ్చుకోలేదు. 'పోనీయమ్మా నీ యిష్టం' అనేసి వూరుకున్నాడు. "మాష్టారి చుట్టాల అబ్బాయిని కూడా చూడమ్మా. లేకుంటే వేరే చూద్దాం" అంటూన్న తండ్రికి యింత శాంతం యెలా వచ్చిందబ్బా అనుకుంది సుమిత్ర.

అయితే పార్వతమ్మ మాత్రం చాలా అశాంతిపడిపోతోంది. నిన్న చూసిన సంబంధం వద్దు అన్నదని ఆవిడకి చాలా కోపంగాకూడా వుంది

"యిలా అయితే లక్ష్మికి కుదిరిన సంబంధం కూడా జారిపోతుందే తల్లీ" అని వాపోయింది. సుమిత్రకి అశాంతిగా వుంది. రాజేంద్ర విషయం తల్లికి చెప్పాలనే వుంది. కానీ యెలా చెప్పాలి అని సంకోచిస్తుంది రెండు రోజులు మెల్లగా జరిగాయి లక్ష్మికి అక్కగారిమీద చికాకు వచ్చినా లోలోపల అణుచుకుంటూ వుంది. సూర్యం గలగల్లాడిస్తూ ఓ డబ్బాతెచ్చి సుమిత్ర ముందు పెట్టి "అక్కా చిన్నాన్న కోరిక అక్షరాలా తీరుస్తాను. చూడు యీ డబ్బా

నింపేశాను. మొత్తం మూడువేలు పూర్తిచేశాను," అన్నాడు అపురూపంగా ఆ డబ్బా అక్కగారికి అందిస్తూ.

సుమిత్ర మనస్సు కదిలిపోయింది. మధ్యతరగతి మనుషులు ఒకరికోసం ఒకరు యెంత ఆరాటపడతారు. అంతలో కోపం, అంతలో ఆత్మీయత. ఓహో...నా కోసం నా పెళ్లికోసం నా భవిష్యత్తుకోసం చిన్నాన్న ఆలోచించాడు. చిన్నవాడైనా తమ్ముడు ఆలోచిస్తూనే వాడి కష్టార్జితంలో యెనోగ్గి ఖర్చులు మానేసి యీ సుమిత్రా కళ్యాణంకోసం దాచిపెడుతున్నాడు. అమ్మ మాసికల చీరె కట్టుకుని పైసాపైసా దాస్తోంది. ఒకవిధంగా నేనెంత అదృష్ట వంతురాలిని అని అనుకుటూంటే యీ పెళ్ళివిషయంలో తల్లిదండ్రులకి యెదురు చెప్పకూడదు అనిపిస్తుంది. కానీ మరోవైపు రాజేంద్రకిచ్చిన మనస్సులో మరెవరికీ స్థానంలేదని మొరాయిస్తుంది. సుమిత్ర ఆశాంతిపడుతోంది రాజేంద్ర సంగతి చెప్పేయాలని ప్రయత్నిస్తూన్నా తల్లి వినేలాలేదు.

సూర్యనారాయణమాష్టారి తాలూకు అబ్బాయి వచ్చాడనీ యీరోజు మధ్యాన్నం మూడుగంటలకి చూడటానికి వస్తారనీ కబురు తెచ్చాడు సూర్యం. వారం వర్జం మరీ చూశాడు వెంకట్రావు. పార్వతమ్మ యేడుకొండలవాడికి మరీ మరీ మొక్కుకుంటూంది."యీ సంబంధంఅయినా కుదిరేలాచెయ్యిభగవాన్"అని. ఆప్రక్కనే సుమిత్ర "యీ సంబంధం జరక్కుండా చెయ్యి. రాజేంద్ర విషయం చెప్పేయగల ధైర్యం యివ్వు భగవాన్" అనుకుంటోంది. యింక లక్ష్మి యిల్లు సర్దటంలో మునిగిపోయింది. పొరుగింట్లోనించి యెరువు కుర్చీలు తెచ్చివేశాడు సూర్యం. పార్వతమ్మ టిఫెనూ కాఫీ తయారు చేస్తూనే "సుమిత్రా ముఖం కడుక్కుని మంచి చీరెకట్టుకోమ్మా" అని యిప్పటికి నాలుగుసార్లు అన్నా కేకలుపెట్టింది వెంకట్రావు కర్రపట్టుకుని కాలీడ్చుకుంటూనే పెద్దిరెడ్డిగారింటికెళ్ళి పట్టెడు సన్నజాజి మొగ్గలు పట్టుకొచ్చి "చిన్నమ్మాయ్" అని కేకపెట్టి అవి యిచ్చి "యివన్నీ దండకట్టి అక్కయ్య కివ్వమ్మా-పువ్వులు శుభం పలుకుతాయి" అన్నాడు గోడనవున్న యేడుకొండలవాడి ఫోటో వైపుచూస్తూ

ఆయన లోలోపల యేంకావాలని కోరుకుంటూన్నాడో సుమిత్ర గ్రహించింది. ముఖం కడుక్కోవాలనిపించటంలేదు. బట్టలు మార్చుకోవాలని అన్పించటంలేదు అలా అని తల్లిదండ్రులకి యెదురు చెప్పలేకనూ పోతోంది మనస్సులో ఘర్షణ. యేవేవో ఆలోచనలు యీ పెళ్లికొడుకు బాగుండకూడదు వుద్యోగం మంచిది కాకూడదు. యింకా యిలాగే ఆలోచిస్తూంటే మాష్టారొచ్చారమ్మా. నేతీసుకు

వచ్చేశాను నాన్నా" సూర్యం గొంతు విని గభాలున గదిలోకి వెళ్లిపోయింది సుమిత్ర. లక్ష్మి పూలమాల కడుతూ కిటికీలోనించి వసారాలోకి తొంగిచూస్తుంది. పెళ్లికొడుకు యెలా వున్నాడో అని,

తండ్రి వారిని మర్యాదచేస్తూ కూర్చోవటం మన సూర్యం మంచినీళ్లు యివ్వటం విన్పిస్తూనే వుంది. పార్వతమ్మ పరుగున వచ్చి కూతురు యింకా తయారు కాకుండా కూర్చున్నది చూసి "అయ్యో ఖర్మ, యెప్పటినించీ చెపుతున్నానే. అవతల వచ్చింది యొకొకరూ యింకొకరూనా. సూర్యనారాయణ మాష్టారు. మన మంచి కోరేవారు. ముఖ్యంగా నువ్వు అంటే ప్రత్యేకమైన అభిమానంవున్న వారు. ఆయన కావాలని నిన్ను చూపాలని ఆ అబ్బాయిని తీసుకువస్తే తయారుగా వుండకయింకాఅలాగేకూర్చున్నావా? పరువూమర్యాదా అక్కర్లేదూ తల్లిదండ్రుల మాటఅంటే విలువ యివ్వక్కర్లేదూ. వూ వెళ్లి త్వరగా తయారయి అయిదు నిముషాల్లో అక్కడికి రాకుండేనా... చూడు నేను నీ కన్నతల్లిని చెపుతున్నాను. ఆ అబ్బాయి యిష్టపడినట్లు గనక చెప్తే "సరే," అని మాటకూడా యిచ్చేస్తాను. ముందే చెపుతున్నాను. నీ మాట వినను.

మీలాంటివాళ్ళ మాటలువింటూ కూర్చుంటే యీ పెళ్ళిళ్ళు జరగవు. చూడు సుమిత్రా, ప్రేమలూ గీమలూ అనే వేమన్నావుంటే అవన్నీ కట్టగట్టి యేట్లో పారేయి. ఆడపిల్ల లెవరైనాసరే పెద్దలు చూసిన సంబంధం చేసుకుంటే చెడిపోరు. తెల్సునా. యింక ఒక్క అక్షరం చెప్పేపనిలేదు. అబ్బాయి బుద్ధిమంతుడనీ మంచి వుద్యోగమనీ మాష్టారు చెప్పారు. అబ్బాయిని చూశాను. ముత్యంలా వున్నాడు. నీ పెళ్ళివిషయం నీ తల్లిదండ్రులుగా మాకంటే నీకు యెక్కువ తెలియదు. నా మాట కాదన్నకు. అన్నా వీలులేదు. ఫో... త్వరగా చీరె కట్టుకుని వసారాలోకి రా,"అనేసి ఆవిడ సుమిత్ర చెప్పబోయేదికూడా వినకుండా వెళ్ళిపోయింది. వసారాలోకి తొంగిచూసిన లక్ష్మి పరుగునవచ్చి అక్కని వాటేసుకుని గిరగిరా తిప్పి వదిలి "అక్కా అచ్చంగా హీరోలా వున్నాడే. అబ్బ యెంతబావున్నాడో'' అంటోంది.

సుమిత్రకి అసలే తల్లి అలా చీవాట్లేసినందుకు కోపం వచ్చేసింది. యింక చెల్లెలు యిలా చేసేసరికి విసుగొచ్చి "యేడిశావ్‌గానీ ఫో" అనేసి విదిలించుకుని ముఖం కడుక్కుని జడవేసుకుని చెల్లెలు పూలదండ తలలో పెడుతూంటే గింజుకుని వెలిసిన వాయిల్ చీరె కట్టుకుని అలాగే వచ్చింది వసారాలోకి, తల వంచుకుని. ఆడపిల్ల చదివినా, వుద్యోగం వెలగబెట్టినా పెళ్ళివిషయం వచ్చేసరికి

పెత్తనం తల్లిదండ్రులదే అవుతుంది దీన్ని యెదిరించి నిలబడాలి అని ఆవేశ పడుతూనే విసురుగావచ్చి కూర్చుంది.

"ఏమ్మా సుమిత్రా! బావున్నావా" అని పల్కరిస్తూన్న సూర్యనారాయణ మాష్టారి గొంతువిని ఆ మాటలోని ఆత్మీయతకికరిగిపోతూనే తలెత్తి ఆయనవైపు చూస్తూ" బావున్నానండీ" అంది మెల్లగా. ఆయన తన ప్రక్కనే కూర్చున్న యువకుడిని చూపిస్తూ

"యితను మా అన్నయ్య కొడుకు... హైదరాబాద్‌లో వుద్యోగం చేస్తూ న్నాడు'' అని పరిచయం చేస్తూంటే అప్పటివరకూ పేపరు ముఖానికి అడ్డం పెట్టుకుని కూర్చున్న అతను...పేపరు కిందకిదింపి నమస్కారం అంటూన్న సుమిత్రని క్షణం చూసి తెల్లబోయి సరిగా సర్దుకు కూర్చుంటూ సుమిత్రనీ సుమిత్ర పెట్టిన మెల్లకన్నునీ చూస్తూ "న...నమ...స్కారం'' అన్నాడు తడ బడుతూనే. సుమిత్ర రాజేంద్ర గొంతు విని మెల్లకన్ను పెట్టిచూడడం మానేసి నిటా రుగా నిల్చుని చూస్తూ... "మీ...మీ...రు" అంది.

"మీరు...'' అంటూన్న ఆ యిద్దరినీ మార్చి మార్చి చూస్తూన్నారు అక్క డున్నవారు అందరూ. మాష్టారు నిశితంగా చూస్తూ రాజేంద్ర "యీ అమ్మాయి పేరు సుమిత్ర."

"సుమిత్రా యితని పేరు రాజేంద్ర." అని పరిచయంచేస్తూ వీళ్ళిద్దరికీ యిది వరకేపరిచయం వున్నట్లుందిఅనుకుంటూ ఆ ఇద్దరినీ మార్చిమార్చి చూస్తూన్నారు.

యింక వెంకటరావు తన కూతురి వుద్యోగంగురించీ చదువుగురించీ మర్యాదనిగురించీ చెప్పుకుపోతూంటే పార్వతమ్మ ఆగమన్నట్లు సంజ్ఞచేసినా ఆయన ఆగేలాలేరు అయితే రాజేంద్ర ఆశ్చర్యాన్నుంచి తేరుకుని వెంకట్రావు చెప్పేది శ్రద్ధగా వింటూనే సుమిత్రవైపు అప్పుడప్పుడూ చూస్తూ యేమీ తెలి యనివాడిలా నటిస్తూంటే మా కిదివరకే పరిచయంవుంది అని చెప్పాలన్నమాట నాలుక చివరివరకూ వచ్చినా ఆపుకుని అతనివైపు చూసింది. సూర్య నారాయణ మాష్టారి చుట్టాలు అంటే యెవరో అనుకుంది. కానీ బలే జరిగిందిలే అనుకుంది యింతలో ఓ అనుమానమూ వచ్చింది. నన్ను పెళ్ళాడతానన్న రాజేంద్ర యిక్కడికి పెళ్ళిచూపులకి యెందుకువచ్చినట్లు! నేనని ముందే తెల్సునా! యెంత ఆలోచించినా అర్థంకావటంలేదు వెంకట్రావుగార్ని ఆగమని యింక సూర్యనారాయణగారు మొదలెట్టారు.

"మా అబ్బాయి తెలివిగలవాడనీ, అన్నింట్లోనూ ఫస్ట్‌అని యింకా యింకా

చెపుతుంటే సుమిత్ర అలాగా అన్నట్లు వింటూవుంటే పార్వతమ్మ కూతురి ముఖంచూసి ఆశ్చర్యపోయింది, యిక్కడికి రాకముందు యెగిరెగిరిపడిన సుమిత్ర యిలా బుద్ధిమంతురాలైపోయిందేం అని ఒకవేళ అబ్బాయి నచ్చి వుంటాడా! అమ్మాయికి నచ్చినా అబ్బాయికి నచ్చింది అన్న చల్లటివార్త మాష్టారు చెవిన వేళాకకదూ అమ్మయ్య అనుకునేది అని ఆవిడ ఆతుర్యపడి పోతూనే టిఫెనూ కాఫీ చిన్నకూతురుతో పంపి లోపలి వాకిలిదగ్గర నిల్చుని రాజేంద్రని మరీ మరీ చూస్తూ బంగారుతండ్రిలా వున్నాడు. యే ఆడపిల్ల బంగారు పువ్వులతో పూజించ కూర్చుందో యీ యువకుడికోసం. నా తల్లి నా సుమిత్రకే యీ సంబంధం ఆయేలా చేయమని మరీమరీ ప్రార్థిస్తోంది ఆవిడ.

యెన్నెన్నో ప్రశ్నలు వేస్తాడు అనుకున్న పెళ్ళికొడుకు పెదవి కదప కుండానే తాతగారివెంట బుద్ధిమంతుడిలా వెళ్ళిపోతూంటే అలాగే చూస్తూ నిల్చు న్నది పార్వతమ్మ వెంకటరావు, మాష్టారి, ఇంటివరకూ పంపి 'నేను మళ్ళీ కలుస్తాను" అని శెలవు తీసుకుని వచ్చేశాడు. సుమిత్రకి ఆశ్చర్యంగా వుంది. యిలా యెలా జరిగివుంటుంది! అని

రాజేంద్రని వంటరిగా కల్సుకోవాలని తహతహలాడిపోతోంది మనస్సు. కానీ యెలా? అతన్ని నాలుగూ దులిపేయాలి, "నాకు మాట యిచ్చి యిక్కడికి పెళ్ళిచూపులకి వచ్చావా" అని కానీ అతనూ ఆ ప్రశ్నే వేస్తే! అన్న ఆలోచనా వచ్చింది సుమిత్రకి నా యిష్టం లేకుండా తల్లిదండ్రులు చేశారు అని ఆలోచించి పెట్టుకుంది జవాబు మాష్టారు వెళ్ళినతర్వాత వాళ్ల యేమని చెప్పారో యింట్లో యెవరూ యేమీ అనుకోకపోయేసరికి ఆతురతా ఆవే దనా అధికం అయింది. సూర్యంమాత్రం తనని చూసి ముసిముసి నవ్వులు నవ్వుతూవుంటే కోపంతో మండిపోతోంది. కానీ యెందుకురా నవ్వుతావు అని అడిగే ధైర్యంమాత్రం లేకుండా వుంది.

మాష్టారింటికి వెడితే! ఛీ ఛీ బాగుండదు. అసలే పల్లెటూరు అనుకుని మానే సింది. పోనీ రాజేంద్ర, మాకు యిదివరకే పరిచయం అని చెప్పేసి యిక్క డికి రాకూడదూ! అని కోపమూ వస్తోంది.

"పార్వతమ్మ పాలేరు కుర్రాడితో" కొబ్బరి బొండాలు కొట్టించి మాష్టా రింటికి పంపుతూండటంచూసిన సుమిత్ర మెదడులో ఓ ఆలోచనతళుక్కుమంది. వాడు వెళ్ళబోతుంటే రహస్యంగా పిల్చి ఓ క్షణం వుండమని లోపలికివెళ్ళి చిన్న కాయితంమీద రెండేపంక్తులు రాసి రాజేంద్రకివ్వమని వాడికి చెప్పి



యిస్తూంటే వాడు మర్చిపోయిన విషయం గుర్తుతెచ్చుకుంటూన్నట్లు తలమీద కొట్టుకుని

"అమ్మాయిగారూ మనింటికొచ్చిన పెళ్ళికొడుకుగారు, కనపడి మీకి సీటీ యిమ్మని యిచ్చారండీ మర్చిపోయినా" అంటూ షర్టు చేతిమడతలోనించి వో కాయితం తీసియిచ్చి "మీరియ్యండి ఆరికిస్తా "అన్నాడు. సుమిత్ర చీటీ విప్పి చదువుకుంది యిలా

డియర్ సుమిత్రా! యివాళ సాయంకాలం ఆరున్నరకి దేవాలయం దగ్గిరకి రా. ముఖ్య విషయం మాట్లాడాలి. లేకుంటే నన్ను మీ యింటికి రమ్మంటావా?"

రాజేంద్ర.

ఆ వుత్తరం చూస్తూంటే సుమిత్ర మనస్సులో సంతోషం పొంగుకొచ్చి 'గుడికి వస్తానని చెప్పు' అనేసి తను రాసిన చీటీ లాక్కుని అతన్ని పొమ్మని రాజేంద్ర రాసిన చీటీని యెన్నోసార్లు చదువుకుంది.

'డియర్ సుమిత్రా' అన్న వాక్యాలు కోటి గొంతుకలతో అతి మధురంగా విన్పిస్తూన్నాయి. రాజేంద్ర యిదివరకు సుమిత్రాదేవీ అని పిలవటం గుర్తుకొచ్చి

నవ్వుకుంది. అబ్బ అప్పుడే యెంత స్వతంత్రం. యీ మగాళ్ళకి సిగ్గువుండదు అనుకుంది.

సుమిత్ర యీ ఆలోచనల్లో వుండగానే అయిదుగంటలు దాటిపోయింది. గబ గబా స్నానంచేసి మంచి చీరె కట్టుకుని తలలో పువ్వులు పెట్టుకుని తెగ ముస్తాబయే కూతుర్ని 'యెక్కడికే' అంది తల్లి.

"గుడికి వెళ్ళి వస్తానమ్మా"అనేసరికి పార్వతమ్మ ముఖం చాటంత అయింది.

"నా తల్లీ ఆ దేవుడికి యీ పెళ్ళి నిర్విఘ్నంగా జరిపించమని దణ్ణం పెట్టుకు రామ్మా" అని పంపింది.

చల్లటిగాలి వీస్తోంది. సూర్యుడు అస్తమిస్తూన్నాడు. చీకట్లు నలుమూలలా అలుముకుంటున్నాయి ఆ చల్లటిగాలికి సుమిత్ర హాయిగా అనందంగా అలా అలా తేలిపోతూ దేవాలయం ప్రహరీ దగ్గరగా వస్తూ రాజేంద్రకోసం వొళ్లంతా కళ్ళు చేసుకుని నలుమూలలా చూసింది. యెదురుగా దూరంగా అప్పటివరకూ నిరీక్షించి విసుగెత్తినా యిప్పుడే కన్పించిన సుమిత్ర దగ్గరకి పరుగున వస్తూన్నాడు రాజేంద్ర. అతన్ని కల్సుకోవటానికి సుమిత్రా పరుగుతీసింది. 'సుమిత్రా' అంటూన్న అతని చేతుల్లో వాలిపోయిన సుమిత్రకి యింకేంతెలియలేదు అంత క్రితం యేవేవో యితన్ని అడిగి సందేహనివృత్తి చేసుకోవాలన్న విషయమే గుర్తులేదు. ప్రకృతి అంతా నిశ్శబ్దంగా వుంది కానీ ఆ నిశబ్ద్ప్రకృతిని ఛేదించుకుంటూ దేవాలయంలో కొట్టిన గంట గణగణా విన్పిస్తోంది.

"నేనెంత అదృష్టవంతుడిని! మాతాతయ్య యింత మంచి అమ్మాయిని యెంచి నాకోసం వుంచాడని ముందే తెలిస్తే యెప్పుడో వచ్చి నీదగ్గిర వాలేవాడిని. పోనివ్వు యిప్పటికైనా యిద్దరం ఒకటి అయాం కదూ సుమిత్రా!"

అంటూన్న రాజేంద్ర ముఖంలోకి చూస్తూ 'నిజం' అంది సుమిత్ర. దేవాలయంలోని గంట యింకా విన్పిస్తూని వుంది. ఆ యిద్దరికీ.





# అగ్నిమాల

దాసరి సుబ్రహ్మణ్యం

(గత సంచిక తరువాయి)

## 20

"ఓబలా! నువ్వు తెచ్చిన సమాచారం, నాకు చాలా సంతోషం కలిగిస్తున్నది. అందరితోపాటు నేనూ, అగ్నిపాలుడు మరణించి వుంటాడనే యిన్నాళ్లుగా భావిస్తున్నాను," అన్నాడు నవభోజమహారాజు.

"చిత్తం, ప్రభూ! మొదటినించీ యీ దుర్వార్తలను కావాలనే ఎవరో ప్రచారం చేస్తున్నారని, నేను అనుమానిస్తూనే వున్నాను కాని, యిప్పటి అగ్నిపాలుడి పరిస్థితి ....."అంటూ, నవభోజరాజు దృష్టిని మరోవైపుకు తిప్పేసరికి, ఓబలరాజు మాట మధ్యలోనే ఆగి అటు కేసి చూశాడు

అగ్నిపాలుడు, ఆనాటి సాయంత్రం అయిదుగంటలవేళ న్యాయమూర్తుల ఎదట, రాజద్రోహిగా విచారించబడుతున్న సమయంలో, నవభోజమహారాజు తన పరివారంతో మానుకోట నగరానికి

వస్తూ, దారిలో వున్న కూర్మశైలందగ్గిర ఆగి, అక్కడ కాలభోజుడితో, తన ప్రధానసేనాని హనుమప్పనాయకుడు జరిపిన ఘోరసంగ్రామాన్ని గురించిన వివరాలు అడిగి తెలుసుకొంటున్నాడు.

ఆ సమయంలో, అగ్నిపాలుడి మిత్రులలో ఒకడైన ఓబలరాజు, నవభోజమహారాజుకు, అగ్నిపాలుణ్ణిగురించి అప్పుడే తనకు తెలిసిన సమాచారాన్ని గురించి వివరిస్తున్నాడు.

"అయితే, ఓబలా! మనం మాను కోటకు బయలుదేరి వస్తున్నట్టు, యీ సరికి అగ్నిపాలుడికి తెలిసేవుంటుందను కుంటాను అతడు మనకోసం తప్పక ఎదురుచూస్తూంటాడు," అన్నాడు నవభోజుడు.

"ఇంతకు ముందు ప్రభువులవారికి నేను విన్నవించిన సంగతి..." అంటూ ఓబలరాజు నీళ్ళు నమిలాడు.

నవభోజరాజు చిరునవ్వు నవ్వుతూ, "అదంతా, అవజ్ఞవర్మ హాస్యంకోసం చేసినపనై వుంటుంది! బహుశా, సత్రంలో ఆ సమయాన వున్నవారికి ఆ సంగతి తెలిసి వుండదు," అన్నాడు.

"లేదు, ప్రభూ! హనుమప్పసేనానిని అడగండి. ఆయన అగ్నిపాలుణ్ణి బందీగా పట్టితెచ్చేందుకు సైనికులను పంపాడు అయితే, ఆయనకు ఆ సమయంలో వచ్చిన సమాచారాన్నిబట్టి, అతడు అగ్నిపాలుడు కాదు; విష్ణు మిత్రుడనే రాజద్రోహి!" అన్నాడు ఓబలరాజు.

నవభోజుడు పక్కనే నిలబడివున్న హనుమప్పసేనానికేసిచూశాడు "అవును మహారాజా! నాకు అందిన సమాచారం ప్రకారం, ప్రసేనుడి ఇంట దాగివుంటు న్నది, విష్ణుమిత్రుడనే రాజద్రోహి. అతణ్ణి బంధించేందుకు నేను,సైనికులను పంపాను. కాని, యిప్పుడు ఓబలరాజు చెపుతున్నదాన్నిబట్టి, అతడు అగ్ని పాలుడనీ......విష్ణుమిత్రుడి పేరుతో, ఆ ఇంట వుంటున్నాడనీ తేలుతున్నది," అన్నాడు హనుమప్ప

నవభోజరాజు ఆశ్చర్యపోతూ, ఓబల రాజుకేసి చూశాడు.

"అవును, ప్రభూ! అగ్నిపాలుడు రాజద్రోహి అయిన విష్ణుమిత్రుడని పొరపాటుపడి సైనికులు పట్టుకోబట్టే— అవజ్ఞవర్మ అతణ్ణి, ఆ పేరుమీదుగా హేళనచేస్తున్నాడు." అన్నాడు, ఓబలరాజు

"వారిద్దరిమధ్యా అంత విరోధభావ మున్నదని, నాకు యింతవరకూ తెలియదే!" అంటూ నవభోజుడు కనుబొమలు ముడిచి, "అగ్నిపాలుడికి, ప్రసేనుడి యింట, విష్ణుమిత్రుడని పేరు పెట్టుకుని చేరవలసిన అవసరం ఎందుకు కలిగింది?" అన్నాడు

"అవజ్ఞవర్మను, ఆ మల్లూరు మాండలికుడైన ప్రసేనుడి యింటికి మరొకసారి

పంపడం జరిగింది; జ్ఞాపకం వున్నదా, ప్రభూ?" అని అడిగాడు ఓబలరాజు.

"జ్ఞాపకం లేకేం!" అన్నాడు నవభోజుడు

" ఆ ప్రసేనుడి పుత్రిక వకుళమాల విషయమై, వాళ్ళిద్దరూ వాదోపవాదాలకు దిగి, చివరకు పందెం కట్టుకున్నారు. ఆమెను భార్యగా తేగలనని అగ్నిపాలుడు బయలుదేరి వెళ్ళాడు," అన్నాడు ఓబలరాజు.

"పందెంలో ఒడ్డిన వస్తువులేమిటి?" అన్నాడు నవభోజుడు ఆశ్చర్యంగా.

"ఇద్దరూ తమ తమ సంస్థానాలు పణంగా ఒడ్డారు, ప్రభూ," అన్నాడు ఓబలరాజు కొంచెం భయపడుతూ.

"సంస్థానాలనే పందెంగా ఒడ్డటమా! బావుంది," అంటూ నవభోజుడు చిరకోపంగా ఓబలరాజుకేసి చూసి, "ఆ సమయంలో నువ్వెక్కడ వున్నావు?" అన్నాడు

ఓబలరాజు తడబడ్డాడు. "అవును, ప్రభూ! నేనూ, ధర్మపాణీ, జయసింగ్ ...... అందరం వున్నాం. పందెం షరతులు లిఖితపూర్వకంగా ఉదాహరించి, ఆ పత్రాలను వారు పరస్పరం మార్చుకోవటం కూడా జరిగింది," అన్నాడు.

" నా ఆస్థానంలో యింత గొప్ప జూదగాళ్ళున్నారని, నాకు యిప్పుడే తెలుస్తున్నది, ఓబలా!" అంటూ నవభోజుడు కనుబొమలు ముడిచి, "సరే, అగ్నిపాలుడు, అవజ్ఞవర్మకు ఎందులోనూ తీసిపోయే వ్యక్తికాదు గనక, వాళ్ళిద్దరినీ ఒకరి గొంతులు ఒకరు కోసుకోనిద్దాం!" అన్నాడు.

"మహాప్రభూ! మీరొకటి చిత్తగించాలి," అన్నాడు ఓబలరాజు జంకుతూ.

"ఏమిటదీ?" అంటూ నవభోజుడు, ఓబలరాజుకేసి అనుమానంగా చూశాడు

"వాళ్ళిద్దరూ యీనాడు సమవుజ్జీలు కారు. అవజ్ఞవర్మ మానుకోట పట్టణానికి పంపబడిన రాజప్రతినిధి!" అన్నాడు ఓబలరాజు.

"నాకా సంగతి గుర్తున్నది!"

" అగ్నిపాలుడు, విష్ణుమిత్రుడనే పేరుగల రాజద్రోహిగా పట్టుకోబడిన ఖైదీ, ప్రభూ!" అన్నాడు ఓబలరాజు.

ఆ తరువాత అన్నట్టు నవభోజుడు తల వూపాడు.

"అవజ్ఞవర్మ, అగ్నిపాలుణ్ణి— ఈ కారణాలవల్ల, ఏ క్షణాన అయినా ఉరి తీయించగలడు!''

ఓబలరాజు మాటలు వింటూనే, నవభోజుడు చకితుడయ్యాడు కొంచెం ఆగి "అంతా అర్థమైంది, ఓబలా! అవజ్ఞవర్మ సత్రంలో అగ్నిపాలుణ్ణి గుర్తించనట్లు నటించినదాని వెనక, ఏదో కుట్ర వున్నదనేనా, నీ నమ్మకం?" అన్నాడు.

"అవును ప్రభూ!" అన్నాడు ఓబల రాజు.

"అయితే ఎటు పోయి ఎటువస్తుందో, ముందే జాగ్రత్తపడటం మంచిది" అంటూ నవభోజుడు చుట్టూ కలయ చూసి "జయసింగ్ ఏమయినట్టు?" అన్నాడు

"అతడు వెనకగా, అశ్వసైనికులతో కలిసివస్తున్నాడు, మహారాజా!" అన్నాడు హనుమప్ప సేనాని

"అతణ్ణి వెంటనే యిక్కడికి పంపించు."

కొద్దిసేపట్లో జయసింగ్ మహారాజు వద్దకు వచ్చాడు.

"జయసింగ్! నీవు, మాకన్న ముందు బయల్దేరి, మానుకోట చేరవలసివుంది," అన్నాడు నవభోజుడు.

"చిత్తం!" అన్నాడు జయసింగ్.

"విష్ణుమిత్రుడనబడే రాజద్రోహికి బదులుగా, అగ్నిపాలుడు మన సైనికుల వల్ల ఖైదీగా పట్టుకోబడినట్టు వార్త వచ్చింది. నీవు మానుకోట చేరేసరికి అతడు స్వేచ్ఛగా వుంటే సరేసరి, లేక పోతే నా ఆజ్ఞగా అతణ్ణి కారాగారం నుంచి విడిపించవలసిన బాధ్యత నీది!" అన్నాడు నవభోజుడు.

"ప్రభూ, అవజ్ఞశర్మ అక్కడ వున్నాడు గదా! అతడు ..."

"ఓబలరాజు చెప్పేదాన్నిబట్టి, అక్కడి వల్లనే అగ్నిపాలుడికి ప్రమాదం జరగనున్నది. ప్రసేనుడి కుమార్తె విషయమై, వాళ్ళిద్దరూ వేసుకున్న పందెం సంగతి నీకు తెలుసుగదా!" అన్నాడు నవభోజుడు కటువుగా.

"చిత్తం! తెలుసు ప్రభూ!" అంటూ జయసింగ్ తడబడ్డాడు.

"ఓబలరాజు ఊహించేది ఒకవేళ తప్పుకావచ్చు. కనుక, నువ్వు నా ఆజ్ఞను అతి రహస్యంగా వుంచవలసివుంటుంది. అవజ్ఞశర్మ యిప్పుడు మానుకోట పట్టణంలో, నా ప్రతినిధిగా వ్యవహరిస్తున్నాడు అగ్నిపాలుడు స్వేచ్ఛగా వుండటం జరిగితే, యిప్పుడు నేనిచ్చిన ఆజ్ఞ సంగతి మరెవరికీ తెలియకూడదు. నా ఆస్థానంలో పందెగాళ్ళు, జూదగాళ్ళే కాక — వారిని ప్రోత్సహించి పత్రాలు రాసి, సాక్షి సంతకాలు చేసేవారు కూడా వున్నారని, నా ప్రజలందరికీ వెల్లడించ నవసరంలేదు,'' అన్నాడు నవభోజ రాజు కోపంగా.

జయసింగ్ ప్రతిమలాకదలా మెదలక వుండిపోయాడు. నవభోజుడు అతని ముఖంకేసి ఓ క్షణకాలం చూసి, వెళ్ళ వచ్చునన్నట్టుగా తలవూపాడు మరు క్షణంలోనే జయసింగ్ తనగుర్రాన్నెక్కి ఉడాయించాడు.

ఓబలరాజు జయసింగ్ వెళ్ళిన దిక్కు కేసి తృప్తిగా చూస్తూ, "భగవాన్," అనుకున్నాడు మనసులోనే. ఇంతలో,

"మహారాజా!" అన్న హనుమప్ప సేనాని పిలుపు వినబడింది

"ఏమిటి?" అన్నాడు నవభోజుడు

"మనం ఇంతకాలంగా అనుమానిస్తున్నట్టు, ఆ మల్లూరు సంస్థానికుడైన ప్రసేనుడు, గోడమీది పిల్లికాదు ప్రభూ! అతను నూటికి నూరుపాళ్లు కాలభోజుడి పక్షపాతి," అన్నాడు హనుమప్ప సేనాని.

నవభోజుడు ఆశ్చర్యంగా చూశాడు

"గత రెండురోజులుగా యీ విషయం తమతో మనవి చేద్దామనుకుంటున్నాను. బేతాళవర్మ అనే, ప్రసేనుడి బంధువును తమరు చూశారు గదా! అతడు యీ ప్రాంతాలవున్న అనేక మంది కాలభోజుడి అనుచరులను పట్టుకోవటంలో మనకు సహాయపడుతున్నాడు ప్రసేనుడిని గురించీ, అతడి ముఖ్యానుచరులైన మరికొందరిని గురించీ అతడు నాతో కొన్ని విషయాలు చెప్పాడు. కూర్మశైలం దగ్గిర నా చేతుల్లో పడకుండా తప్పుకు పారిపోయిన మణిమంతుడు—యీ ప్రసేనుడికి ప్రాణమిత్రుడట!" అన్నాడు హనుమప్ప సేనాని

నవభోజుడు ఓ క్షణకాలం వూరుకుని "ఆ బేతాళవర్మ యీ రాజద్రోహుల పేర్లన్నీ నీ దగ్గర ఏకరువుపెట్టేకన్న తనే బయలుదేరి వెళ్ళి వాళ్ళందర్ని ఎందుకు బంధించి తకూడదు? అన్నాడు విసుగ్గా.

'చిత్తం!" అన్నాడు హనుమప్ప సేనాని తల పక్కకు తిప్పుతూ.

## 21

జయసింగ్ నలుగు రశ్వసైనికులను వెంటబెట్టుకొని మానుకోట పట్టణానికి బయలుదేరాడు. అతడు మార్గమధ్యంలో వున్న హిరణ్యపురాన్ని చేరబోయేంతలో ఎదురుగా రాజమార్గంమీద మహావేగంతో వస్తున్న ఇరువురుఅశ్వికులు కనిపించారు వారు అతివేగంగా అశ్వాలను పరిగెత్తిస్తున్నతీరు జయసింగ్‌ను ఆశ్చర్యపరిచింది బహుశా వీరు ఏ రాజద్రోహినైనా వెన్నాడ తుండాలి, లేకపోతే నవభోజరాజుకు ఏదైనా వార్త అందించేందుకైనా పోతూవుండాలి, అనుకున్నాడతడు

ఆ ఆశ్వికులిద్దరూ, యింకా ఒకటి రెండువందల గజాలదూరంలో వుండగానే, జయసింగ్ తన గుర్రాన్ని రాజమార్గం మధ్యగా ఆపి, సమీపిస్తున్న ఆశ్వికులకు ఆగమన్న సూచనగా చేయి వూపాడు

ఆశ్వికులిద్దరూ వేగాన్ని తగ్గించి, జయసింగ్‌ను సమీపించి గుర్రాలను ఆపారు. అదే సమయంలో జయసింగూ ఆ ఆశ్వికుల్లో ఒకరూ, ''హే,భగవాన్!" అంటూ పెద్దగా అరిచి, "జయసింగ్!"

అని ఒకరూ, "ఆఁ ధర్మనంద్!" అని ఒకరూ పెద్దగా సంబోధించుకున్నారు.

"ఆ భగవంతుడే మనిద్దరికీ యిక్కడ సమావేశం కల్పించాడు, జయసింగ్! నేను,నీకోసమే బయలుదేరి వస్తున్నాను" అన్నాడు ధర్మనందుడు ఉత్సాహంగా.

"నా కోసమా? ఏమిటా అవసర కార్యం?" అన్నాడు జయసింగ్

'అగ్నిపాలుడు తెలుసుగదా?"

"తెలుసా! అతడు నా ముఖ్య స్నేహితుడు. అతడికోసమే నేను..."

ధర్మనందుడు ఆత్రంగా "అతడు ఉరిశిక్ష విధింపబడి కారాగారంలో వున్న సంగతి నీకు తెలిసిందా, జయసింగ్?" అన్నాడు

"అశ్వాన్ని వెనక్కు తిప్పు; వివరాలు మాట్లాడుకుందాం. ఆలస్యం ప్రమాదకారణం కావచ్చు," అంటూ జయసింగ్ తన వాహనాన్ని అదిలించాడు

ఆ తరవాత నడిరేయికి, వాళ్లిద్దరూ మానుకోట పట్టణం చేరారు. ఆ లోపల మార్గమధ్యంలోనే ఒకరినుంచి మరొకరు సర్వం తెలుసుకున్నారు.

మానుకోట చేరగానే, ధర్మనందుడు "జయసింగ్! మనం సరాసరి కారాగారానికే గదా వెళ్ళవలసింది?" అని అడిగాడు

"అవును, అక్కడికే. అగ్నిపాలుణ్ణి ఖైదునుంచి విడిపించేవరకూ, యీ విషయం అవజ్ఞవర్మకు తెలియటం క్షేమం కాదు," అన్నాడు జయసింగ్.

కొద్దిసేపు తరవాత, సైనికులు వెంట రాగా జయసింగ్, ధర్మనందులు చీకటి కోనలావున్న ఒక సన్నని మార్గంవెంట తమ గుర్రాలను నడిపి, కారాగార ముఖద్వారాన్ని చేరారు.

కారాగార ముఖద్వారపు ఇనప తలుపులు దగ్గిరకు వేయబడి లోపలినుంచి తాళం బిగించబడి వున్నది. కారాగారాధిపతి నివసించే భవనం, నేరస్థులు బంధింపబడే కొట్లు కావల వున్నది నవభోజరాజు ఆజ్ఞ గురించి కారాగారాధిపతికి చెప్పి, అగ్నిపాలుడిని ఖైదునుంచి విడిపించాలంటే, జయసింగ్ ఆ ముఖద్వారంనుంచి లోపల ప్రవేశించవలసిందే

జయసింగ్ గుర్రందిగి, ఆ చీకటిలో తడువుకుంటూ ఇనపతలుపులను సమీపించాడు ఇంతలో, అల్లంత దూరాన కలకలం బయలుదేరింది ఆ వెంటనే, జుంయ్‌మంటూ ఒక బాణంవచ్చి, అతడి చేతిని రాసుకుంటూ పోయింది. మరుక్షణం గుర్రం ఒకటి కర్ణకఠోరంగా సకిలించి, పైనున్న రౌతును పడదోసి, ఆ చీకటిలో పడి పారిపోయింది.

"జయసింగ్! ఇక్కడేదో మోసమున్నది ఆ సందు మొగదల చీకట్లో ఎవరో పొంచివున్నారు," అన్నాడు ధర్మనందుడు.

ఆ క్షణంలో జయసింగ్ కూడా

ఆశ్చర్యపోతూ, అక్కడేదో మోసం వున్నదని అనుమానించాడు. అతడు ధర్మనందుడి మాటలు వింటూనే చెంగున వెనకకు దూకి, "ధర్మనంద్! కత్తులు పట్టుకొని సిద్ధంకండి గుర్రాలు దిగి, నా వెనకగా గోడవారగా నడవండి. ఆ ద్రోహులం అంతు తేల్చుకుందాం!" అన్నాడు, కారాగారపు ప్రహరీగోడకేసి పరిగెత్తుతూ.

ధర్మనందుడు గుర్రంమీదినుంచి ఎగిరి కిందికి దూకాడు. తతిమ్మా సైనికులు కూడా తమ తమ గుర్రాలనుంచి దూకుతున్నారు. గుర్రంమీదినుంచి పడిపోయిన రౌతు మాత్రం, చీకట్లో ఎక్కడో మూలుగుతున్నాడు.

సందు మొగదలవున్న చీకట్లో, నాలుగైదు మానవాకారాలు కదిలినై అటునుంచి భీకరమైన కంఠస్వరంతో, ఒక కేక వినబడింది "ఆ జయసింగ్ ఎవరు? నవభోజరాజాస్థాన సర్దారా?"

జయసింగ్ ఆ ప్రశ్న వింటూనే, నిశ్చేష్టుడయాడు. ఆ కంఠస్వరం తనకు బాగా తెలిసినదే! కాని, ఎవరో వెంటనే పోల్చుకోలేక పోయాడు.

"జయసింగ్ సర్దారును గుర్తించి కూడా, బాణం వదిలిన ఆ ద్రోహి ఎవరు?" అన్నాడు జయసింగ్ ఖంగుమనే కంఠస్వరంతో.

"సర్దార్ జయసింహులు, యీ సేవకుణ్ణి క్షమించాలి! నేను మాహరాను; మీ సేవకుణ్ణి!" అంటూ మాహరా, వెంట మరి నలుగురితో కలిసి, జయసింగ్ దగ్గరకు పరిగెత్తుకు వచ్చి, అతడి పాదాభివందనం చేశాడు

జయసింగ్ ఏదో అనబోయేంతలో కారాగార ముఖద్వారం లోపలినుంచి ఒక కరకుస్వరం, "ఏమిటా గద్దులాట ఎవరు మీరు?" అని ప్రశ్నించింది.

జయసింగ్ అటుకేసి చూశాడు ఎర్రని శాలువా కప్పుకుని వున్న ఒక భీకరాకారుడు అతడి కంటబడ్డాడు అతడికి యిరువైపులా ముగ్గురేసిచొప్పున ఆయుధపాణులైన సైనికులు నిలబడి వున్నారు. వారి ఎడమచేతుల్లో భగ భగ మండుతున్న కాగడాలు వెలుగుతున్నవి

"ఇక్కడేమీ గద్దులాట జరిగటం లేదు చీకట్లో గుర్రం కాలుజారి, రౌతును పడేసింది. మీరే గదా కారాగారాధిపతులు!" అన్నాడు జయసింగ్ సమయోక్తిగా.

"అవును!" అంటూ ఆ భీకరాకారుడు జవాబుచెప్పి, జయసింగ్ ధరించిన సైనిక సర్దారు దుస్తులూ, అతడి వెంట వున్న సైనికులనూ కాగడాల వెలుగులో చూస్తూ ఆశ్చర్యపడ్డాడు.

"నా పేరు జయసింగ్! నేను, నవభోజమహారాజులనుండి, విష్ణుమిత్రుడనే ఖైదీ విడుదలకు ఆజ్ఞ తెచ్చాను" అన్నాడు జయసింగ్

వెంటనే కారాగార ముఖద్వారం తలుపులు తెరవబడినై. కారాగారాధిపతి ముందుండి, సవినయంగా జయసింగ్‌ను అతడి అనుచరులతో పాటు, అగ్నిపాలుడు బంధింపబడివున్న గది దగ్గిరకు తీసుకు పోయాడు

గది తలుపులు తెరవబడినై. కాగడాల వెలుగులో జయసింగ్‌ను చూసిన అగ్నిపాలుడు, నిద్రలేక ఎర్రబడిన కళ్ళతో, దుమ్ముకొట్టుకుపోయిన దుస్తులతో వేగంగా ముందుకువచ్చి, "జయసింగ్!" అంటూ అతణ్ణి గాఢంగా కౌగలించుకున్నాడు వారిద్దరూ ఆ క్షణంలో ఆనందపారవశ్యంవల్ల, తమ పరిసరాలనే మరిచారు వారి నేత్రాలనుండి సంతతధారగా ఆనందబాష్పాలు, చెక్కిళ్ళమీదికి జాలువారినై.

ఆ దృశ్యం చూస్తున్న మాహూ సంతోషోద్వేగంతో చలించిపోయాడు. "ప్రభూ! మిమ్మల్ని సజీవంగా చూడగలననుకోలేదు. మీ తండ్రిగారి సేవలోనే మరణించివుంటే ఎంతబావుండేది! అని వాపోయాను," అన్నాడు కళ్లనీళ్లు తుడుచుకుంటూ

అగ్నిపాలుడు, జయసింగ్ దగ్గిరనుంచి మాహూకేసి రెండడుగులువేసి, ఎంతో ఆప్యాయంగా అతడి వీపుమీద తడుతూ, "మాహూ! ఈనాటినుంచీ నీవు, నా సేవకుడివి కాదు; బంధుసమానుడివి. నే కనబడకుండా పోయిన తరవాత, నా కోసమని నువ్వెన్నిపాట్లు పడ్డావో నాకు తెలుసు!" అన్నాడు

మాహూ ఎంతో వాత్సల్యంగా అగ్నిపాలుడి రెండు చేతులనూ తన చేతుల్లోకి తీసుకుని కళ్ళ కద్దుకున్నాడు.

అందరూ కారాగార ద్వారాలుదాటి బయటికి వచ్చారు. ఆ సరికి గుర్రంమీది నుంచి కిందపడిన సైనికుడు కొంత తేరుకుని, కారాగారాపు గోడకు చేరగిలబడి కూర్చునివున్నాడు జయసింగ్ ఆ సైనికుణ్ణి చూస్తూనే మాహూకేసి తిరిగి, "మాహూ! ఇంతకుముందు నీవు చేసిన అఘాయిత్యమేమిటి? మేము ఎవరిమని భావించి, ఆ సందుమొగదలనుంచి మామీదికి బాణాలు ప్రయోగించావు?" అని అడిగాడు.

"క్షమించండి, సర్దార్ జయసింగ్! అవజ్ఞవర్మ యీ రాత్రి నా యజమానిని కారాగారంలోనే హత్యచేయ ప్రయత్నిస్తాడని శంకించి, నా అనుచరులతో అక్కడ కాపువేశాను." అన్నాడు మాహూ.

"నిజమా, మాహూ! అవజ్ఞవర్మ అంత నీచానికి ఒడిగట్టగలడని నీవే కారణంవల్ల అనుమానించావు?" అని అడిగాడు జయసింగ్.

"అయ్యో, ఆ సంగతులన్నీ యిప్పుడే చెప్పమన్నారా? నేను విడిదిచేసిన ఇంటిలో అవజ్ఞవర్మ సేవకుడొకడు కాళ్లూ, చేతులూ బంధింపబడి, నాకు

ఖైదీగా వున్నాడు జరిగినదేమిటో వాడి ద్వారా వింటే బావుంటుందేమో!" అన్నాడు మాహూ.

"ఏం జరిగింది మాహూ? వాణ్ణి తరవాత విచారిస్తాంగాని, ముందు ఆ జరిగిన దేమిటో నీవే చెప్పు!" అన్నాడు అగ్నిపాలుడు కుతూహలంగా.

మాహూ చెప్పినది యిది:

ధర్మనందుడి సైనికులు, మాహూను వెతుక్కుంటూ వెళ్ళి, అతణ్ణిమాన కోటకు రెండు మూడు కోసుల దూరంలో వున్న ఒకానొకపల్లెగ్రామంలో కలుసుకున్నారు. వారి ద్వారా తన యజమాని ఎంత ప్రమాదకర పరిస్థితులలో వున్నాడో, అతడు తెలుసుకున్నాడు

వెంటనే మాహూ మిగతా సేవకులను వెంటవేసుకుని, చీకటిపడేసరికి మాను కోట చేరాడు. అగ్నిపాలుణ్ణి గుర్తించ గలిగినవాళ్ళు ఒకరున్నా, అతడు ఉరి శిక్షనుంచి బయటపడగలడని తెలుసు కున్నాడుగనక. అతడు మునుముందుగా కారాగారాధిపతి దగ్గిరకువెళ్ళి, తన యజ మానిని చూసేందుకు అనుజ్ఞ యిప్పించ మన్నాడు కాని, కారాగారాధిపతికి యీ విష్ణుమిత్రుల, అగ్నిపాలుర వేర్లగజిబిజ అర్థంకాక, మాహూను రాజప్రతినిధి అయిన అవజ్ఞవర్మనుదర్శించమన్నాడు.

మాహూ, మరిద్దరు సేవకులతో అవజ్ఞవర్మ విడిదిచేసిన గృహానికి వెళ్లే సరికి, అక్కడ ఒక సేవకుడు తలుపు కంతల దగ్గిర చెవిపెట్టి, లోపల జరుగు తున్న సంభాషణ ఏదో రహస్యంగా వినటం కంటబడింది. వెంటనే మాహూ, అన్నిటికీ తెగించి, కత్తిదూసి ఆ సేవ కుడి కంఠానికి గురిపెడుతూ "అరిస్తే చంపుతాను" అన్నట్టు సౌంజ్ఞచేసి, తనూ తలుపుకు చెవిఆనించి, ఆ లోపల జరుగుతున్న సంభాషణ సర్వం వినసాగాడు. ఆ సంభాషణ అవజ్ఞవర్మ వకుళమాలల మధ్య జరుగుతున్నది.. ఆ యిద్దరిమధ్యా జరిగిన సంభాషణ ఏమిటో మాహూ, అగ్నిపాలుడికి వివరంగా చెప్పాడు.

"అయ్యా, మీరు ఫలానా అని గుర్తించే, మిమల్ని ఉరితీయించేందుకు అవజ్ఞవర్మ సిద్ధపడుతున్నాడని గ్రహిం చాను. ఆ వకుళమాల అనే కన్యకు, మీ మీద జాలిగాని, ప్రేమగాని లేదని నేను ......ఆమె మాటలవల్ల అనుకున్నాను. అలాంటప్పుడు అవజ్ఞవర్మ చేస్తున్న ద్రోహం సంగతి నవభోజమహారాజుకు ప్రమాణంచేసి చెప్పగల వాళ్ళెవరు? నేను మీ సేవకుణ్ణి గనక, నా సాక్ష్యానికి విలువ వుండదు. అందుకని, అవజ్ఞవర్మ సేవకుడిని ప్రాణభయంచూపి, వెంట లాక్కుపోయి, నా విడిది గృహంలో బంధించి వుంచాను అతణ్ణి ఏ క్షణాన కావాలన్నా సరే, మహారాజుల ఎదట హాజరుపెట్టగలను," అన్నాడు మాహూ ఎంతో ఉత్సాహంగా.

"నీ సమయస్ఫూర్తి అమోఘం మాహూ!" అన్నాడు అగ్నిపాలుడు. కాని, ఆ క్షణంలో అతడి మనసు అవజ్ఞ వర్మమీది ద్వేషంతో భగభగమండింది. వకుళమాలకు తమ పందెం గురించి చెప్పటం ద్వారా, ఆ దుర్మార్గుడు ఆమె మనస్సును తనమీదినుంచి పూర్తిగా తిప్ప గలిగివుండవచ్చు!

అగ్నిపాలుడు యిలాంటి ఆలోచ చనలతో కిందుమీదులవుతుండగా, జయ సింగ్, మాహూతో "అంతవరకూ నీవు చేసినపని చాలా వివేకవంతమైనదే! కాని, కారాగారం దగ్గిర నీవు విల్లంబులు చేబూని దాగివుండటంలో వున్న ప్రమాదం గుర్తించినట్టు లేదు ఏ కావలి సైనికులో నిన్ను చూసివున్నట్టయితే తప్పక వెంట బడి వేటాడివుండేవాళ్ళు," అన్నాడు.

"అలాంటి ప్రమాదం వుంటుందని, నేను గుర్తించకపోలేదు, సర్దార్! కాని అవజ్ఞవర్మ, నవభోజమహారాజు యిక్క డికి చేరకముందే, నా యజమానిని చంప చూస్తాడని నాకెందుకో అనుమానం కలి గింది తెల్లవారితే నవభోజులు యిక్క డికి రావొచ్చు; లేక నా యజమానిని గుర్తించి సాక్ష్యం యివ్వగల మరెవ రైనా బయటపడవచ్చు — అప్పుడు తనకు తప్పక కీడు కలిగితీరుతుంది... అవజ్ఞవర్మ వక్రబుద్ధి యిలా ఆలోచించి తీరుతుందని నమ్మటంవల్లనే, నేను నా అనుచరులను కొందరిని అతడి ఇంటికి కాపుంచి, మరికొందరితో కారాగారం దగ్గిర వేచివున్నాను," అన్నాడు మాహూ.

"అంటే ...... అవజ్ఞవర్మ విడిది గృహాన్ని కాపలాకాస్తూ, యింకా మన వాళ్ళు కొందరు అక్కడే వున్నారా?" అని అగ్నిపాలుడు ఆశ్చర్యంగా అడి గాడు.

"చిత్రం!" అన్నాడు మాహూ.

"ఔరా, మాహూ!" అంటూ జయ సింగ్ బిగ్గరగా నవ్వి, "ఒకవేళ అవజ్ఞ వర్మ ఆ విడిది గృహాన్నుంచి బయటికి పారిపోజూస్తే, నీ అనుచరులు ఏం చేస్తారు?" అని అడిగాడు

మాహూ తన యజమానికేసి చూసి వూరుకున్నాడు

"ఏం మాహూ! నా ప్రశ్నకు జవాబు రాలేదే!" అన్నాడు జయసింగ్.

మాహూ యీసారి కనుబొమలు ముడిచి, అగ్నిపాలుడికేసి సాలోచనగా చూసి, తరవాత తల తిప్పి, జయసింగ్ కేసి సూటిగా చూస్తూ, "సర్దార్! ఈ ప్రశ్న యింతమంది ముందు అడగ వలసినదికాదంటున్నందుకు క్షమించండి అయినా, అడిగారుగనక చెపుతున్నాను. అవజ్ఞవర్మ ఆ విడిది గృహంలో—నా యజమాని సురక్షితంగా కారాగారం నుంచి బయటపడేవరకూ; నా బందీ! నా యజమానికి ఆ చీకటికొట్టునుంచి స్వేచ్ఛ లభించందే; అతనికీ ఆ విడిది గృహం

నుంచి స్వేచ్ఛ దొరకదు. కాదని అతడు బయటికి పోజూస్తే, నా అనుచరులనుంచి ఒక బాణం...లేక, ఒక కత్తివేటు... అంతే సర్దార్!" అన్నాడు గంభీరంగా.

## 22

చంద్రగిరిరాజ్యాధిపతియైన నవభోజ మహారాజు, మానుకోట పట్టణం ప్రవేశించాడన్న సూచనగా, శతఘ్నులు పట్టణం దద్దరిల్లేట్టు ప్రేలాయి

అగ్నిపాలుడు అంతకు కొంచెం ముందే నిద్రలేచి, స్నానం ముగించి, కొత్తదుస్తులు ధరిస్తున్నాడు మహారాజును దర్శించి, జరిగినదేమిటో విన్నవించుకునేందుకు జయసింగ్ చాలా ముందుగానే వెళ్ళిపోయాడు.

ఆ క్షణానో, మరుక్షణానో మహారాజునుంచి తనకు, ఆయన సన్నిధికి రావలసిందిగా వార్త వస్తుందని అగ్నిపాలుడు ఎదురుచూస్తున్నాడు. అంతలో వకుళమాలను గురించి అతడి మనస్సు క్షోభపడిపోతున్నది. తను అవజ్ఞవర్మతో పందెంవేసి, ప్రసేనుడి ఇంటికి బయలుదేరిన సంగతి, అవజ్ఞవర్మద్వారా వినటంవల్ల, వకుళమాలకు తప్పక తన ప్రేమగురించి ఏహ్యభావం కలిగి వుంటుంది. ఆ దుర్మార్గుడు తనను రాజద్రోహిగా ఋరితీయించే ప్రయత్నంలో విఫలుడైనా...... తన భవిష్యత్తును మాత్రం సర్వనాశనం చేయగలిగాడు. ఆ విధంగా అతడు జయించినట్టే! ఇంత జరిగింతరవాత వకుళమాల తన ప్రేమను అంగీకరించటంవల్ల, ఆమెలేని జీవితాన్ని తానెన్నాళ్ళు సాగించగలడు? ఆత్మహత్య? అది మహాపాపమేగాక; తనబోటి క్షత్రియుడు ఆలోచించదగింది కూడాకాదు. ఇక తను జీవితాంతం బ్రహ్మచారిగా వుండిపోవలసిందే!

వకుళమాల బహుశా తన స్వగృహం చేరివుంటుంది! తనలాగే, ఆమెకూడా అగ్నిపాలుడనే అహంకారి, మర్యాదహీనుడు......తన కన్నె మనసుకు కలిగించిన ఆఘాతాన్ని గురించి వ్యాకులపడుతూ వుంటుంది

"అయ్యా!" అన్న మాహూ పిలుపు అగ్నిపాలుణ్ణి విచారసాగరంలోనుంచి బయటపడవేసింది.

"మహారాజులుంగారు వార్తాహరుణ్ణి పంపారు; వారిసన్నిధికి వెంటనే బయలుదేరి రావలసిందిగా ఆజ్ఞ," అన్నాడు మాహూ.

అగ్నిపాలుడు వాకిట సిద్ధంగావున్న ఉత్తమాశ్వాన్ని అధిరోహించి, వెంట మాహూ, మరికొందరు సేవకులూ రాగా, నవభోజమహారాజు విడిది దిగిన భవనానికి వెళ్ళాడు.

నవభోజరాజు, అగ్నిపాలుణ్ణి అంత దూరాన చూస్తూనే చిరునవ్వు నవ్వాడు. ఆయన పక్కన అటూ యిటూ ఓబలరాజూ, జయసింగ్ నిలబడివున్నారు.

"అగ్నీ! నీవు క్షేమంగా వున్నందుకు

చాలా సంతోషం కలుగుతున్నది," అన్నాడు మహారాజు.

"కృతజ్ఞుణ్ణి మహారాజా!" అన్నాడు అగ్నిపాలుడు వినయంగా

"అవజ్ఞుడూ, నీవూ యింతకాలంగా నా ఆస్థానంలో వుంటున్నా...... మీరు జూదరులని మాత్రం తెలుసుకోలేక పోయాను. ఆ సంగతి, కొద్దికాలం కిందటే తెలిసింది!" అన్నాడు నవభోజుడు తాపీగా

అగ్నిపాలుడు తలదించుకున్నాడు

"జూదరులనూ, పందెగాళ్ళనూ ప్రేమించే క్షత్రియకన్యలుంటారని నాకు తెలియదు! పందెంలో నీవెంతవరకు సాధించావు, అగ్నీ?" అన్నాడు నవభోజుడు గంభీరంగా.

"మహారాజా! అవజ్ఞవర్మతో వాదుకు దిగి, యీ విధమైన పందెం వేయటంలో నేను చాలా తప్పుచేశాను. ప్రభువులు క్షమించాలి,'' అన్నాడు అగ్నిపాలుడు.

"ఆ అవజ్ఞవర్మ గురించి సర్వం జయసింగ్ ద్వారా విన్నాను అతడి సేవకుడు చెప్పినది కూడా విన్నాను ఓబలరాజువల్ల ఆ పందెం షరతులేమిటో తెలుసుకున్నాను. వాటిని అతడు అతిక్రమించటం ద్వారా, ఓడిపోయాడని నిర్ణయిస్తున్నాను. కాని, నువ్వు నా తీర్పు వినేవరకైనా ఆగవలసింది. తొందరపడి యీ లోపలే అతణ్ణి పుణ్యలోకాలకు పంపటం మాత్రం బావుండలేదు," అన్నాడు నవభోజుడు.

"క్షమించండి, మహారాజా! మీరనేదేమిటో..." అగ్నిపాలుడి ముఖంమీద ప్రస్ఫుటమైన ఆశ్చర్యభావానికి, నవభోజుడు కనుబొమలు చిట్లించి: "అగ్నీ! ఆ బైదిము నీదికాదా? వెన్నులో తగిలిన బాణం దెబ్బకు, అవజ్ఞవర్మ తన విడిది గృహం ముందున్న రాజమార్గం పక్కన విగతజీవుడై వుంటటం, నీకు తెలియదా? అని అడిగాడు.

"ప్రమాణంచేసి చెపుతున్నాను. అతడి మరణానికి నేను కారణభూతుణ్ణి కాదు, మహారాజా!" అన్నాడు అగ్నిపాలుడు సవినయంగా.

నవభోజుడు జయసింగ్‌కేసీ, ఓబలరాజుకేసీ చూశాడు. వారిలో ఏమాత్రం చలనంలేదు. కాని, నవభోజరాజు తల పక్కకు తిప్పుకోగానే, వారిద్దరి దృష్టి ద్వారం దగ్గిర నిలబడివున్న మాహూ మీదికి ప్రసరించింది అది గమనించిన మాహూ, అమాయకంగా వారికేసిచూసి, చిరునవ్వుతో తలవంచుకున్నాడు.

"ఇది ఆశ్చర్యంగా వుందే, అగ్నీ!'' అంటూ నవభోజుడు ఓ క్షణం ఆగి, ''అయినా దుష్టులకు శత్రుగణం లోటేముంటుంది?...అతణ్ణి రాజప్రతినిధిగా పంపటంలో పెద్దపొరబాటే జరిగింది." అన్నాడు స్వగతంలా.

అంతా నిశ్శబ్దంగా వూరుకున్నారు.

నవభోజుడు తిరిగి యిలా ప్రశ్నించాడు. "అగ్నీ! పందెం మాట మరిచిపోదాం. పోతే, ఆ ప్రసేనుడి కుమార్తెతో నీ ప్రేమకలాపం ఏ దశలో వున్నది?"

"ఆమెను మరోసారి కలుసుకొని మాట్లాడితేతప్ప... నేనేమీ చెప్పలేను, మహారాజా!' అన్నాడు అగ్నిపాలుడు నిర్వికారంగా

'ఆమెను, యిప్పటికీ నీవు హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నావా, అగ్నీ?" అన్నాడు నవభోజుడు

"అవును, మహారాజా!"

"ఒకరకంగా—యిది చాలా దుర దృష్టకరమైన సంగతి!" అన్నాడు నవ భోజుడు జాలిగా

అగ్నిపాలుడు నిశ్చేష్టుడయాడు

"నీ కాబోయే మామ... ప్రసేనుడు, రాజద్రోహి, అగ్నీ!" అన్నాడు నవ భోజుడు

అగ్నిపాలుడు ఆపాదమస్తకం కంపించాడు. "ఈసంగతి తమకు తెలియ పరచిన వారెవరు, మహారాజా?" అన్నాడతడు

"బేతాళవర్మ! బహుశా అతణ్ణి చూసే వుంటావు; ప్రసేనుడి బంధువు"

"మహారాజా! అతడు కపటి! వదరు బోతు. అతడి మాటలు నమ్మకండి," అన్నాడు అగ్నిపాలుడు ఉద్వేగంగా.

"అయితే, ప్రసేనుడు రాజభక్తి పరుడని నీవు మాటయిస్తున్నావా!" అన్నాడు నవభోజుడు, అగ్నిపాలుడి ముఖంకేసి తీక్షణంగా చూస్తూ

"మహారాజా! అతడు రాజభక్తుడూ కాదు, రాజద్రోహీకాదు. అంతవరకూ నేను వాగ్దానం చేయగలను" అన్నాడు అగ్నిపాలుడు.

"అతడు రాజద్రోహి అని సాక్ష్యం వుంటే?"

"అతడు తమమీద ఏనాడూ కత్తి కట్టలేదు, మహారాజా!" అన్నాడు అగ్నిపాలుడు.

"కత్తికట్టినవారికి సహాయపడ్డాడు."

"క్షమించాలి,మహారాజా. ఏవిధంగా?"

"ఆశ్రయం యివ్వటం ద్వారా."

"ఆ మాట నమ్మకండి, మహారాజా! ఈ కల్లలు ప్రచారంచేసే బేతాళవర్మే, శత్రుపక్షంలోనివాడని నేను రుజువుచేయ గలను!" అన్నాడు అగ్నిపాలుడు నిబ్బరంగా.

"నిజమా, అగ్నీ?" అన్నాడు నవ భోజుడు ఆశ్చర్యపోతూ.

"నిజం మహారాజా! ప్రసేనుడు తన కుమార్తెను, యితడికివ్వ నిరాక రించాడు అంతేకాక, ఆమె నన్ను ప్రేమిస్తున్నట్టు, యీబేతాళవర్మ గ్రహిం చాడు ప్రసేనుడిపై అతడి పగకు కారణం అది!" అన్నాడు అగ్నిపాలుడు.

నవభోజుడు తలపైకెత్తి కొంచెంసేపు ఆలోచించి, ప్రసన్నవదనంతో, "అగ్నీ! అయితే నీవు వెంటనే బయలుదేరివెళ్లటం

మంచిది. ప్రసేనుణ్ణి రాజద్రోహిగా బంధించి పట్టుకువచ్చేందుకు,బేతాళవర్మ వెళ్ళాడు. నీకు ఆజ్ఞాపత్రం యిస్తున్నాను ప్రసేనుణ్ణి బంధితుడుగామాత్రం నా వద్దకు తేనవసరంలేదు కాని..."అంటూ నవభోజుడు ఆగాడు

"మహారాజా!" అన్నాడు అగ్ని పాలుడు ఆందోళనపడుతూ.

"ఆ ప్రసేనుడికి తను హైహయ వంశస్థుణ్ణనే మితిమీరిన గర్వం వున్నది నా పరిపాలనలో అతడేనాడూ చంద్రగిరి నగరానికివచ్చి,నాకు ప్రణమిల్లినదిలేదు నువు చెపుతున్నట్టు—నిజంగా అతడు రాజ ద్రోహి కాకపోతే; అతడిక్కడికి వచ్చి, నా సింహాసనం పక్కన...కొద్ది క్షణాల పాటైనా చేతులు కట్టుకుని నిల బడాలి ఆపాటి సామంతులమర్యాదనైనా, అతడు పాటించగలడా" అన్నాడు నవభోజుడు కొంచెం తీవ్రస్వరంతో.

"చంద్రగిరి మహారాజులకు, అతడు సామంతుడే గదా, మహారాజా! ఆపాటి గౌరవ మర్యాదలు అతడికి ఎందుకు తెలియవు!" అన్నాడు అగ్నిపాలుడు, ఎంతో వినయంగా

"ప్రయత్నించు ... ..చూద్దాం!" అన్నాడు నవభోజుడు.

## 23

ఆయుధపాణులై గుర్రాలెక్కి బయలుదేరేదుకు సిద్ధంగావున్న తన సేవకులకేసి అగ్నిపాలుడు ఓసారి పరీక్షగా చూశాడు. మాహూతో కలిసి— వాళ్ళు పదిహేనుమంది. వాళ్ళలో ఎనిమిదిమందివరకూ, ఏ పరిస్థితులలోనైనా ప్రాణాలకుతెగించి, తుదివరకూ పోరాడ గలిగినట్టి యోధులు తతిమ్మావాళ్లలో ముగ్గురు వయసుమీరినవాళ్ళు; యిద్దరు వంటమనుషులు, యిద్దరు బండి తోలే వాళ్లు; వీళ్ళమీద అంత నమ్మకం పెట్టుకునేందుకు వీలులేదు

బహుశా, బేతాళవర్మతో పోరుకు దిగవలసిన అవసరం కలగకపోవచ్చు. కాని, అతడి వెంటవుండే సైనికుల మాటేమిటి?" అనుకున్నాడు అగ్ని పాలుడు.

అతడి దగ్గిర ప్రసేనుడిని . ఒకవేళ ఆసరికే బేతాళవర్మ అతణ్ణి బందీగా పట్టుకునివుంటే, విడిపించేందుకు అవసరం అయిన రాజాజ్ఞాపత్రం వున్నది. కాని, ఎంతో తప్పనిసరి అయితేతప్ప, బేతాళవర్మకు చూపించరాదని అగ్ని పాలుడు నిశ్చయించుకున్నాడు. సాధ్యమైతే తన సేవకులచేతనే బేతాళవర్మకు ప్రసేనుడి సమక్షంలో అవమానం జరిపించాలి......

అగ్నిపాలుడు తన సేవకులకు బయలుదేరవలసిందిగా ఆజ్ఞయిచ్చి, తన గుర్రంమీద ముందుండి దారితీశాడు. తను ఎక్కడా ఆగకుండా ప్రయాణించితే, సాయంత్రం నాలుగుగంటల ప్రాంతాల ప్రసేనుడిగృహం చేరగలడు.

ప్రస్తుత విషమపరిస్థితులదృష్ట్యా, తను ఎంత త్వరగా వెళ్ళగలిగితే, అంత మంచిదని అగ్నిపాలుడు నిర్ణయించుకున్నాడు

అనుకున్నదానికంటే వేగంగానే అగ్నిపాలుడి ప్రయాణం సాగింది. దారిలో—బాగా మిట్టమధ్యాహ్నపువేళ, ఒక అరగంటకాలం మాత్రం హిరణ్యపురంలో గడిపి, సూర్యుడు పడమటి దిక్కుకు వాలుతూండగా, అతను ప్రసేనుడి భవనానికి మూపుమేర దూరంలోకి వచ్చాడు.

భవనం చుట్టూవున్న ఎత్తయిన ప్రహరీ గోడల వెలుపలగాని, నదీ తీరానగాని ఎవరూలేరు. కాని, అగ్నిపాలుడు నదివైపుకు వున్న ప్రహరీ గోడను చుట్టి ముఖద్వారంకేసి వచ్చేసరికి భవన ప్రాంగణంలోనుంచి మనుషుల కేకలూ, గుర్రాలసకిలింపులూ వినబడినై. అతడు తన గుర్రాన్ని గట్టిగా అదిలించి ప్రహరీగోడలోని ప్రధాన ద్వారాన్ని దాటి, భవనప్రాంగణంలోప్రవేశించాడు.

భవనం ముందున్న ఖాళీప్రదేశంలో రెండు గుర్రాలు పూన్చిన బండీ ఒకటి ప్రయాణానికి సిద్ధంగావుంది దానికి ఒక పక్కగా ప్రసేనుడూ, ఆయన భార్య చంద్రాదేవీ నిలబడివున్నారు బేతాళవర్మ ప్రసేనుడికి అంతదూరంలో గుర్రంమీద కూర్చుని, చేతులనుతీవ్రంగా గాలిలోకి ఊపుతూ, పెద్దగా మాట్లాడుతున్నాడు. కొంచెం పక్కగా ఇరవై మంది సైనికులు, ఇదేమీ మాకు సంబంధించినది కాదన్నట్టు, ఆ దృశ్యంకేసి చూస్తూ నిలబడివున్నారు.

" ప్రసేన్ నీ పరుషవాక్యాలూ, ఈసడింపులూ యిక చాలు, రాజాజ్ఞ! బండీ ఎక్కుతావా లేదా? నీతోపాటు నీ భార్యకూడా ఖైదీగా రాదలిస్తే — నా అభ్యంతరం ఏమీలేదు," అని అరుస్తున్నాడు బేతాళవర్మ

ఆ మాటలు వింటూనే అగ్నిపాలుడికి విపరీతమైన కోపం వచ్చింది అతడు గుర్రాన్ని వేగంగా బేతాళవర్మ దగ్గిరకు పరిగెత్తిస్తూ, "వర్మా! నువ్వెనాటినుంచి నీ రాజద్రోహానికి స్వస్తిచెప్పి రాజభక్తుడివయ్యావు?" అన్నాడు తీవ్రంగా.

ఆ మాటలూ, అంతలోనే వేగంగా తనను సమీపిస్తున్న అగ్నిపాలుడూ—తన దృష్టిపథంలోకి వచ్చేసరికి, బేతాళవర్మ నిలువునా నీరయిపోయాడు. అతడి ముఖంమీద స్పష్టంగా భయచిహ్నాలు కనిపించినై. అతడు పక్కకు తలతిప్పి తనకు సహాయంగా వెంటవచ్చిన సైనికులకేసి చూశాడు. దానితో అతడిగుండె దడ కొంచెం తగ్గినట్టయింది.

"ఎవరూ, విష్ణుమిత్రుడా?' 'అన్నాడు బేతాళవర్మ, చిరునవ్వు నవ్వేందుకు సతమతమవుతూ.

"వర్మా! విష్ణుమిత్రుణ్ణికాదు, అగ్నిపాలుణ్ణి! ఆ సంగతి నిన్ననే నీకు తెలిసి



వుండాలే? సరే, ప్రస్తుతానికి ఆ సంగతి వదిలేద్దాం. రాజద్రోహివైన నీకు, ఈ ప్రసేనుడితోవచ్చినపనేమిటి?'' అన్నాడు అగ్నిపాలుడు.

"ఎవరు రాజద్రోహి?'' అన్నాడు బేతాళవర్మ కోపంతో నిలువెల్లాకంపించి పోతూ.

"మరొకమారు చెపుతున్నాను. రాజద్రోహివి, నీవే! కాలభోజుడి పక్షానచేరి, నువ్వు చేసిన రాజద్రోహం నాకు తెలియందికాదు," అన్నాడు అగ్నిపాలుడు కఠినంగా.

"ఇది నన్ను అవమానించటం! చాతనైతే ద్వంద యుద్ధానికి రావొచ్చు," అన్నాడు బేతాళవర్మ కత్తిదూస్తూ.

''వర్మా! నువ్వు నా చేతుల్లో చావదలుస్తున్నట్టున్నది. కాని. ఆ గౌరవం నీ కివ్వలేను. జగ్గరాజువంటి వీరులను తుండేలుగా నరికిన నా కత్తి నీ బోటి బంధుద్రోహుల, పిరికిపందల రక్తాన్ని చవిచూడటానికి అంగీకరించదు," అని "మాహూ!" అంటూ వెనుదిరిగి కేక వేశాడు అగ్నిపాలుడు

''ప్రభూ!'' మాహూ కత్తిదూసి, తన గుర్రాన్ని బేతాళవర్మకేసి నడప బోయాడు. కాని, యీ లోపలే...కనురెప్పపాటు కాలంలో బేతాళవర్మ తన గుర్రాన్నిగట్టిగాడొక్కల్లోపొడవటంతో, అది సకిలిస్తూ వెనకకాళ్ళమీద పైకిలేచి, వెంటనే ఒక్కదూకున ప్రహరీగోడ ద్వారంకేసి మెరుపులా పరిగెత్తింది.

''పట్టుకోండి!'' అంటూ అగ్నిపాలుడు తన సేవకులకేసి చూసి, ''ఈ బేతాళవర్మ, చంద్రగిరి రాజ్యంలో సజీవుడుగా వుండేందుకు వీలులేదు. అతణ్ణి వెంబడించండి!'' అన్నాడు

ఇద్దరు సేవకులు తమ గుర్రాలను అదిలించి, బేతాళవర్మ వెంటపడ్డారు.

హఠాత్తుగా జరిగిపోయిన యీసంఘటన అందరినీ నిశ్చేష్టుల్ని చేసింది. ఒకటి రెండు క్షణాలాగి అగ్నిపాలుడు సైనికులకేసి తిరిగి, "ఈ బేతాళవర్మ మహారాజుతో, రాజాప్రసేనుడిపై చాడీలు చెప్పి, యీాయనను బందీగా పట్టుకునేందుకు మిమ్మల్ని వెంటపెట్టుకువచ్చాడు. నువ్వే రాజద్రోహివి, అని నేననగానే ఆ పారుబోతు పారిపోయినతీరు చూశారు గదా," అన్నాడు.

సైనికులందరూ తలలు వంచి అగ్నిపాలుడికి నమస్కరించారు. అగ్నిపాలుడు, ప్రసేనుడికేసి రెండడుగులు వేసి, 'రాజాప్రసేన్! ఈ జరిగిన అవమానానికి, నేను చాలా విచారిస్తున్నాను. ఇదంతా బేతాళవర్మ పన్నిన పన్నాగం ఆఖరిక్షణంలో నా చేతనైన సాయం మీకు చేశాను," అన్నాడు.

"చాలా కృతజ్ఞుణ్ణి. నీకెంతో రుణపడివున్నాను. అగ్నిపాల్!" అన్నాడు ప్రసేనుడు గాదద్గికంగా.

అగ్నిపాలుడు ప్రసేనుడికేసిపరీక్షగా ఓ క్షణకాలంచూసి, "ఈ మాటలు మర్యాదకోసం అంటున్నారా, లేక నిజంగానే నాకు రుణపడి వున్నట్టు భావిస్తున్నారా, ప్రసేన్?" అంటూ చంద్రాదేవికేసి తలఎత్తి చూశాడు. ఆమె కళ్ళలో అశ్రుబిందువులు తొణికిసలాడినై.

"మర్యాదకోసం అన్న మాటకాదు, అగ్నిపాల్. నిజంగా నీ రుణం తీర్చలేనిది," అన్నాడు ప్రసేనుడు.

"రుణవిముక్తికి మార్గం చెబుతాను, అంగీకరిస్తారా?" అంటూ అగ్నిపాలుడు చిరునవ్వు నవ్వాడు.

"అంతకన్న కావలసినదేమిటి?" అన్నాడు ప్రసేనుడు.

అగ్నిపాలుడు ప్రసేనుడికి మరింత దగ్గిరగా జరిగి, రహస్యం చెబుతున్న ధోరణిలో, "రాజాప్రసేన్! నా మాట నమ్మండి. నవభోజరాజుతో అన్ని సంగతులూ మాట్లాడాను. ఆయనకు ఏకోశానా మిమ్ములను అవమానించాలనిలేదు. మీరు కనీస రాచమర్యాదల దృష్ట్యా అయినా, ఆ మహారాజును ఒకసారి ఎందుకు దర్శించకూడదు?" అన్నాడు.

ప్రసేనుడు తలవంచుకుని కొద్దిసేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత తల ఎత్తి, ఎంతో ప్రశాంతంగా, "అగ్నిపాల్ నేనిప్పుడే బయలుదేరి నవభోజరాజుల దర్శనం చేసుకుంటాను. చంపదగిన శత్రువని తెలిసీ, ఆయన క్షమించారని నాకు అర్థమైంది. అంతకన్న ఉదాత్తత ముంటుంది," అన్నాడు.

"అలా అయితే నే వచ్చినపని నెరవేరింది, శెలవు!" అంటూ అగ్నిపాలుడు తన గుర్రం దగ్గిరకు వెళ్ళి, కళ్ళాలు అందుకోబోయి ఆగి, "వకుళమాల... మీ కుమార్తెకు నా నమస్కారాలు చెప్పండి," అన్నాడు.



"అగ్నిపాల్, నీ ప్రవర్తన నా కర్థం కావటంలేదు. నీవు మా ఇంటవున్న రోజుల్లో, మీరిద్దరూ అంతగా కలిసి మెలసి తిరిగేవారు గదా, ఇప్పుడు ఏం జరిగింది? ఆ నమస్కారాలు వకుళకు మరెవరో అందించవలసిన అవసరం ఏమిటి?'' అన్నాడు ప్రసేనుడు

చంద్రాదేవి అగ్నిపాలుడి ముఖం లోకి ఆశ్చర్యంగా చూసింది.

అగ్నిపాలుడు ఓ క్షణకాలం ఎటూ నిర్ణయించుకోలేక తటపటాయించి, చివరకు ఒక గట్టి నిశ్చయానికి వచ్చిన వాడిలా తలఊపి, "రాజా ప్రసేన్! అవజ్ఞవర్మ దుశ్చర్యల కారణంవల్ల, వకుళమాల నా విషయంలో కొన్ని అపోహలకు గురిఅయింది. వాటిని తొలగించే ప్రయత్నం అప్పట్లో నేను చేయలేకపోయాను. ఇప్పుడైనా నా సాధ్యం అనుకోను. కాని, ఒకసారి ఆమెనుచూసి పలకరించి, నా దారిన నేను పోతాను," అన్నాడు.

ప్రసేనుడూ, చంద్రాదేవి ఎక్కడలేని ఆశ్చర్యంతో ముఖముఖాలు చూసుకున్నారు. ప్రసేనుడికి ఏం అనాలో తోచిందికాదు. చంద్రాదేవి భవనంకేసి చేయి చూపుతూ, ''అమ్మాయి పైఅంతస్తులో తన గడిలో వున్నది," అన్నది.

అగ్నిపాలుడు మారు మాట్లాడకుండా భవనంలోకిపోయి, మెట్లెక్కి పైఅంతస్తు చేరేసరికి, వకుళమాల పిట్టగోడనానుకుని, దూరంగావున్న నదికేసి చూస్తూ కనిపించింది. అగ్నిపాలుడి పాదాల

చప్పుడు వినికూడా, ఆమె తల తిప్పి చూడలేదు.

"వకుళా!" అని పిలిచాడు. అగ్నిపాలుడు అతడి గొంతు వణికింది. ఆమె మాట్లాడలేదు, తిరిగి చూడనూలేదు

"వకుళా! నా ముఖం చూడటం కూడా నీకు బాధాకరం అవుతుందని, నే ననుకోలేదు నేనెవరినో, నీవు గ్రహించకముందే, యీ ఇంటినుంచి వెళ్ళిపోయి అవజ్ఞవర్మతో నా ఓటమిని ఒప్పుకుని, నా ఆస్తి పాస్తులు అతడిపరంచేసి, నిష్కల్మషహృదయంతో నీ దగ్గిరకు తిరిగి వచ్చి—నిన్ను ప్రేమభిక్ష అడగాలనుకున్నాను. అలా జరిగివుంటే, బహుశా నా ప్రేమను నీవు శంకించివుండేదానవు కాదు. కాని, నా దురదృష్టంకొద్దీ, నేను బయలుదేరి వెళదామనుకున్న రోజునే బందీని కావటం—అవజ్ఞవర్మ నాకన్న ముందుగా నీకు పందెం సంగతి చెప్పటం...... వీటన్నిటివల్లా, నేను నీ దృష్టిలో నీచాతి నీచుణ్ణయిపోయాను. ఆ సంగతి నాకు తెలుసు! సరే, జరిగిన దేదో జరిగిపోయింది. జీవితాంతంవరకూ, నా దురదృష్టానికి చింతిస్తూ కాలం వెళ్ళబుచ్చటంతప్ప, నాకు మరోమార్గంలేదు. సెలవు!'' అంటూ అగ్నిపాలుడు వెను దిరిగి, మెట్లకేసి నడిచాడు.

రెండు మూడు మెట్లు దిగేంతలో అగ్నిపాలుడికి వెనక చిన్న సవ్వడి వినిపించింది. అతడు తలతిప్పి చూసేసరికి తనకేసి వస్తున్న వకుళమాల కంట బడింది.

''వకుళా!" అంటూ అగ్నిపాలుడు చేతులు చాచాడు.

"అగ్నీ!" అంటూనే వకుళమాల వేగంగా వచ్చి, అతడి చేతుల్లో ఒరిగి పోయింది.

—సమాప్తము






**ఆ**మెని ఒక బంధువుల యింట్లో చూడడం తటస్థించింది. లేత పసుపు రంగు వాయిల్ చీర కట్టుకుని, కడిగిన ముత్యంలా మెరుస్తోంది. మనిషిని చూడగానే ఆకట్టుకునే ఆకర్షణ ఏదో వుంది. జుత్తు దువ్వుకోవడంలో చీర ధరించడంలో, పొందికగా కూర్చోడంలో - ప్రతివిషయంలో ఓ అందం కనిపిస్తోంది, ఆమె చేతివేళ్లు సన్నగా. పొడుగ్గా వున్నాయి. గోళ్లు గుండ్రంగా కత్తిరించి పగడాలు పొదిగినట్లు మెరుస్తున్నాయి.

ఆమె పేరు మధు. చాలా తెలివైనదని పేరు. ఆ ఏడాదే ఎమ్. ఎ. డిగ్రీ పుచ్చుకుంది. యూనివర్సిటీలో ప్రథమ శ్రేణిలో వచ్చి బంగారుపతకం తెచ్చుకుంది.

మధు అంటే నేను యిష్టపడ్డాను.

అన్నివిధాలా అనువైన సంబంధమని మా వాళ్ళు ఒప్పుకున్నారు.

నేను ఇంజినీరింగ్ పాసై, జూనియర్ ఇంజనీర్‌గా పని చేస్తున్నాను. ఉద్యోగంలో పైకి వచ్చే అవకాశాలు వున్నాయి. కుటుంబ బాధ్యతలు లేవు. అందుకని మా పెళ్ళికి ఆడపెళ్ళివారి వద్దనించీ ఏ అభియోగం లేకపోయింది.

మధూకీ, నాకూ వివాహం జరిగింది. పదిరోజులు యిట్టే పెళ్ళి హడావిడిలో గడిచిపోయాయి మధూని తీసుకుని ఒంటరిగా శాంతానగర్ వచ్చేసాను.

కాపరం పెట్టగానే మా అసలు జీవితం ప్రారంభమైంది. రైలు దిగి యిల్లు చూస్తూనే ముఖం చిట్లించింది మధు. ఇల్లు చిన్నదనికాదు. ఇల్లంతా గలీజుగా వుందట. అప్పటికీ నేను ముందుగా వుత్తరం రాస్తే నా స్నేహితుడు యిల్లు తుడిపించి, కడిగించి పెట్టాడు

"ఎంత ఘోరంగా వుంది ప్రకాశ్!" అంది మధు.

"బ్రహ్మచారి కొంప యింతకంటె బాగా ఎలా వుంటుంది? అయినా నా కళ్ళకి బాగానేవుంది. బెనర్జీ తుడిపించాడు కదా!"

"నీ కళ్ళకి బాగుందా? నా మట్టుకు నాకు ఎన్ని రోజులు శుభ్రంచేస్తే బాగుపడుతుందో తెలియటంలేదు"

"ఇవాళేం పెట్టుకోకు. స్నానం చేసిరా. బెనర్జీ భోజనానికి పిలిచాడు. వెళ్ళాలి. ఎదురు చూస్తూవుంటారు."

"స్నానం ఎలా చెయ్యను ప్రకాశ్? ముందరీ యింటిపని చూసిన తర్వాతే తక్కినవి" అంది, చేతిలో హేండ్ బాగ్ అల్మారాలో పెడుతూ... నాకే ఆశ్చర్యంవేసింది. ఇంతట్లోనే నాకు వంటా, పనీ చేసిపెట్టే పనికుర్రాడు హనుమాన్ వచ్చాడు.

"హనుమాన్ చేస్తాడులే నువ్వు స్నానం చెయ్యి మధూ," అన్నాను.

"అబ్బే, వాడితో లాభంలేదు ఈ యిల్లు చూస్తూంటే నాకు తేళ్ళూ, జెర్రెలూ పాకినట్లు వుంది. భోజనం చేసి వచ్చి, యీ యింట్లో ఎలా కూచుంటాం? నువ్వెళ్ళి భోజనం చేసిరా ప్రకాశ్" చీర పైకి కట్టింది మధూ.

"నువ్వు రాకపోతే బెనర్జీ భార్య నొచ్చుకుంటుంది. తప్పు పట్టుకుంటారు."

"అయామ్ సారి." మధు తన పనిలో నిమగ్నమయింది

నాకు కోపం వచ్చింది ఏం చెయ్యాలో తెలియలేదు. క్రొత్తపెళ్ళి కూతురు. బాగా పరిచయంలేదు. చిన్నపిల్ల కాదు, అదమాయించడానికి. నాతో సమంగా చదువు

కున్నది. వ్యక్తిత్వమున్న మనిషి. అలా ప్రవర్తిస్తూంటే ఏంచెయ్యను? క్రొత్త కాపరం యిలా మొదలైందని బాధపడుతూ, స్నానంచేసి, బెనర్జీ యింటికి వెళ్ళాను.

"ఆవిడకి ఒంట్లో బాగాలేదు" అని అబద్ధం చెప్పి, బెనర్జీ దగ్గిర తప్పించు కున్నాను. బెనర్జీ భార్య భోజనం అంతా కారియర్‌లో పెట్టి యిస్తే యింటికి తీసుకువచ్చా.

మధు తడిగుడ్డతో కుర్చీలు, టేబిల్స్ తుడుస్తోంది, హనుమాన్ తలుపులూ, ద్వారబంధాలూ తుడుస్తున్నాడు.

"మధూ, యింకా అలాగే వున్నావా? భోజనం తెచ్చాను."

"వంటింట్లో పెట్టు." మధు తల ఎత్త లేదు

నేను స్కూటర్ తీసుకుని వూళ్ళోకి వెళ్లాను. తిరిగి వచ్చేసరికి సాయంత్ర మయింది. ఇంటికి రాగానే నా చిరాకంతా పటాపంచలైంది

ఇల్లు నీట్‌గా సర్దివుంది. తలుపులూ, కుర్చీలు, ప్రతి వస్తువూ పాలిష్ చేసి నట్టు మెరుస్తున్నాయి ఏదో అద్భుత మాయ పాత యింటిని క్రొత్త యిల్లుగా మార్చేసినట్టుంది. మధు శక్తిని లోలోపలే అభినందించకుండా వుండ లేకపోయాను.

తెల్లటి చీర కట్టుకుని, ఫాన్ క్రింద కుర్చీలో కూర్చుని పేపరు చదువుతోంది మధు. ఆమె తడిజుట్టులోంచి షాంపూ వాసనలు వ్యాపిస్తున్నాయి. వెళ్ళి మధు బుగ్గమీద ముద్దుపెట్టుకున్నా.

"ఓహ్ బయటినించి తిన్నగా వచ్చి యీ పనేమిటి? కాళ్ళూ, చేతులూ కడుక్కున్నావా?" బుగ్గ రుమాలుతో తుడుచుకుంది మధు

"సారీ"

బూట్లు విప్పి, బట్టలు మార్చుకుని, బాత్‌రూమ్‌లోకివెళ్ళి కాళ్ళూ, చేతులూ కడుక్కుని వచ్చా.

"ఇప్పుడు ముట్టుకోవచ్చా?" మధు ప్రక్కనే కూర్చున్నా.

"సరే లే! బూట్లు యిక్కడేనేంటి విప్పుకోడం? జోళ్ళ స్టాండ్‌లో పెట్టు కోవాలి"

"హనుమాన్ పెడతాడులే"

"వాడు వచ్చేదాకా యిలాగే వుంటాయి."

"హనుమాన్ - టీ" అని కేకేసి, పేపరు చూస్తూ కూర్చున్నా.

"వాడు లేడు. నేను టీ పెడతాను."

"ఎక్కడి కెళ్ళాడు?"

"స్నానంచేసి బట్టలు మార్చుకుని రమ్మని నేనే పంపాను"

"ఇంక యివాళ్టికి వాడు వచ్చినట్టే. పనివాళ్ళని మధ్యలో ఎప్పుడూ యింటికి పంపకూడదు మధూ."

"వాడు రాకపోతే నేనేచేసుకుంటా. కుళ్ళుబట్టలూ, వాడూ. చూస్తే

దోకొస్తున్నాడు" మధు వంటింట్లోకి వెళ్ళింది.

ఆ రోజే కాదు, హన్‌మాన్ బట్టలు కుళ్ళుగా వుంటాయని రోజూ విసుక్కునేది మధూ. సబ్బు యిచ్చి, వాణ్ణి బట్టలు వుతుక్కుని స్నానం చేసి రమ్మనేది. సబ్బులు మాయం అయ్యేవి. వాడు మట్టికొట్టుకునే వుండే వాడు. హనుమాన్‌ని వంటింట్లోకి రాని చ్చేదికాదు మధు. బయట పనే కాని రోజంతా యిల్లు తుడుస్తూ, తడిగుడ్డతో వత్తుతూ వుండేవాడు హనుమాన్. వాడు బట్టలు వుతికితే పనికిరాదు. ఆమె మళ్ళీ వుతుక్కునేది.

మధుకి యిష్టమైన పనులు రెండు. ఇల్లు సర్దడం, పేపరు, పుస్తకాలు చదవడం. ఏ పని చేసినా, మనసంతా దానిమీదే కేంద్రీకరించేది

పెళ్ళైన క్రొత్త రోజులే ఓ సెలవు రోజు మా యింటికి అతిధులు వచ్చారు. వాళ్ళు భోజనంచేసి వెళ్ళారు.

రోజంతా సరదాగా గడిచి పోయింది. ఎవరు వచ్చినా యింటినీ, మధూనీ, ఆమె వంటనీ మెచ్చు కోకుండా వుండలేరు. ఆమెతో మాట్లాడిన మగవాళ్ళు ఆమె తెలివి తేటలనీ, ప్రపంచజ్ఞానాన్నీ గమనించ కుండా వుండలేరు. వారి కళ్ళలో కనపడే మెచ్చికోలు చూసి నాకు చాలా గర్వంగా వుండేది. ఆ రోజూ భోజనం బాగుంది అతిధులు వెళ్ళేసరికి రాత్రి పదిదాటింది. హనుమాన్ సహాయంతో గిన్నెలూ, గదీ శుభ్రంచేయించి వచ్చింది మధు.

అలసిపోయి వున్నాం. దినపత్రిక పట్టుకుని పడుకుంది మధూ.

"లైటార్పేయనా ?" అన్నాను.

"వద్దు. ఇవాల్టి పేపరు చూడాలి."

"రేపు చూడకూడదా ?"

"వుహుఁ. పేపర్ చదవకపోతే నిద్దరపట్టదు నాకు "

ఆవిడ పేపరు చదవడం అంటే నాకు తెలుసు. మొదటి పేజీనించి ఆఖరి పేజీలో ఆఖరు లైన్‌దాకా చదవాలి ఎంతసేపు మేలుకోను ? నాకేమో యీ రోజు వచ్చిన అతిధుల గురించీ వంటల గురించీ, వాళ్ళు మెచ్చుకోడం, అన్నీ పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ పడుకోవాలని సరదా. కాని మధూతో లాభంలేదు. తన నిర్ణయాలకి తిరుగులేదు. ఈ కొద్ది రోజులలోనే ఆ సంగతి గ్రహించాం.

"ప్రకాశ్, నువ్వు పడుకో. నేను ముందుగదిలో కూర్చుని చదువు కుంటా. గుడ్‌నైట్" మధు లైటార్పి వెళ్ళిపోయింది.

మా యిద్దరి మధ్యా నలుగుతున్న మరో విషయం – సిగరెట్లు, నాలుగేళ్ళ బ్రహ్మచారి జీవితంలో ధూమపానం బాగా అలవాటైంది

నాకు మధుకి నేను సిగరెట్టు కాల్చడం యిష్టం వుండదు. ఆమెకి సిగరెట్టు వాసన పడదు అంటుంది నన్ను దగ్గిరకి చేరనివ్వదు.

ఆమె సాన్నిధ్యం కోసమని యింట్లో నేను సిగరెట్లు కాల్చడం మానుకున్నా కాని ఆఫీసులో సిగరెట్టు లేకపోతే పని జరగదు. మెదడు పనిచెయ్యదు

ఇంటికి రాగానే బట్టలు మార్చుకుని, స్నానాల గదిలోకి వెళ్ళి, పళ్ళు తోముకోడం అలవాటు చేసుకున్నా, ఎప్పుడేనా బద్ధికించి పళ్ళు తోముకోక పోతే, "అబ్బ, వాసన ప్రకాశ్" అంటుంది మధు, ముక్కుకు రుమాలు అడ్డంపెట్టుకుంటూ. తాగి వచ్చిన వాడి తంతు అయ్యేది నా పని. ఆమెకి జవాబు చెప్పలేని నా మెత్తదనం మీద నాకే కోపం వచ్చేది.

"అవునులే మధూ, నువ్వెన్నైనా చెప్పగలవ్. నీకు చెడ్డఅలవాట్లు లేవు. మానుకోవాలనే బాధాలేదు ఒక్కసారి మారిపోవాలంటే ఎంత కష్టమో నీకెలా తెలుస్తుంది?"

"విల్ పవర్ వుంటే ఏదైనా సాధించవచ్చు."

"సిగరెట్లు కాల్చడంవల్ల అన్నీ నష్టాలే డబ్బూ, ఆరోగ్యం— ఒప్పుకుంటావా?" మధూ రెట్టించింది.

"అన్నీ ఒప్పుకుంటా. కాని నేను అలవాటుకి బందీని. పొమ్మంటే ఎలా పోతుంది?"

"నీ కోసం నేనేమైనా మానెయ్యనా!" అంది మధూ, సీరియస్‌గా ముఖంపెట్టి

"నువ్వేం మానేస్తావ్?"

"వారానికి ఒకరోజు భోజనం మానేస్తా. శనివారం వుపవాసముంటా."

"నువ్వు వుపవాసం చేస్తే నా కొచ్చే లాభం ఏంటి?"

"ఇన్‌స్పిరేషన్. భోజనం మానేసి నేను వుండగిలిగనప్పుడు నువ్వు సిగరెట్లు మానేసి వుండలేవా?"

ఆమెతో ఏం వాదించను? నాకు ఏ చెడ్డ అలవాటూ లేకుండా మంచి వాడిగా చేసెయ్యాలని ఆమెకు ఎందుకంత తపన? ఏమిటా పంతం?

మధు అన్నట్టే శనివారాలు భోజనం మానేసి వుపవాసాలు ప్రారంభించింది. నాకు తల గోడకేసి కొట్టుకోవాలనిపించింది. ఆమె అంత సులభంగా భోజనం ఎలా మానేసి కటిక వుపవాసం చెయ్యగలదో అంతుపట్టని విషయం నాకు సిగరెట్లు మానేస్తే పిచ్చెత్తినట్టు వుంటోంది

మేం యింకా కాపరంలో స్థిరపడనే లేదు. మూడో మెంబరు మా జీవితాల్లో ప్రవేశించాడు.

నెలలు నిండుతున్నకొద్దీ మధు

అందం యినుమడించింది. ఆమె బుగ్గలలో నునువూ, ఆమె కళ్ళలో కాంతీ, నన్ను సమ్మోహితుడిని చేసేవి.

అయితే ఆమె చాదస్తం కూడా రోజు రోజుకూ పెరిగింది ఇంటి శుభ్రం, బట్టల శుభ్రం అంటూ యిటు నన్నూ, అటు హనుమాన్నీ వేధించేది కట్టుకున్నవాడిని, నాకు వేరేదారిలేదు. ఆమె ఆనందంకోసం మధుకి యిష్ట ప్రకారమే చేసేవాడిని కాని డబ్బుకి పనిచేసే హనుమాన్‌కి ఆ అవసరం లేదు మధుకి ఆరు నెలలు నిండుతున్నా యనగా వాడు మా యింట్లో పని మానుకున్నాడు.

ఒంటరిగా ఆ పరిస్థితిలో పనిచేసుకోలేదని మధుని పుట్టింటికి పంపేను. ఆమెని రైలెక్కిస్తూ "నువ్వు వచ్చేదాకా క్షణం ఒక యుగంగా గడుపుతా మధూ" అన్నాను ఆమె తియ్యగా నవ్వింది ఇంటికి ఒక్కడినీ వెళ్ళాలంటే బాధగా అనిపించింది. స్నేహితులతో సాయంత్రందాకా గడిపి, రాత్రి హోటల్లో భోజనంచేసి, యింటికి వచ్చా.

రాత్రి యింట్లో ఒంటరిగా కూర్చుంటే ఏవేవో ఆలోచనలు వచ్చాయి ఈ ఏడాదిలో యిల్లెంతో మారిపోయింది. డ్రాయింగ్ రూమ్ లోకి కార్పెట్టు వచ్చింది, కిటికీలకి, గుమ్మాలకి అందమైన డిజైనులతో వున్న తెరలు అమిరాయి. పుస్తకాలూ, పేపర్లూ- ప్రతి చిన్న వస్తువూ పొందికగా సర్ది పెట్టి వున్నాయి, ఎక్కడా ఒక్క మరక కాని, మచ్చ కాని లేదు పడకగదిలో పరుపుల మీద మల్లెపూవుల లాంటి తెల్లటి దుప్పట్లు వున్నాయి. ఆ పరుపులు ఎప్పుడూ ఆహ్వానిస్తున్నట్టే వుంటాయి. మధు ఏ పని చేసినా అద్భుతంగా చేస్తుంది

సోఫామీద దిండు వేసుకుని, కూర్చున్ని, బూట్లేనా విప్పని కాళ్ళు టీపాయ్ మీద జాపుకుని సిగరెట్టు కాలుస్తూ, తల వెనక్కి వాల్చి ఆలోచిస్తున్నా. ఆ పోజులో, చేతిలో సిగరెట్టుతో నన్ను చూస్తే మధు ఏమంటుంది ? నవ్వు వచ్చింది. హఠాత్తుగా నాకెందుకో సిగరెట్టు పొగతో పాటు స్వేచ్ఛావాయువు పీల్చినట్టైంది, నా వూహకి సిగ్గుపడ్డా

రాహుల్‌కి మూడు నెలలు రాగానే, నేను వెళ్ళి మధూని, రాహుల్‌ని తీసుకువచ్చాను రాహుల్ ఎఱ్ఱగా, బొద్దుగా ఏపిల్ పండులా వున్నాడు.

ఇంట్లోకి క్రొత్త పనివాడు రామేశ్వర్ వచ్చాడు

''రాహుల్'' అంటూ ఆఫీసునించి వస్తూనే వాడి వుయ్యాలలోకి తొంగి చూసాను. చక్కటి పౌడరు వాసన.




వాడు కళ్ళు తెరుచుకుని, రంగు గిలకలని పరిశీలించి చూస్తున్నాడు ''ఓహో, మీరు లేచే వున్నారా ?'' అంటూ వాణ్ణి చిటికలు వేసి నవ్వించాను. బోసి నవ్వులు ఒలక బోసాడు పలకరించినకొద్దీ నవ్వు తున్నాడు. చిన్న నోరు వెడల్పు చేసి నవ్వినపుడు, కళ్ళు మెరు స్తున్నాయి సంతోషంతో వాడిని ఎత్తు కుని ముద్దులు కురిపించాను.

''అబ్బబ్బ, ప్రకాశ్ ఎన్నిసార్లు చెప్పాలి ? చేతులూ కాళ్ళూ కడుక్కోకుండే రాహుల్ ని ఎత్తుకో వద్దని ! పిల్లలికి ఇన్ ఫెక్షన్ తొందరగా వస్తుంది'' మధు, బాబుని నా చేతు ల్లోంచి లాక్కుంది

చేతిలోని అమృతభాండాన్ని ఎవరో రాక్షసుడు లాక్కున్నంత బాధ కలిగింది.

''పూరికే నన్ను అన్ని విషయా లలో చెక్ చెయ్యకు మధూ'' చిరాకు పడుతూ, ముందు గదిలోకి వచ్చేసాను.

మధు లేని ఆరు నెలలలో మళ్ళీ నా పాత అలవాట్లు నా దగ్గరకి చేరాయి ఇప్పుడు ఆమె కోసం సిగరెట్లు మానెయ్యాలంటే నాకు బాధగావుంది కోపం ముక్కుమీద వుంటోంది ప్రతిదానికీ చిరాకు ఎక్కువౌతోంది.

అయితే, మధు నన్ను ఎప్పుడూ అర్థంచేసుకోడానికి ప్రయత్నించినట్లు కనబడదు తన మాటే తనది

రాహుల్ పెద్దవాడు అవుతున్న కొద్దీ మా మధ్య భేదాభిప్రాయాలు ఎక్కువవుతున్నాయి వాడు మట్టిలో ఆడకూడదు కొన్ని నిర్ణీత సమయా ల్లోనే బయట ఆడుకోవాలి, అంటుంది

మధు నాణ్ణి సేచ్ఛగా వదిలెయ్యి అంటాను నేను

ఈ మధ్య కాలంలో మేం తాతానగర్ నించి కలకత్తా మారాం. నా వుద్యోగపు హోదా పెరిగింది.

రాహుల్ ని స్కూల్లో వేసాం వాడి పెంపకం బాధ్యతంతా మధూదే వాడు చాలా తెలివైనవాడు ఏ విషయానైనా యిట్టే పట్టుకుంటాడు

వాడ్ని 'మంచి బాలుడు' గా మార్చాలని మధు తాపత్రయం ప్రతి క్షణం వాడిమీద అంక్షలు పెడుతూనే వుంటుంది. "కుర్చీలో యిలా కూచోవాలి, కాళ్ళు క్రింద పెట్టాలి, కాళ్ళు ఆడించకూడదు; టేబిల్ మీద భోజనం చేసేటప్పుడు యిలా తినాలి, అలా చెయ్యి చాపకూడదు, బట్టలు మాపకూడదు, గట్టిగా అరవకూడదు" వంద శిక్షణలు వాడు తప్పుచేస్తే శిక్షిస్తుంది నీళ్ళగదిలో పెట్టి బంధిస్తుంది, లేదా ఓ పూట అన్నం పెట్టదు. నాకివేం నచ్చవు. ఆ పసివాడి కంట్లో నీరు తిరిగితే చూడలేను.

మధూకీ, నాకూ రాహుల్ విషయంలో రోజూ మాట మీద మాట పెరుగుతోంది "రాహుల్ నాకూ కొడుకే వాడి పెంపకంలో నాకూ బాధ్యతవుంది" అంటే మధు యిచ్చే జవాబు - "నువ్వు పెంచితే నీ అలవాట్లే వస్తాయ్ ప్రకాశ్"

నాకేమంత చెడ్డఅలవాట్లు వున్నాయని? సిగరెట్లు కాల్చడం, రోజుకో అరుసార్లు టీ త్రాగటం మహాపరాధాలా? "నువ్వే దైనా వుద్యోగంలో చేరకూడదా మధూ? నీ తెలివితేటలూ, డిగ్రీ వృథా అవుతున్నాయి కదా?" అన్నాను, ఆమె వుద్యోగంలో చేరితే మా తండ్రీ, కొడుకులమీద కొన్ని అంక్షలు తగ్గుతాయేమో అనే భావంతో.

"నాకు తీరికెక్కడ ప్రకాశ్ అయినా నువ్వు సంపాదించినది మనకు హాయిగా సరిపోతుందిగా" అని కొట్టిపారేసింది

రాహుల్ కి ఏడు సంవత్సరాలప్పుడు నేను జర్మనీ వెళ్ళాను ఓ సంవత్సరం వుండి వచ్చా ఈ ఏడాది దూరం మధులో మార్పు తీసుకువస్తుందనుకున్నా కాని తనేం మారలేదు. నాలోనే మార్పు వచ్చింది హఠాత్తుగా మధుతో దెబ్బలాడే ఓర్పూ, సహనం పోయింది ఆమె చెప్పిన దానికల్లా అవుననడం, ఒప్పేసుకోడం నేర్చుకున్నా దీనికి కారణం ఆఫీసులో నా పదవి పెరగడం, బాధ్యత ఎక్కువ కావడం కావచ్చు కారు కొన్నాను

రాహుల్ విషయం కూడా పట్టించుకోవడం మానేసా ఆఫీసులో పని చూసుకోడం, యింట్లో మధు చెప్పి

నట్లల్లా వినడం అన్నిటికీ 'అవునూ' అనేయడంతో మా మధ్య మాటలే ఆగిపోయాయి. ఇంట్లో ఒకరకం నిశ్శబ్దం ఆవరించింది. మా సంభాషణ లన్నీ యిలాగే జరిగేవి :

"ఎల్లుండి రాహుల్ పుట్టినరోజు. ఏం చేద్దాం ప్రకాశ్ ?"

"ఏం చేద్దాం ?"

"సింపుల్ గా చేసేద్దామా? వాడికో క్రొత్త డ్రెస్ కొనేసి, సాయంత్రం ముగ్గురం బయటికి వెళ్ళి ఐస్ క్రీమ్ తిందామా ?"

"తిందాం."

మధు కాస్సేపు ఆగుతుంది. "వాడు సైకిల్ అంటే పరదాపడుతున్నాడు. సైకిల్ కొని ప్రజెంట్ చేస్తే ?"

"అలాగే సైకిల్ కొందాం "

మధు ఓ పది నిమిషాలు ఆలోచిస్తుంది.

"పోనీ, వాడి స్నేహితులని ఓ నలుగురిని పిలిచి చిన్న పార్టీ యిస్తే బాగుంటుందేమో !"

"అలాగే యిద్దాం."

"ఏమేం చేస్తే బాగుంటుది ?"

"నువ్వే చెప్పు." మధు నావైపు పరీక్షగా చూసి, మౌనం వహిస్తుంది

ఇంట్లో మామూలుగా గడిచి పోతోంది ఎవరి దినచర్యలో వాళ్ళు వుంటున్నాం. బొంబాయిలో మంచి వుద్యోగపు ప్రకటన వస్తే పెట్టాను ఆ వుద్యోగం వచ్చింది. నివాసం బొంబాయి మారింది. కంపెనీవాళ్ళు పెద్ద యిల్లు యిచ్చారు.

కాని మధులో ఎందుకో వుత్సాహం లేదు. కొంచెం స్తబ్దుగా తయారైంది

"ఈ మారు సెలవులకి ఊటీ వెళదామా ?" అంది.

"వెళదాం" అన్నాను, పేపరు చదువుతూనే

కాస్సేపు గోళ్ళు చూసుకుంటూ కూచుంది రాహుల్ లైటార్పి పడుకున్నాడు.

"మా అమ్మకి ఒంట్లో బాగాలేదని అన్నయ్య తీసుకువెళ్ళాడు కదా! ఢిల్లీ వెళ్ళి మా అమ్మని చూసి వద్దామా?"

"అలాగే చూద్దాం, టిక్కెట్లు కొననా ?"

మధు సమాధానం చెప్పలేదు.

నేను పేపరు పేజీ త్రిప్పుతూ, ఎదురుగుండా చూసాను. మధు నావైపే దీక్షగా చూస్తోంది ఆమె కళ్ళలో భావంచూసి గతుక్కుమన్నాను. ఆ కళ్ళు క్రొత్తగా వున్నాయి వాటిలో ఏదో భయం, అపనమ్మకం. హఠాత్తుగా మధు గట్టిగా ఏడ్చింది

"అరే, ఏమైంది మధూ ?" ఆమె

ప్రక్కనే వెళ్ళి కూర్చున్నా. ఆమె భుజాలు పట్టుకున్నాను.

"నువ్వు చాలా మారిపోయావ్, ప్రకాశ్."

"ఎలా మారిపోయా ?"

మధు జవాబు చెప్పలేదు వెక్కి వెక్కి ఏడ్చింది. ఎంతో రీవిగా గంభీరంగా వుండే ఆమె ఏడుస్తూ వుంటే నా మనసు వికలమైంది. మధుని నెమ్మదిగా తీసుకువెళ్ళి ప్రక్క మీద పడుకోబెట్టాను ఆమె ఏడ్చి ఏడ్చి నిద్రపోయింది రాహుల్ మేలుకుని వుంటే ఎంత బాగుండును! వాడి ఎదురుగా మధు ఏడవడానికి సాహసించేది కాదు.

ఆ రాత్రి చాలా సేపటిదాకా నాకు నిద్రపట్టలేదు

మధు అంటే నాకెంతో యిష్టం. ఆమెకోసం నేను ఎన్నో అలవాట్లు మానుకున్నాను. సిగరెట్లు మానేసిన క్రొత్తలో నన్నెంతో మంది స్నేహితులు "భార్యాదాసుడని" వెక్కిరించారు. అవన్నీ సహించాను. ఒకటి రెండుసార్లు ఓ చుక్క వేసుకున్నానని, మధు నానా గొడవా చేస్తే, పార్టీలలో మద్యం సేవించడం కూడా మానుకున్నాను నేను పోట్లాడిన విషయాల్లో కూడా మధు దగ్గిర ఎప్పుడూ నేనే ఓడిపోతూవచ్చాను. అన్నిటిలోనూ గెలుపు ఆమెది. ఆమె అలా నెగ్గించుకునేది. ఆమె అందం, తెలివి తేటలూ, వాగ్ధాటీ నన్ను ఆమెకి వశుణ్ణి చేసాయి నేను నిస్సహాయుడిలా ఓటమి అంగీకరించాను

కాని చివరికి ఏమైంది? మధు ఏడ్చింది. ఆమెకి సంతోషం కలిగించలేకపోయా ఎందుకిలా అయింది ?

నాకీ మధ్య క్రొత్త ఆలోచనలు వస్తున్నాయి మధు యింత అందంగా వుండకపోతే బాగుండును ఆమె తెలివితేటలు కూడా సామాన్యమైనవైతే బాగుండును ఇంతకంటె మేం ఎక్కువగా సుఖపడేవాళ్ళమేమో!

ఇంట్లో క్రొత్త పరిస్థితి ఏర్పడింది. మధు చాలా స్తబ్దుగా మారింది. రాహుల్ చదువు విషయం కూడా. శ్రద్ధతీసుకోవటం. లేదు. రాహుల్ కి క్లాసులో రాంక్ తగ్గిపోతోంది వాడి శ్రద్ధ ఆటలమీదకీ, స్నేహితుల మీదకీ మళ్ళింది

ఆ రోజు ఆఫీసులో మీటింగ్ వుండి, యింటికి ఆలస్యంగా వచ్చాను. డ్రాయింగ్ రూమ్‌లో రాహుల్, స్నేహితుడితో మాట్లాడుతున్నాడు.

బట్టలు మార్చుకుని డైనింగ్ టేబిల్ దగ్గిరకి వచ్చాను కప్పులో వేడి టీ, ప్రక్కనే ప్లేటులో వుప్పు చిన్కట్లు, జాగ్రత్తగా మడిచిపెట్టిన ఆ రోజు దినపత్రికా నా కోసం ఎదురు చూస్తున్నాయి మధు పనిలో చిన్న



.... ఒకప్పుడు సర్కసు కంపెనీలో పనిచేశాడు!!!

లోపం కూడా ఎత్తి చూపించలేము. అన్నీ అంత పర్‌ఫెక్ట్‌గా వుంటాయి.

రాహుల్ స్నేహితుడు వెళ్ళినట్టు వున్నాడు. వీధితలుపు మెల్లిగా తీసి, వేసిన శబ్దమైంది వెంటనే ఖంగుమంటూ మధు గొంతుక వినిపించింది.

"రాహుల్, ఎన్నిసార్లు చెప్పాను? ఆ క్రికెట్ బాల్‌కి, బాట్‌కి స్థానం సోఫామీదా? నీ గదిలో పెట్టుకు వచ్చి కూర్చోకూడదా?"

"అబ్బ, వుండమ్మా సత్యపాల్‌తో మాట్లాడుతూ కూర్చుండిపోయా" వాడు విసుక్కున్నాడు

"పెద్దవాళ్ళకి జవాబు చెప్పడం కూడా నేర్చుకో" ఆమెలో కోపం.

"జవాబు చెప్పకపోతే, చెప్పలేదంటావ్. చెబితే ఎదురుతిరిగానంటావ్ ఎలాగమ్మా నీతోటి?"

"షటప్, రాహుల్ ఇక్కణ్ణించి పో"

"ఆఁ పోతున్నా... నువ్వెప్పుడూ యింతేనమ్మా. నాన్ననీ, నన్నూ అన్నిటికీ గదమాయిస్తావ్. ఎందుకనీ మా యిద్దరిమీద అంత కోపం?".

నేను టీ వదిలేసి, లేచి, ముందు గదిలోకి వచ్చాను. రాహుల్ జోళ్ళు చప్పుడు చేసుకుంటూ తన గదిలోకి వెళిపోతున్నాడు.

"రాహుల్"

నా పిలుపు విని ఆగి "ఏం నాన్నా" అన్నాడు.

"అలాగేనా అమ్మతో మాట్లాడ్డం?"

వాడు వొక్కసారి నిరసనగా చూసి, మౌనంగా తన గదిలోకి వెళిపోయాడు

మధు 'అబ్బా' అంటూ నిలుచున్న చోటే నేలకి ఒరిగిపోయింది. ఆమెను కంగారుగా ఎత్తుకు తీసుకువెళ్ళి పడక మీద పడుకోబెట్టి, డాక్టర్‌కి ఫోన్ చేసాను.

మధుకి హార్ట్ ఎటాక్ వచ్చింది.

# రాజేశ్వరి విలాస్ కాఫీ క్లబ్
## విజయావారి సినిమాకథ

(గత సంచిక తరువాయి)

## 2. బంగారప్పిచిక రాజేశ్వరి స్వాగతం

మేస్టారు ఎంత మంచివారు! మొదటి రోజుని నేనల్లా కంగారుపడి పారిపోయేసరికి, పాపం ఏమనుకున్నారో, ఎంత బాధపడ్డారో. ఆయనేదో పచ్చి రౌడీ అనుకున్నాను! పని పోయిందనిచెప్పుకోడాని కొచ్చారని నాకేం తెలుసు? పైగా, "మీతో చెప్పకుంటే అయిపోతుందని చెప్పారు అందుకని ఎవరూ లేకుండా చూసి చెప్పుకోవాలని వొచ్చాను" అంటే నాకు నిజంగానే భయం వేసింది. పాపం, ఆయన కంగారు ఆయనది ఏమైతేనేం? ఆయన నా టీచరుకావడం నా అదృష్టం.

నానమ్మ ఆయన సంగతి తెలీగానే నిర్ణయించేసింది. "లక్షణంగా ఉన్నాడు," అంది నాతోనే నా కప్పుడే అర్థమైపోయింది, నానమ్మ మనసులో ఏముందో. అప్పుడే నన్ను సిగ్గూ సంతోషం ముంచెత్తేశాయి.

నానమ్మకి నేనంటే పంచప్రాణాలు.. హోటల్లో తిండి రుబ్బుకుంటూ ఉండేదట. అమ్మ పోడంతోటే, పదిరోజుల పసిగుడ్డుని నన్ను నానమ్మకి అప్పగించాడు, నాన్న. నన్ను ఒళ్ళో పడుకోబెట్టుకుని పాలుపోసి పెంచింది నాకు నిజంగా ఆవిడే అమ్మ. చిన్నప్పటినించీ నాకు పూజాపునస్కారం అలవాటు చేసింది. నోములు వ్రతాలు చేయించింది. ఎందుకోగాని నాన్నకి ఇదంతా ఇష్టం ఉండేది కాదు. నేను ఈ కాలపుపిల్లలాగ ఇంగ్లీషు చదువుకోవాలనీ, డాన్సు, సంగీతం నేర్చుకోవాలనీ ఉండేదినాన్నకి. నానమ్మ నన్ను చాదస్తంగా పెంచుతోందని చిరాకుపడేవాడు.

"ఇలాగైతే దాన్ని ఎవడు చేసుకుంటాడమ్మా? ఆఖరికి ఏ వంటవాడికో ఇచ్చి కట్టిపెట్టాల్సిందే," అంటుండేవాడు—

"నీకా బెంగ అక్కర్లేదు. ఈ పూజలూ పునస్కారాలూ ఎందుకను

కున్నావు? పుణ్యంకొద్దీ పురుషుడన్నారు. బంగారంలాంటి పెళ్ళికొడుకు దాన్ని వెతుక్కుంటూ వస్తాడు," అనేది నానమ్మ. ఆవిడికి అంత గట్టి నమ్మకం.

అలాగే వెతుక్కుంటూ వచ్చారు మేస్టారు. ఆయనమీద నాన్నకి మంచి అభిప్రాయమేగాని, అల్లుడుగా అంటే ఒప్పుకుంటారో లేదో.



కొన్నివిషయాల్లో నాన్న పద్ధతి నాకు అర్థమయేదికాదు. ఆయన ఏనాడూ పూజ గదిలోకొచ్చి దేవుడిమీద ఒక్క పువ్వు వెయ్యలేదు, పండగనాడు [illegible] పైగా పొద్దున్నే స్నానంచేసి, [illegible] గది లోకి పోయి తలుపుమూసుకుని కూర్చుం టాడు. ఆ గదిలో ఏముందో [illegible] చూడనివ్వడు. ఇవతలికి రాగానే తాళం వేసేసి, జేబులో పెట్టుకుని పోతుంటాడు. మళ్ళీ దేవుడూ భక్తీలేదేమో అంటే, నేను తెచ్చిన హారతి కళ్ళకు అద్దుకుని, నుదుటి నిండా లక్షణంగా విభూతి పెట్టు కుంటాడు. ఓసారి నానమ్మని అడిగాను, నాన్న ఆ గదిలో ఏంచేస్తుంటాడని, ఆవిడకి మాత్రం ఏం తెలుసు?

"మీఅమ్మ ఫోటో పెట్టుకుని చూచుం టాడేమో పాపం. మీ అమ్మంటే పంచ ప్రాణాలు," అంది.

అంతే అయుంటు దనుకుంటున్నాను.

హాల్లో అయితే అందరూ వొచ్చే పోయే దారని, మేడమీద చదువుకోమంది నానమ్మ. మొట్టమొదటిరోజుని చీర కట్టాను. భుజాలమీదనించి కప్పుకుని [illegible]గిపోయి కూర్చున్నాను. ఒక్క నరి సింహం అన్నయ్యతో తప్ప, ఇంకో మొగాడితో మాట్లాడన్నా ఎరగనుగా— కొత్త చనువైన దగ్గర్నించీ మామూలు పరికిణీ కందుబాయే.

రోజూ మేస్టారికోసం ఎదురుచూడ్డం అలవాటైపోయింది. "రావోయీ అను కోని అతిథీ," కాస్త మార్చి మనసులోనే పాడుకునేదాన్ని, 'రావోయీ అనుకున్న అతిథీ' అని. ఒకరోజుని మా కుక్కతో ఆడుకుంటున్నాను. బంతి విసిరితే అది పట్టుకొచ్చి చేతికిస్తుంటుంది. నాలుగైదు సార్లు విసిరాను, తెచ్చి ఇచ్చింది. ఇతర వాత నేను విసిరిన బంతి గుమ్మంలో అడుగు పెడుతున్న మేస్టారికి తగిలింది.

ప్రాణం బిక్క చచ్చిపోయింది. కావాలని విసిరాననుకుంటారో ఏమో, ఒక్కటే పరుగు-నానమ్మ దగ్గిరికి- "ఏమిటే" అంటుంది నానమ్మ. ఏం చెప్పను? "మేస్టారు..." అని గొణిగాను—

"నీ సిగ్గు బంగారంగానూ! అతనేం పరాయివాడా,"

అంటూ ఇవతలికి తీసుకొచ్చి టేబిల్ దగ్గర కూర్చోపెట్టింది అప్పటికే మేస్టారు వొచ్చికూర్చున్నారు—

"ఒరే అబ్బాయి! దీనికి వల్లమాలిన సిగ్గురా. అదంతా వదలగొట్టి దొరసాని లాగ ఇంగ్లీషు మాట్లాడేటట్టు చెయ్యాలి," అంది నానమ్మ.

మా పాఠాలు అవుతుంటే అప్పుడప్పుడు వొచ్చి కూర్చునేది నానమ్మ మెల్లగా ఆయన కుటుంబాన్ని గురించి అడగడం మొదలుపెట్టింది. మేస్టారి నాన్నగారి పేరు జానకిరామయ్య గారట. మేనరికం ఏంలేదట ఓసారి గోత్రం అడిగింది ఆయన తెలీదన్నారు వాళ్ళ నాన్నగారికి రాసి కనుక్కోమంది నానమ్మ

ఒక రాత్రి మేడమీద పడకగదిలోకి వెడుతున్నాను పాట వినిపించింది, ఎక్కడినించో. వరండా కిటికీ తలుపు తెరిచి చూశాను మా హోటల్ డాబా మీద! పాడుతున్నది మేస్టారు!!

"నా పేరు బికారి-నా దారి ఎడారి-
॥నా దారి॥
మనసైన చోట మజిలీ—
కాదన్న చాలు బదిలీ— ॥నా దారి॥
తోటకు తోబుట్టువును—
ఏటికి నే బిడ్డను—
పాట నాకు సైదోడు—
పక్షి నాకు తోడు—
విసుగు రాదు ఖుషీ పోదు-వేసట
రేనేలేదు
అసలు నా మరో పేరు ఆనందవిహారి
॥నా దారి॥

మేలుకొనీ కలలుగనీ
మేఘాల మేడపైని—
మెరుపుతీగ లాంటి నా
ప్రేయసి నూహించుకొనీ-
ఇంద్రధనుసు పల్లకీ ఎక్కి కలుసు
కోవాలని
ఆకాశవీధిలో పయనించు బాటసారి
॥నా దారి॥

కూటికి నే పేదను-గుణములలో
పెద్దను.
సంకల్పం నాకు ధనము-సాహసమే
నాకు బలము
ఏనాటికో ఈ గరీబు - కాకపోడు
నవాబు
అంతవరకు నేనొక నిరంతర
సంచారి ॥నా దారి॥

అబ్బ! ఎంత బాగా పాడతారు మేస్టారు!! పాట కూడా ఆయనే రాసుకున్నట్టుంది, తనని గురించే. గదిలోకి వెడుతుంటే నాన్న అడిగాడు ఎవరా

పాట అని. "మ్యేస్టారు" అన్నాను. "అహా! బాగుంది", అన్నాడు నాన్న. చాలాకాలందాకా ఆ పాటే నామనసులో తిరుగుతోంది.

నాకు ఇంగ్లీషు బాగా వొచ్చేసింది. మేస్టారి దగ్గర నా పాండిత్యం-చూపిం చాలని సరదా. కాని సిగ్గు, భయం. "ఏవిఁటో అమ్మాయి!" అనుకుంటా రేమోనని. నానమ్మ దగ్గర చనువుంది గాని, నేనెంత బాగా ఇంగ్లీషు మాట్లాడు తున్నానో ఆవిడికి అర్థంకాదుగా? అందుకని నాన్న దగ్గర నా ప్రతాపం చూపించాలని నిశ్చయించుకున్నాను.ఒక చీటీ రాశాను-ఆయన మేడ మెట్లు దిగి వొస్తుంటే తీసికెళ్ళాను. నానమ్మ పక్కనే ఉంది.

"Daddy! Here is a list of things I want You must bring them for me before this eveing!" అన్నాను చీటీ ఇస్తూ. నాన్న ముఖం సంతోషం ఆశ్చర్యంతో విప్పారింది.

"Very good, Very good. అమ్మాయి! నువ్వింకెప్పుడూ నాతో ఇంగ్లీషులోనే మాట్లాడుతుండు," అన్నాడు

నాకు కడుపునిండనట్టైంది కాని నానమ్మ నాకన్న పెద్ద రస్సా వేసింది. చాల గంభీరంగా ముఖంపెట్టి అంది.

"నీ కసలు ఈవినింగ్ తప్ప ఇంకే మన్నా అర్థమైందా? మీ నాన్నకి తెలుగు లోనే చెప్పవే అమ్మాయీ! లేకపోతే ఒకదానికొకటి తెస్తాడు. చూడబ్బాయీ! పూజకి కోశోనట్సూ, ఫ్లవర్సూ కావాలి. తెప్పించు,"

అనేసి మహారాణి ఫోజులో వెళ్ళి పోయింది. నేనూ నాన్న గొల్లున నవ్వాం.

నాకావేళ నిజంగా కోపం ఆగలేదు. ఆ క్షణంలో నేను తొందరపడుతున్నా నని కూడా నాకు తోచలేదు..

నేను మేడదిగి వచ్చేసరికి, మేస్టారూ మరొక గిరిజాల ఆసామీ నానమ్మతో మాట్లాడుతున్నారు. నేనురాగానే మేస్టారు ఆయన్ని నాకు పరిచయం చేశారు—

"వీరు రాఘవయ్యగారని భరత నాట్యంలో గొప్ప పండితులు. ఊర్వశీ నాట్య నిలయం నడుపుతున్నారు."

"వొచ్చే శుక్రవారం ఒక నాట్య ప్రదర్శనం ఉంది. కలెక్టరుగారి అమ్మాయి, మా శిష్యురాలే-చాలా బాగా చేస్తుంది మీరొచ్చి చూడాలి," అన్నాడు పెద్దమనిషి

"నాన్నగారు హోటల్లో ఉన్నారు. టిక్కెట్లూ అవీ ఆయనే కొనాలి," అన్నాను నేను

ఆయన ప్రశ్నార్థకంగా మేస్టారివైపు తిరిగి,

"టిక్కెట్లకి కాదమ్మా నేనొచ్చింది." అన్నారు. మేస్టారుఅప్పుడు చెప్పారు—

"నాన్నగారు మీతో చెప్పడం మరిచి

పోయారేమో. ఒక మంచి డాన్స్ టీచర్ని తీసుకురమ్మన్నారు."

"ఎందుకు?" అన్నాను

"మీకు డాన్స్ నేర్పించడానికి," అన్నారు మేస్టారు.

"నాకా!!"

నాన్న కేమన్నా మతిపోయిందా? ఇంతలో ఆయన అందుకున్నాడు—

"మీకు బాగా వస్తుందమ్మా నాట్యం. మీ ముఖంలో భావం గొప్పగా పలుకుతుంది."

"నాకు డాన్సూ వద్దు, ఏం వొద్దు. నాన్నగారితో చెప్పండి" అన్నాను చిరాకుగా. ఆ పెద్దమనిషి ఊరుకుంటేగా?

"అమ్మమ్మ! మిమ్మల్ని వొదులుకోడమే? మీలాంటి శిష్యురాలు దొరకడమే కష్టం మీరసలు డాన్సుకోసమే పుట్టారంటే నమ్మండి," చురుక్కున చూశాను ఆయనవంక, ఇంక ఆపండి అన్నట్టు.

"అహా! చూశారా ఆ భంగిమ!! మనసులో భావాన్ని ఒక్క వాలు చూపులో పలికించారు," అని మేస్టారితో అని, ఆ తరవాత అభినయ పూర్వకంగా నా అంగాంగ వర్ణన మొదలెట్టారు.

"తీర్చి దిద్దిన కనుబొమలు! అద్దాలవంటి చెక్కులు! శంఖంవంటి మెడ! ఆ నడుము వంపు! ఆ వొయ్యారం!"

నాలో చిరాకూ కోపం పొంగిపోతున్నాయి. అక్కడికీ మేస్టారు అన్నారు—

"పంతులుగారూ! ఆపండి మీ చాదస్తం" అని

కాని ఆమనిషికి మంచీ మర్యాదా తెలిస్తేగా?

"ఉన్న విషయం చెపుతున్నానయ్యా! మెచ్చుకోలు కబుర్లు చెప్పడం నాకసలు చేతకాదు. అమ్మాయి ముందు అప్సరసలు దిగదుడుపు. మీకెందుకు? నాకొదలండి. ఏడాదిలో నాట్యంలో ఊర్వశి బిరుదు రాకపోతే, నేను నాట్యమే మానేస్తాను. ఏదమ్మా! అటు తిరగండి, అటు "

నాకింక పిచ్చికోపం వచ్చేసింది

"Who is this mannerless fellow? ask him to get out," అన్నాను

"ఏవిటి, సెలవిస్తున్నారు?" అన్నాడాయన మేస్టారితో.

"Get out. దయచెయ్య మంటున్నాను "

మేస్టారు ఇబ్బందిలో పడ్డారు.

"అది కాదు, నే చెప్పేది-" అనబోయారు—

"I say get out," అని అరిచాను. మేస్టారిని కూడా కలిపి అన్నానని ఆ క్షణంలో నాకు తెలియలేదు. చరచర పైకి వెళ్ళిపోయాను

* * *

## 3. సనాతనిస్టు
### వెంకాయమ్మ సౌద



ఏమనుకున్నారు మా రాజీ? పులి పిల్లే. ఎవడైనా హద్దుమీరితే ఊరుకుంటుందా? దులిపి పారేస్తుంది. ఆ డాన్సు మేస్టారు నోటి కొచ్చినట్టల్లా వాగుతుంటే, ముత్తయ్యేమిటి అలా ఊరుకుంటాడు? జబ్బట్టుకు అవతలికి లాక్కుపోక? పైగా "ప్లీజు ప్లీజు" అంటూ రాజీని బతిమాల్తాడు అయినా అసలు అబ్బాయికి బుద్ధుందా? దానికి డాన్సు నేర్పించాలని సరదా ఏమిటి వాడికి? పోనీ అబ్బాయి చెప్పాడే అనుకోండి. ముత్తయ్య రాజీని అడగొద్దూ, 'మీ నాన్నగారి లా అంటున్నారు, డాన్సు టీచర్ని తీసుకురానా వొద్దా' - అని? సరే అబ్బాయి మాట కాదనలేక తీసుకొచ్చాడే అనుకోండి. అలాంటి పిచ్చాడినా తిచ్చేది బిడ్డ మహా బాగా గడ్డి పెట్టింది ముత్తయ్యకీ డాన్సు మేస్టారికీ కూడా.

మేడమీది కెళ్ళేసరికి నాతల్లి వెక్కి వెక్కి ఏడుస్తోంది నా కడుపులో అంతా దేవేసినట్టైపోయింది. ముత్తయ్య ఇంక రాడేమోనని దాని బాధ.

పిచ్చి పిల్ల. ఎందుకు రాడు? ఎక్కడికి పోతాడు?

వెంకటేశుగాణ్ణి పిలిచి ముత్తయ్య ఎక్కడున్నా సరే పట్టుకు తీసుకు రమ్మన్నాను - రాగానే బాగా ఒక తట్ట వరస పెడతాను. అన్యాయంగా అమ్మాయిని ఏడిపించాడు—

వెంకటేశు తిరిగొచ్చి ముత్తయ్య ఎక్కడా కనిపించలేదన్నాడు. లాడ్జిలో లేట్ట. నరిసింహానికి కనపడలేదట. ఎక్కడికి పోయాడో - కొంపతీసి నిజంగానే కోపమొచ్చి పోలేదుగదా? వాడో పిచ్చాడు. అమ్మాయి కోపంలో ఏదో అందే అనుకోండి. వాడెందుకు పట్టించుకోవాలి? చనువున్నప్పుడు లక్షా తొంభై అనుకుంటారు. అంతమాత్రం చేత ఒకళ్ళమీ దొకళ్ళకి అన్యోన్యం లేనట్టేనా? చిన్నపిల్ల. ఇంతకీ అది అన్నవన్నీ డాన్సు మేస్టార్నిగాని తనను కాదని వాడు గ్రహించుకోవద్దూ? ఏవిటో కుర్రతనాలు

రాజీ అలాగే టేబిలు దగ్గర

కూర్చుంది ఏడుస్తూ. వాణ్ణి 'గెటౌట్' అనేసి, తరవాత వాడు వెళ్ళిపోయాడని ఏడిస్తే ఏం లాభం? వాడికీ ఆ మాత్రం అభిమానం ఉండదూ?

"మీ నాన్న చెవితేనేకదా ఆ డాన్సు మేస్టార్ని తీసుకొచ్చాడు? వాడి తప్పే ముంది చెప్పు," అన్నాను—

"నిజమే నానమ్మా! నేర్చుకోనంటే పోయేదానికి అనవసరంగా నోరు జారాను. పాపం - ఏమనుకున్నారో ఆయన," అంది రాణీ. అమ్మయ్య! వొచ్చాడు. ముత్తయ్య వొచ్చేశాడు. నా గుండెల్లో గాభరా తగ్గింది.

"ఏరా అబ్బాయీ! అమ్మాయేదో చిన్న మాటంటే అలా కోపగించుకు పోడమే," అన్నాను, తప్పంతా వాడి మీదే వేస్తూ. రాణీ తల ఎత్తలేదు, తప్పు చేసినట్టు ముత్తయ్య ముఖం కూడా వాడిపోయి ఉంది.

"కోపగించడానికి నేనెంతటి వాణ్ణండీ? నిజంగానే వెళ్ళిపోతున్నాను. సెలవిప్పించండి."

"వెళ్ళిపోతావా? మరి అమ్మాయి చదువు?" అన్నాను, చిరాకుగా.

"అమ్మాయిగారికి చదువొచ్చేసింది గదండి ఆ మాటే అయ్యగారితో అన్నాను. సరే పొమ్మన్నారు"

అదా సంగతి. అబ్బాయి వెళ్ళి పొమ్మన్నాడన్నమాట. వీడు వెళ్ళిపోతే ఎలాగ? వీలు చూసుకుని అబ్బాయితో చెప్పాలి, నా మనసులో మాట

"మరి అమ్మాయినేదో పరీక్ష పాసు చేయిస్తానంటివే."

"పరీక్ష పాసయి అమ్మాయి ఉద్యోగం చెయ్యబోతుందా? వొద్దులే అన్నారు."

రాణీ తలదించుకుని అలాగే కూచుంది, నా కేమనడానికీ తోచలేదు. ముత్తయ్య రుమాలుతో కళ్ళద్దుకుంటూ అన్నాడు,

"వెళ్ళొస్తానండి, మీ దయవల్ల రెండు పూటలా తిండి తింటున్నారు మా వాళ్ళు.... వెళ్ళొస్తానండి."

వాడు అలా అనగానే నా గుండె చెరువైపోయింది.

"ఏవిట్రా! వొస్తాను. వొస్తా వంటూ? ఉండు, అబ్బాయి రాగానే నేను కనుక్కుంటాను-"

"లాభంలేదండి. అమ్మాయి డాన్సు నేర్చుకోనంది గదా, ఇంక నువ్వుండి చేసేదేముంది? అన్నారండి."

పాపం వెర్రాడు! రేపట్నుంచి ఎలా బతుకుతాడు? అయినా అబ్బాయి కింత పట్టుదలేమిటి? రాణీ డాన్సు నేర్చుకుని ఏం చెయ్యాలి?

ముత్తయ్య వెళ్ళిపోతుంటే వాడి జేబురుమాలు చేతిలోంచి జారిపోయి నట్టుంది, అమ్మాయి నాకు చూపించింది.

వాణ్ణి పిలిచాను. వాడొచ్చి కిందపడ్డ జేబురుమాలు వొంగి తీసుకున్నాడు.

"ఏదో మీరిచ్చిన జీతం కొద్దిగా మిగిలింది ఈనెల గడిచిపోతుంది మళ్ళీ ఎక్కే గుమ్మం - దిగే గుమ్మం-" అంటుంచేనే వాడి గొంతు పూడిపోయింది, దగ్గుతో.

"ఉండరా అబ్బాయీ! దాహం తెస్తాను," అని వెళ్ళాను-

వాడు వెళ్ళిపోతే రాజీ అన్నం నీళ్ళు ముట్టదు, నాకు తెలుసు. పాపం వాడికీ వెళ్ళిపోవాలనిలేదు. అబ్బాయి ఏమిటిలా మరీ తలకిందులుగా తయారవు తున్నాడు?

నేను మజ్జిగతో తిరిగొచ్చే సరికి, ఇద్దరి మధ్యా ఏం జరిగిందో,

"నానమ్మా!" అంటూ రాజీ నా భుజంమీద వాలిపోయింది. ముత్తయ్య మీద నాకు వల్లమాలిన కోపం వొచ్చింది—

"అయ్యో! ఆదేమిటే తల్లీ!... ఏరా అమ్మాయి నలా ఏడిపిస్తావెందుకు? పోయేవాడివి పోరాదూ?" అన్నాను వాడు అదిరిపోయి వెనక్కి తిరిగాడు.

"వొద్దు నానమ్మా," అంది ఏడు స్తూనే రాజీ - నాకు అర్థంకాలేదు - వాణ్ణి వెళ్ళిపోవద్దంటుందా?

"మరి దాన్ని నేర్చుకుంటావా?" అని అడిగాడు—

"ఊఁ" అంది ఆ ఏడుపులోంచే.

"అయితే వెళ్ళి టీచర్ని తీసుకు రారా," అన్నాను

ముత్తయ్య ముఖం చాటంత అయింది. పరిగెత్తబోతుంటే రాజీ కంగారుగా అంది.

"నాన్నమ్మా! ఆడ టీచరు."

ఎంత ముద్దుగా అంది నా తల్లి! ఆ ముఖం చూస్తుంటే నా కడుపు నిండి పోయింది. ఇదంతా దాన్ని మీద ప్రేమా? అబ్బే. ముత్తయ్య వెళ్ళి పోకుండా చూడాలి - వాడి కోసం ఏమైనా చేస్తుంది నా తల్లి. ఆ సంగతి వాడు గ్రహించాడా? అని. మొగాళ్ళవి మట్టిబుర్రలు. మొగాళ్ళమన్న అహం కారం తప్ప వాళ్ళకింకేమీ తెలీదు. ఎందుకు, మా శేషాద్రే ఉన్నాడు. రాజీని నేను స్కూలుకెళ్ళి చదువుకో నివ్వలేదని ఒకటే రగడ. ఇప్పటికీ చెప్పుతుంటాడు. భారతం భాగవతం చదివించాను, అంత కన్న మంచి చదువు చెపుతారా స్కూల్లో? పైగా అది బి. ఏ. పాసయి ఉద్యోగం చెయ్యాలా అని తనే అన్నాడు ఏవిటో వాడి పిచ్చి, అది ఇంగ్లీషూ సంగీతం దాన్నూ నేర్చు కుంటే మంచి మొగుడొస్తాట్ట. లేకపోతే ఏ వంటవాడికో ఇచ్చి కట్టబెట్టాలిట. దానిచేత పూజలూ పునస్కారాలూ, నోములూ, వ్రతాలూ చేయించి చాదస్తంగా తయారుచేస్తున్నా నట.

ఇవన్నీ ఎందుకు చేయిస్తున్నాను? దానికి మంచి మొగుడు రావాలనేగా?

మరి ముత్తయ్య వెతుక్కుంటూ రాలే? మొదట చూసినప్పుడే అనుకున్నాను, అన్ని విధాలా రాణికి తగినవాడని. తెలివీ, అణకువ, మంచీ, మర్యాదా అందంచదం అన్నీ ఉన్నాయి కుర్రాడికి. ఆ సీపాస్తి లేకపోతేయేం? రాణికి ఉన్నది చాలదా ఏం? దాని కెలాగైనా ఇంగ్లీషు నేర్పించాలనుంది అబ్బాయికి నేను మహా బాగన్నాను. ఇంగ్లీషు కోసమా? ముత్తయ్య కష్టమూ గడుస్తుంది, వాడు మెల్లగా ఇంట్లో మనిషి అయిపోతాడు. ఆ తరవాత నెమ్మదిగా అబ్బాయికి చెప్పి ఒప్పించొచ్చు. ఊరికే అంటాడు గాని, దాని పెళ్ళికోసం అబ్బాయి ఏం ప్రయత్నాలు చేస్తున్నాడు? అసలు సాటివాడు అన్ని విధాలా తగినవాడు ముత్తయ్యని చూడగానే, వాడికా ఆలోచన రావొద్దూ! ఇంటివిషయాల్లో మొగాళ్ళకి బుర్ర పనిచెయ్యదు. నేనే కదపాలి.

ఒకనాడు పాఠం చెపుతున్నాడు ముత్తయ్య. నేను రాగానే రాణి అంది:

"ఈవేళ మేష్టారు అదోలా ఉన్నారు నానమ్మా."

"ఏం జరిగింది?"

"ఏం లేదండి" అన్నాడు ముత్తయ్య నసుగుతూ.

"చెప్పరా అబ్బాయీ! ఇంటి దగ్గర్నించి ఏదన్నా చెడ్డకబురొచ్చిందా?" అని అడిగాను—

"శుభవార్తే - నాకు మట్టుకు గొంతు మీద కొచ్చింది."

"శుభవార్తేమిటి? గొంతు మీదికి రావడం ఏమిటి?" నాకేదో అనుమానం వొచ్చింది - నేను అనుకున్నదానికి విరుద్ధంగా వాళ్ళవాళ్ళు ఏమన్నా తల పెడుతున్నారా అని,

"నీకేమన్నా పెళ్ళిగిళ్ళి అంటున్నారేమిటి?" అని అడిగేశాను,

"నాక్కాదండి, మా చెల్లాయికి."

నా మనసు కుదుటపడింది.

"ఇంకేం? అయిందల్లా మంచిది," అన్నాను.

"అవడం అంత సులభమాండి? వాళ్ళకి రెండు వేలు కట్నం కావాలట," అన్నాడు.

"ఆమాత్రం కట్నం లేకుండా ఎవరొప్పుకుంటారులే."

"కాని నే నెక్కణ్ణించి తెచ్చేదండి? నన్ను చూడమంటారు నాన్నగారు నా వల్లకాదని రాసేస్తాను."

"నీ మొహం. డబ్బుకోసం పెళ్ళాగిపోతే ఎలాగ? అబ్బాయిని అడుగుదాం, రా."

ముత్తయ్య మొహమాటపడి వొద్దన



యా




కండానే నేను లేచి కిందికి దారితీశాను. ఈ అవకాశం ఉపయోగించుకొని అబ్బాయిని కాస్త కదిపి చూడాలని అనుకున్నాను. - రాజీ, ముత్తయ్య నా వెనకాలే వొచ్చారు.

మేం కిందికి వొచ్చేసరికి అబ్బాయి ఎవరో శెట్టితో ఏదో వ్యవహారం మాట్లాడి పంపించేస్తున్నాడు. మేం వెళ్ళి పక్కని నిలబడ్డాం, ముగ్గురం కలిసి రావడం చూసి అడిగాడు—

"ఏదో సిఫార్సు కొచ్చినట్టున్నారే?"

నేను అదేం పెద్ద విషయం కాదన్నట్టు,

"అదే, ముత్తయ్య చెల్లెలికి పెళ్ళట. రెండువేలు కట్నం కావాలంటున్నారట. నువ్వే సర్దుబాటు చెయ్యాలి," అన్నాను.

"ఇస్తాననుకో. ఎలా తీరుస్తాడు?" అన్నాడు మొహం చిట్లించి. నేను తెగించి అనేశాను.

"ఇవ్వకపోతే ఏం మునిగింది? కన్యాదానఫలం నీకు దక్కుతుంది"

దానికి అబ్బాయి ఏం సమాధానం చెపుతాడోనని నేను చూస్తుంటే వెర్రాడు ముత్తయ్య పానకంలో పుడకలాగ దూరబడ్డాడు.

"ఊరికే అక్కర్లేదండి, నెల నెలా వంద చొప్పున జీతంలోంచి పట్టుకోండి. ఇప్పుడో వెయ్యి ఇస్తే చాలు."

అప్పుడు నేను కలగజేసుకున్నాను-

"పిచ్చోడా! వందా ఇచ్చి నువ్వేం తింటావు, మీవాళ్ళకేం పంపిస్తావు? పస్తులుంటారా? నీకు వీలైనప్పుడు తీరుద్దుగాని, నే నిస్తాలే."

అబ్బాయి నవ్వాడు.

"నీ దగ్గరేముందమ్మా ఇవ్వడానికి?"

''ఏం? ఇరవై ఏళ్ళు జీతం బత్తెం పుచ్చుకోకండా పనిచేశాను. నెలకి పది చొప్పున లెక్కచూసి నాకు పారెయ్యి," అన్నాను.

జీతం బత్తెం నేనడుగుతానా, అబ్బాయి ఇస్తాడా? ఆ మాటంటే గాని ముత్తయ్య కివ్వదని అనేశాను.

అబ్బాయి నవ్వేసి ముత్తయ్యని హోటలు కొచ్చి తీసుకోమన్నాడు.

నా ఇంట్లో నాకు జీతం ఏవిఁటి? కోట్లు విలువచేసే స్థానంనాది, ఈ ఇంట్లో. ఏదయినా సరే నా ఇష్టప్రకారమే జరుగుతుంది ఆఖరికి. అబ్బాయి ఎన్ని పిచ్చి పిచ్చి అభ్యంతరాలు చెప్పినా, నేను గట్టిగా చెపితే కాదనలేడు. అందుకే, అమ్మాయిని ముత్తయ్య కివ్వ డానికి అబ్బాయిని ఒప్పించగలనని నా ధైర్యం.

ఊరంతా అమ్మవారు. అబ్బాయికి ఒళ్ళు తెలీకండా వొచ్చింది జ్వరం. నాతో చెప్పకుండా అమ్మాయి ఇంగ్లీషు డాక్టర్ని పిలిపించింది ముత్తయ్యచేత. అమ్మ వారి సంగతి ఈ ఇంగ్లీషు డాక్టర్లకేం తెలుస్తుంది? పోలేరమ్మకి ముడుపు కట్టించాను, ముత్తయ్యచేత. టక్కుని దిగజారిపోయింది, ఒక్కసారి గుగ్గిలం పొగ వెయ్యడంతోటే. అప్పుడే మొక్కు కున్నాను, అబ్బాయికి అమ్మవారు రాకుండాపోతే, గుడికి తీసుకొస్తానని.

"నేనే గుడికి రానమ్మా. నాకి మొక్కులంటే నమ్మకంలేదు," అన్నాడు.

"నీ జ్వరం ఎలా పోయిందను కున్నావు? నేను మొక్కుకోబట్టే," అన్నాను.

"మొక్కుకుంటే నువ్వెళ్ళు. నేను రాను," అన్నాను, పెంకిగా. "నిన్ను తీసుకొస్తానని మొక్కుకున్నాను; ఒక్క దాన్నీ ఎలా వెడతాను?"

''నన్ను తీసుకొస్తాకోడానికి నువ్వె వరవమ్మా," అన్నాడు.

నేనూ ఉప్పూకారం తింటున్నానుగా! నాకు మాత్రం అభిమానం ఉండదు? నే నెవరికోసం మొక్కుకున్నాను? తన కోసమేగా? నన్నంతమాట అంటాడా? –

"అన్నావా? అంత మాటా అన్నావా? అవున్లే నేనెవర్ని? చాకిరీ చెయ్యడానికి చేరా నీ ఇంట్లో. అత్తారిల్లా పుట్టిల్లా? నాకు అంటూ ఎవరూ లేకపోబట్టేగా, అంత మాటన్నావు? పోతాను – కాశీకి పోతాను."

పోనీ నేనంతలా అంటున్నప్పుడు సముదాయింపుకోసమన్నా ఒక్క మాట న్నాడా? తను బిగిసి పోయి కూర్చున్నాడు.

"పోతున్నాను," అన్నాను మళ్ళీ.

"పోతే పోరాదూ? ప్రతిసారీ బెదిరిస్తావు." అన్నాడు. నాకు మండి పోయింది, మనిషంటే అంత నిర్లక్ష్యమా?




"నిజంగానే పోతున్నాను," అనేసి రైయిమని వొచ్చేశాను.

నే నొక్కరోజు లేకపోతే అప్పుడు తెలుస్తుంది. పోతాను. నా కాళ్ళమీద పడి బతిమాలితేగాని మళ్ళీ ఈ గడప తొక్కను. బొత్తిగా చులకనచేసి మాట్లాడితే నేనూరుకుంటానా?

నేను మెట్లుదిగి వస్తుంటే కింద నిలబడి ఉంది రాజీ.

"ఏవిటి నానమ్మా?" అంది జాలిగా.

నేను మెత్తబడితే మరీ చులకన చేసేస్తాడు అబ్బాయి.

"ఏముందీ? పోతున్నాను. పొమ్మన్నాడుగా? నా మాటకి గడ్డిపరకంత విలువలేకపోయాక నే నెందుకుండాలీ ఇంట్లో? ఈ చాకిరీ ఆదేవుడికి చేస్తే వచ్చాకైనా సుఖపడొచ్చు ఎందుకొచ్చిన బంధాలు? ఎంత చేసినా పరాయిదాన్నే."

రాజీతో అంత నిష్ఠూరంగా మాట్లాడానంటే, నాకు నిజంగా ఎంత తిక్కొచ్చిందో - రాజీ గొంతు జీర పోయింది

"నువ్వు పరాయి దాని వెలా అవుతావు నానమ్మా? ఎవరన్నారా మాట?"

"ఎవరా? వెళ్ళి మీ నాన్ననే అడగవే, పొమ్మన్నాడుగా, పోతున్నాను"

రాజీ గబగబ తండ్రి దగ్గిరికి వెళ్ళిపోయింది. తప్పకుండా తీసుకొస్తుంది తన తప్పు తన తెలుసుకోలేనంత మూర్ఖుడు కాదుగా? పైగా రాజీ మాట కాదంటాడా! వొస్తాడు వొచ్చి నాకు క్షమార్పణ చెప్పుకుంటాడు, నేను వెంటనే లొంగను. వాడు కాళ్ళబేరానికి రావాలి. ఇప్పుడు నేను మెత్తబడ్డా

నంటే నా మాటింక అసలు వినదు. నేను ఏం ఏడిచినా వాళ్ళకోసమేనని తెలిసిరావాలి.

రాజీ మెట్లు దిగుతోంది, క్రీగంట చూశాను. అబ్బాయిరాలేదు, అయితే తన పంతం నెగ్గించుకుంటున్నాడన్నమాట, సరే - కానీ చూస్తాను, వాడి పంతం ఎన్నాళ్ళు సాగుతుందో మళ్ళీ మూట ముడెయ్యడం మొదలెట్టాను రాజీ నా దగ్గర కొచ్చింది. స్వగతంలా మొద లెట్టాను

"పిల్లా జెల్లా? మొగుడా మొద్దులా ? నా కెవరున్నారు ? పోతున్నాను.''

రాజీ పక్కని కూచుంది

''ఎప్పు డెళ్తావు నానమ్మా ? ఏ బండికి ?" అంది

ఆ ! ! నా రాజీయే ఆ మాటన్నది? పైగా ఎంత కొంటిగా ఉంది గొంతు ! అబ్బాయి దీని మనసు కూడా విరి చేశాడు ఇంకేముంది ? ఒక్కపెట్టున దుఃఖం ఉక్రోషం ముంచుకొచ్చాయి.

''ఏం తల్లీ? నీకూ అంత తొందరగా ఉందా ? అవును, ఆయన కూతురివి కావూ ? ఎక్కడో హోటల్లో పిండి రుబ్బుకుంటూ ఉండేదాన్ని. తీసు కొచ్చి ఈ ఇంట్లో పడేశాడు ''

"నానమ్మా !' అంది రాజీ-కొంటి గానే ఏం ? నన్నాడిస్తోందా ?

"ఇంకా నా న మ్మే విం టే ? మీ నానమ్మ ఎప్పుడో చచ్చిపోయింది,'' అనేశాను.

రాజీ చటుక్కుని నా నోరు మూసింది. దాని గొంతు జీరపోయింది

''ఆ మాట ఇంకెప్పుడూ అనొద్దు నానమ్మా. నువ్వు తప్ప నాకింక ఎవరున్నారు? అమ్మా, నానమ్మా అన్నీ నువ్వే "

చటుక్కుని ఒళ్ళోకి తీసుకున్నాను. పిచ్చిపిల్ల మనసు ఎంత బాధపెట్టాను !

"తల్లీ !... నాకింకా నిన్ను ఒళ్ళో పడుకోబెట్టుకుని పాలు పోసిన రోజులే గుర్తుకొస్తాయి "

"మరి నన్నొదిలిపెట్టి ఎలా వెళ్ళి పోతానన్నావు నానమ్మా?" అందిజాలిగా.

"అయ్యో పిచ్చి పిల్లా! నేనెక్కడికి పోతానే? మీనాన్న అలా మొండిపట్టు పడితే తిక్కొచ్చి అన్నానంతే " రాజీ లేచింది- బట్టల మూట విప్పేసింది.

"నాన్న రానంటే మనం ఇద్దరంవెళ్ళి మొక్కు చెల్లించుకొద్దాం అంతేగాని ఇంకెప్పుడూ పోతానని మాత్రం అనొద్దు నానమ్మా "

దాని మొగం పైకెత్తాను, దాని కళ్ళలో నామీద ఎంత ప్రేమ! అది చాలు నాకు ఈ బతుక్కి.

"అనన్లే, అయినా అప్పుడే ఎలా పోతాను? నీ కూతుర్ని నీలాగే ఒళ్ళో పడుకోబెట్టుకుని పాలు పొయ్యొద్దూ?"

నే నామాట అంటున్నప్పుడు రాజీ మొహం చూడాలి. ఎంత తియ్యగా చూసింది నావంక, నాతల్లి !! వెయ్యి వరహాల విలువచేసే చూపులు !!

———




# మనుషులు

## 'మల్లిక్'

బజార్లోని జనాన్ని చూస్తూ, వాళ్లని భేదించుకుంటూ నడుస్తున్న గవర్రాజు చటుక్కున ఆగిపోయాడు. మెఱుపులా అతని చేయి తన జేబులో ఉన్న మరో చేతిని పట్టుకుంది. ఆ చెయ్యి పొయ్యూదుకునే కొయ్య గొట్టాం మాదిరి తగిలింది గవర్రాజు చేతికి. చేతి మణికట్టును అరచేతిలో బిగించి చూశాడు గవర్రాజు. వాడికి పద్నాలుగు ఏళ్లుంటాయి. బక్కపలచగా, నల్లగా ఉన్నాడు. జుట్టు కొబ్బరిపీచులా ఉంది. కళ్లు భయం భయంగా గవర్రాజు వంక చూస్తున్నాయి.

"దొంగ వెధవా... జేబులు కొడ్తావా" అని వాడి గూబ పగల గొడ్దామని అనుకున్న గవర్రాజు ఏమీ చెయ్యకుండా వాడి వైపు చూస్తూ ఉండి పోయాడు. అప్పటికే నలుగురైదుగురు వాళ్లిద్దరి చుట్టూ మూగేరు.

"ఏమైంది?... ఏమైంది" అని అడిగారు.

పిల్లవాడి కళ్లల్లో నీళ్లు తిరిగాయి గవర్రాజుకు జాలి కలిగింది

"జేబు దొంగతనం చేశావా?... తన్నండి వెధవని! దొంగముఖం వాడూను!!.." అన్నారెవరో.

జనం ఇంకా మూగిపోతున్నారు- బెల్లం మీది ఈగల్లా. వాడిని కొట్టొచ్చిన ఇద్దరు ముగ్గుర్ని ఆపాడు గవర్రాజు.

"నాతో రా" అన్నాడు ఆ అబ్బాయితో.

"సార్..!నన్ను పోలీసులకి అప్ప జెప్పకండి సార్" దీనంగా వేడుకున్నాడు.

"పోలీసుల దగ్గరికి ఎందుకు సార్.. మనమే నాలుగు తంతే సరిపోతుంది. మళ్లీ ఎప్పుడూ దొంగతనం చెయ్యడు" అన్నాడు వడ్డీ వ్యాపారి సేఠ్ ధనీరామ్. అవునని కొందరూ కాదని కొందరూ అన్నారు.

ఆ అబ్బాయి చెక్కిళ్లమీదుగా కన్నీళ్లు కారడం మొదలయింది.

"ఏం ఫరవాలేదు. నిన్ను పోలీసులకు అప్పజెప్పను... నాతో రా" అన్నాడు గవర్రాజు. వాడు ఆశ్చర్య పోయాడు. గవర్రాజు అడుగులు ముందుకు వేశాడు. చుట్టూ మూగిన జనం నోళ్లు తెరుచుకుని చూస్తూ గవర్రాజుకు దారి ఇచ్చారు. గవర్రాజు ఆ అబ్బాయితో ఇంటికి బయలుదేరాడు.

అక్కడ చేరిన జనానికి గవర్రాజు ప్రవర్తన ఏమీ అర్థం కాలేదు.

"నీ పేరేమిటి?"

"నరసిమ్మా..." బెదురుతూ గవర్రాజుకు సమాధానం ఇచ్చాడు.

"ఎక్కడుంటావు?"

"మసీదుకాడ!" నరసిమ్మ గుండెల్లో బితుకు బితుకు మంటుంది. యింటికి తీసుకెళ్లి తీరికగా తంతాడేమోనని భయం వేసింది. ఇంకా ఏమేమి అడుగుతాడో... ఈ విషయాలన్నీ పోలీసులకు చెప్తాడేమోనని భయం వేసింది. కాని గవర్రాజు ఇంక ఏమీ అడగలేదు.

గవర్రాజు మౌనంగా నడుస్తున్నాడు. అతని చెయ్యి మాత్రం గట్టిగా నరసిమ్మ చేతిని పట్టుకొని ఉంది. నరసిమ్మ మధ్య మధ్య భయంగా గవర్రాజు ముఖంలోకి చూస్తున్నాడు. ఇంతలో గవర్రాజు ఇల్లు వచ్చేసింది.

తాళం తీసి లోపలికి ప్రవేశించారు ఇద్దరూ. గవర్రాజు వీధి తలుపు గడియ వేశాడు. నరసిమ్మకి ఇంకా మనసులో భయంగానే ఉంది. గదిలో చీకటిగా ఉంది.

లైటు వెలిగింది!... ఉలిక్కిపడ్డాడు నరసిమ్మ. గవర్రాజు దీక్షగా నరసిమ్మ ముఖంలోకి చూస్తూ నిలబడ్డాడు.

"ఇక్కడే ఉండు. బయటికి పోవడానికి ప్రయత్నించావంటే పోలీసులకి



రిపోర్టు యిస్తాను — తెలిసిందా ?" అని ప్రక్క గదిలోకి వెళ్లాడు. ఒకటి, రెండు నిముషాల తరువాత చేతిలో రెండు ప్లేట్లతో వచ్చాడు. వాటిలో యాపిల్ పళ్ల ముక్కలు, రెండేసి అరటి పళ్లు, కొన్ని బిస్కట్లు ఉన్నాయి. ఒక ప్లేటు క్రింద కూర్చుని ఉన్న నరసిమ్మ ముందు పెట్టి తినమన్నాడు. వాడి కళ్లు నమ్మలేనట్లు గవర్రాజు వంక చూశాడు.

"ఊ... తిను" కాస్త గట్టిగా అన్నాడు గవర్రాజు.

గబ గబ తినడం మొదలుబెట్టాడు నరసిమ్మ. వాడు యాపిల్ పండు ఎప్పుడూ తిని ఎరగడు. యిప్పుడు వాడి మనసులోని భయం దూది పింజల్లా ఎగిరిపోయింది. గవర్రాజు వాడికేసి పరిశీలనగా చూస్తూ తింటున్నాడు. ఇంత చిన్నతనంలోనే దొంగతనాన్ని జీవనాధారంగా ఎందుకు చేపట్టాడో తెలుసుకోవాలని అనిపించింది గవర్రాజుకు. అందుకనే వాడిని ఇంటికి తీసుకువచ్చాడు.

నరసిమ్మ ముందున్న ప్లేటు ఖాళీ అయింది.

"ఆ మూల కూజా ఉంది... అదిగో... ఆ దేబులు మీద గ్లాసు

ఉంది మంచినీళ్లు త్రాగు" అన్నాడు గవర్రాజు

మంచినీళ్లు త్రాగి మూతిని చొక్కా ఎత్తి తుడుచుకుంటూ నిలబడ్డాడు నరసిమ్మ.

"కూర్చో."

క్రింద చతికిలబడ్డాడు నరసిమ్మ.

గవర్రాజు సోఫాలో కూలబడి రాములు వంకే తదేకంగా చూస్తున్నాడు. అయిదు నిముషాలు మౌనంగా గడిచి పోయాయి.

"నువ్వు జేబుదొంగగా ఎందుకు మారావు ?"

హఠాత్తుగా అడిగాడు గవర్రాజు, సూటిగా నరసిమ్మ ముఖంలోకి చూస్తూ.

నరసిమ్మ బిత్తరపోయాడు. అస్పష్టంగా మనసులోనే ఏమేమో గొణుక్కున్నాడు. తల ఎత్తి గవర్రాజు వంక చూశాడు.

"నన్ను పోలీసులకు పట్టియ్యకండి సార్" అన్నాడు దీనంగా.

"నువ్వు నిజం చెప్తే నిన్ను ఏమీ చెయ్యకుండా వదిలేస్తాను.

నరసిమ్మ తల వొంచుకున్నాడు. కాస్సేపటికి తల ఎత్తి చూశాడు. వాడి చెక్కిళ్ల మీదుగా కన్నీరు కారుతుంది,

"మూడురోజులనుండీ తిండి లేదు సార్ !"

"అరెరె... పాపం... మీ అయ్య ఏం చేస్తాడు ?"

"మాకు నాన్నలేదు సార్ అమ్మ ఉంది ఇద్దరు చెల్లెళ్లు, ఒక తమ్ముడు ఉన్నారు సార్ అమ్మకు జెర మొచ్చింది. ఈ యాలకు నాలుగు రోజులౌతుంది సార్. మా అందరికీ మూడు రోజుల నుండీ నీళ్లే సార్" అన్నాడు కళ్లు తుడుచుకుంటూ.

గవర్రాజుకు చాల జాలివేసింది. కాని పైకి మాత్రం కనబడనీయలేదు.

"అయితే మాత్రం దొంగతనం చేస్తావా ?... ఏదో పనిచేసుకుని గంజి త్రాగి బ్రతకాలి గానీ... ఈ సారికి ఏదో చేశావుగానీ ఇక ముందు దొంగ తనం చేయకు... సరేనా ?'' అన్నాడు.

''ఇంకెప్పుడూ చేయనండీ !"

దొంగతనం పాపం !... ఇంకెప్పుడూ పరులని దోచుకోవద్దు అని చెప్దామను కున్న గవర్రాజు వీపుమీద ఎవరో చెర్నాకోలతో కొట్టినట్లయి మాట్లాకుండా ఊరుకున్నాడు.

గవర్రాజు జేబులోంచి పది రూపాయలనోటు తీసి నరసిమ్మ దగ్గరికి వచ్చాడు.

''ఇదిగో... ఇది పట్టుకెళ్లి బియ్యం కొని యింట్లో ఇవ్వు" అన్నాడు.

నరసిమ్మ సందేహించాడు.

"పరవాలేదు... తీసుకో" అంటూ నరసిమ్మ చేతిలో నోటు కుక్కాడు.

నరసిమ్మ ముఖం మతాబులా వెలిగి పోయింది.

'ఇంకెప్పుడూ దొంగతనం చెయ్యవు కదూ ?''

తల అడ్డంగా ఊపాడు నరసిమ్మ

"సరే తర్వాగా బియ్యం కొని యింటికి పట్టుకెళ్లు "

నరసిమ్మ గవర్రాజుకు నమస్కారం చేసి తలుపు తీసుకుని వీధిలోకి తూనీగలా వెళ్లిపోయాడు

గవర్రాజు తలుపు వేసుకొని సోఫాలో కూలబడిపోయాడు. అతని మనసునిండా ఆలోచనలే.

నరసిమ్మ దొంగతనం చెయ్యడంలో తప్పేమీలేదు. మూడు రోజులనుండీ వాళ్లింట్లో ఎవ్వరికీ తిండిలేదు. కాయ కష్టం చేసి సంపాదించుదామంటే వాడింకా చిన్నవాడు వాళ్లమ్మ జ్వరాన పడింది. కడుపు మాడుతుంటే ఇంక అంతకన్నా ఏం చెయ్యగలడు. నరసిమ్మ దొంగ తనం చెయ్యబోయాడంటే అర్థం ఉంది. ఒంటరివాడు...తనకి...తనకి ఇంకా డబ్బు ఎందుకు ?... ఎవరికోసం ?... ఏమి చేద్దామని ?... తనకు ఇంకా డబ్బు సంపాదన అనవసరం !!

గవర్రాజు జేబులోంచి నోట్ల కట్ట బయటకు తీశాడు. అదంతా నరసిమ్మకు ఇచ్చినా అతనికి నష్టంలేదు... కానీ ఇవ్వలేదు... కేవలం పదిరూపాయలు మాత్రమే ఇచ్చాడు.

ఆలోచిస్తున్నకొలదీ గవర్రాజు బుర్ర బొంగరంలా గిర్రున తిరగసాగింది. అందుకనే అనుకుంటాడు అలా ఆలోచించకూడదని. గవర్రాజు ఇది వరలో చాలాసార్లు అనుకున్నాడు. కాని తెల్లవారేసరికి అంతా మర్చి పోతాడు

ఏమైనా సరే రేపటినుండి తను మారిపోవాలనీ, అక్రమ సంపాదన తనకు అనవసరమనీ అనుకున్నాడు గవర్రాజు.

మర్నాడు ప్రొద్దున్న ఆఫీసుకు బయలుదేరాడు గవర్రాజు. మనిషి ఆఫీసుకు అరమైలు దూరంలో ఉన్నా మనసు మాత్రం ఆఫీసులోనే ఉంది.

ఆ రోజు అఫీసుకు పిచ్చయ్య వస్తానన్నాడు. అతని పని ఒకటి గవర్రాజు ద్వారా జరగవలసి ఉంది. తన పని చేసిపెడితే అయిదు వేలిస్తానన్నాడు. ఆ రోజే తెచ్చి యిస్తానన్నాడు. ఈ రోజుల్లో మడికట్టు కుని కూర్చుంటే లాభంలేదు...వాడికి డబ్బు బాగా ఉంది. తను చేసిపెట్టే పనివల్ల లాభం బాగా వస్తుంది. తనకు కొంత యిస్తానన్నాడు. అంతే!... అసలు అన్యాయం లేని దెక్కడా ఈ రోజుల్లో అని ఆలోచిస్తూ ఆఫీసు వైపుకు నడుస్తున్నాడు గవర్రాజు.

గవర్రాజును అంతదూరంలో చూసిన నరసిమ్మ, స్నేహితులతో అప్పటిదాకా తను క్రితం రోజు చూసిన రెండవ ఆట సినిమా కథ చెప్పడం ఆపి

"అదుగోరా.. నే చెప్పలే అతనే ఆ వెర్రిబాగులోడు'' అంటూ గవర్రాజుని చూపించాడు.




జీడిగుంట రామచంద్రమూర్తి

"నేను పరీక్ష ప్యాసయ్యా నన్నయ్యా!"

పేపరు చదువుకుంటున్న రాఘవరావు తలఎత్తి చూశాడు. ఎదురుగా కృష్ణ నిలబడి వున్నాడు. స్కూలునుంచి పరుగున వచ్చినట్టున్నాడు కాబోలు - వగరుస్తున్నాడు. చెదిరిపోయిన జుట్టు నుదుటిమీద పడుతోంది.

"వెరీగుడ్! అయితే మూడో తరగతిలోకి వచ్చావన్నమాట!"— రాఘవరావు అన్నాడు ఉత్సాహంగా.

"అవునన్నయ్యా! మరి పుస్తకాలు

ఎప్పుడు కొంటావ్ ?... అప్పుడే వాళ్ళ మధు కొనేసుకున్నాడు"— కొత్త పుస్తకాలు కొనుక్కోవాలనే వాడి ఉత్సాహం వెనుక ఆత్రుత కూడా వుంది.

"అలాగే ! నేనూ కొంటానులే !... ముందు నువ్ ప్యాసయిన సంగతి మీ వదినకు కూడా చెప్పిరా"— అంటూ మళ్ళీ పేపర్లో తలదూర్చాడు రాఘవరావు...

కృష్ణ గబగబా - పెరట్లో పని చేసుకుంటున్న లక్ష్మిదగ్గరకు పరుగు తీశాడు. పేపరు చదువుతున్న రాఘవ రావుకు - అప్రయత్నంగా ఏవేవో జ్ఞాపకాలు స్మృతిపథంలోకి వచ్చాయి... కళ్లల్లో నీరు నిలచి పేపరులోని అక్షరాలు కనిపించటం మానేశాయి...

* * *

వెంకట్రామయ్యది కలిగిన కుటుంబం కాదు. ఏటా పది బస్తాల పంట ఇంటికి వస్తూంటే - దానికి సాయంగా అక్కడా అక్కడా పద్దులు రాసి మరో పదిరాళ్లు తెస్తూ - పదిమంది తోనూ పరువుగా బ్రతికేవాడు.

శాంతమ్మ కూడా పేరుకు తగిన మనిషి... భర్త తెచ్చినదానితో గుట్టుగా సంసారం సాగిస్తూ - నలుగురి తోనూ నవ్వులు పంచుకునేది.

శాంతమ్మ కాపురానికి వచ్చిన నాలుగో ఏట పుట్టాడు రాఘవరావు... ఆతని తర్వాత మరో ముగ్గురు పిల్లలు పుట్టి ముద్దు ముచ్చటలు తీర్చుకొన కుండానే - శాంతమ్మకు గర్భశోకాన్ని మిగిల్చిపోయారు... రాను రాను ఆ మనోవ్యాధి తీవ్రమై - ఆమెకు గుండె నొప్పికూడా ప్రారంభమయింది...

గట్టిగా మాట్లాడితే నీరసం వచ్చేది ఒకరోజు ఎక్కువగా ఇంటిపనులు చేసుకుంటే నాలుగురోజులు మంచం దిగలేకపోయేది... అక్కడికి వున్నంతలో మంచి డాక్టర్లకు చూపించి, టానిక్కులూ, ఇంజక్షన్లూ ఇప్పిస్తూనే వుండేవాడు వెంకట్రామయ్య...

"నీ కొడుకు డాక్టరయి వస్తేగానీ - నీ రోగం పూర్తిగా తగ్గదేమో ?" — అని అప్పుడప్పుడు అంటూండేవాడు వెంకట్రామయ్య.

"ముందీ 'ఎస్సెల్సీ' అవనీయండి! డాక్టరు సంగతి తర్వాత చూడచ్చు"— అనేది శాంతమ్మ...

అనుకున్నట్లుగానే 'ఎస్సెల్సీ' మంచి మార్కులతోనే ప్యాసయ్యాడు రాఘవరావు...

"నువ్ ఇంటర్మీడియట్‌లో క్లాసు తెచ్చుకుంటే - ఎలాగో అలా నిన్ను మెడిసిన్ చదివిస్తాను"— అన్నాడు వెంకట్రామయ్య - రాఘవరావును కాలేజీలో చేర్పించిన నాటి రాత్రి..

అందుకే రాత్రింబగళ్లు కష్టపడి చదివాడు రాఘవరావు.

ఇంటర్మీడియట్‌లో 'క్లాసు' కూడా తెచ్చుకున్నాడు.

కానీ ఏం లాభం ?...

అతని పరీక్షా ఫలితాలు నాలుగు రోజుల్లో వస్తాయనగా ఒక రాత్రి - మంచం మధ్య కూర్చుని మంచినీళ్లు త్రాగుతూ - మరో లోకానికి వెళ్లిపోయాడు వెంకట్రామయ్య...

అప్పటికి రాఘవరావుకు పదిహేడేళ్లు...

శాంతమ్మకు మూడో నెల !...

మెడిసిన్ చదవాల్సిన రాఘవరావు - మేనమామ సాయంతో సెకెండరీగ్రేడు ట్రైనింగులో చేరాడు... భర్త లేని జీవితం నిస్సారమనిపించినా - కడుపులో వున్న ప్రాణికోసం - వేళకు ఇంత తిని రోజులు లెక్కపెట్టుకునేది శాంతమ్మ... భర్తను తలుచుకుంటూ కన్నీరు పెట్టుకునేది...

చివరకు ఆ రోజు రానేవచ్చింది... శాంతమ్మకు మళ్లీ కొడుకు పుట్టాడు...

పొరుగూళ్లో ట్రైనింగవుతున్న రాఘవరావుకు తమ్ముడు పుట్టినట్లు కబురు అందగానే - అద్దె సైకిలుమీద - ఆత్రతగా ఇంటికి చేరుకున్నాడు. మంచానికి బల్లిలా అతుక్కుని వున్న శాంతమ్మను చూశాడు... దగ్గరకు వెళ్లటానికి సంశయిస్తూ - అలా గడప దగ్గరే నిలబడిపోయాడు...

"నాయనా ! రాఘవా !... ఇలా దగ్గరకు . రారా" - అని పిలిచింది శాంతమ్మ... నెమ్మదిగా వెళ్లి తల్లి మంచం దగ్గరగా - ముక్కాలి పీటను లాక్కుని కూర్చున్నాడు...

"చూశావా తమ్ముణ్ణి ?... నీ లాగా తెల్లగా లేదు కదూ ?... గోపాల కృష్ణుడు !... నల్లగా వున్నా - వీడి కళ్లు ఎంత అందంగా వున్నాయో చూశావా ?... అచ్చం మీ నాన్నగారి పోలికే కదూ ?" - అని శాంతమ్మ అంటూండగే ఆమె గొంతు గాద్గదికమయింది. రాఘవరావు కళ్లల్లో కూడా నీళ్లు నిలిచాయి.

"కడుపునపడి మీ నాన్ననూ - నేలమీద పడి తల్లినీ - దూరంచేసుకున్నాడు." - అని రెండు క్షణాలు ఆగి కన్నీరు తుడుచుకుంది శాంతమ్మ... ఆమెను ఓదార్చే వయసు రాఘవరావుకు లేదు... శాంతమ్మ మళ్లీ అంది...

"బాబూ రాఘవా ! నల్లగా వున్నాడని వీణ్ణి అసహ్యించుకోకేం !... నువ్ డాక్టరు కావాలని మీ నాన్న ఎంతో ఆశపడేవారు... వీడినైనా డాక్టర్ని చేస్తే-ఆయనఆత్మశాంతిస్తుంది"-అంటూ రాఘవరావువైపు ఆశగా చూసింది...

"అమ్మా !"... తల్లి గుండెలమీద వాలిపోయి - పసిపిల్లాడిలా విలపించాడు రాఘవరావు. ఆప్యాయతగా తల నిమిరింది శాంతమ్మ...

"మనసులో ఏ దిగులూ పెట్టు







కోకుండా చదువుకోవాలి!... నువ్ వృద్ధిలోకి వచ్చి - తమ్ముడ్ని డాక్టర్ని చెయ్యాలి... మీ నాన్నగారి ఆశీస్సులూ- నా దీవెనలూ - మీకు ఎప్పుడూ వుంటాయి "— అది శాంతమ్మ చివరి దీవెన...

అంతటితో ఆ యింటి దీపం ఆరి పోయింది. తాను తల్లి భౌతికదేహం మీద పడి ఏడుస్తూంటే ఎవరెవరో వచ్చి ఓదార్చారు. రావలసిన బంధువులందరూ వచ్చి చేయవలసిన విధులన్నీ - తనచేత చేయించారు. రాఘవరావు ఓ యింటి వాడయ్యేవరకూ - కృష్ణుడ్ని తన దగ్గర వుంచుకుంటానని మాట యిచ్చాడు - అతని మేనమామ... తన కూతురు లక్ష్మిని - ఎప్పటికైనా రాఘవరావు చేసుకోవాలని అతని నిర్ణయం...

* * *

గత స్మృతుల ప్రవాహంలో కొట్టుక పోతున్న రాఘవరావు చేతిమీద చల్లని స్పర్శ కలగటంతో వాస్తవానికి వచ్చి చూశాడు.

"ఏడుస్తున్నావా అన్నయ్యా" - అంటూ తన కళ్లల్లోకి చూస్తున్న కృష్ణుడ్ని ఎత్తుకుని - హృదయానికి గట్టిగా హత్తుకుని - నుదుటిమీద ముద్దు పెట్టుకున్నాడు.

"ఏం? తమ్ముడుగారు ఎమ్మే పరీక్ష ప్యాసయ్యారనా, అంత ప్రేమ ఒలక పోస్తున్నారు?" - అంది లక్ష్మి అప్పుడే పెరట్లోంచి వస్తూ...

"నా కృష్ణ ఎమ్మే చదవడు లక్ష్మీ!... మెడిసిన్ చదువుతాడు... పెద్ద డాక్టరవుతాడు"—

" ! ఆ కావల్సిందే!

ఆ యోగమే వుంటే-తల్లితండ్రులనిద్దర్నీ ఎందుకు పొట్టను పెట్టుకుంటాడు ?"—

"లక్ష్మీ !" - గట్టిగా అరిచాడు. రాఘవరావు. అతనిలోని కోపాన్ని చూసి మెల్లగా ప్రక్కగదిలోనికి వెళ్లి పోయాడు కృష్ణ...

"అవును ! నేనన్నది తప్పా ? వాడు నష్టజాతకుడు కనుకనే తల్లి తండ్రుల ప్రేమకు నోచుకోలేదు..."- మళ్లీ అదే మాటను మరి కొంచెం మార్చి అన్నది లక్ష్మి... అంతే !... ఆమె చెంప ఛెళ్లుమంది.

ఏడుస్తూ పడకగదిలోకి వెళ్లి పోయింది లక్ష్మి...

* * *

"కృష్ణ అంటే అంతద్వేషం ఎందుకో నాకర్థంకావటంలేదు"— అన్నాడు రాఘవరావు. ఆ రాత్రి కృష్ణ నిద్ర పోయిన తర్వాత...

లక్ష్మి బదులు చెప్పలేదు...

"అయినా వాడికి నువ్వంటే ఎంత గౌరవమో తెలుసా ?... వాడు తల్లీ తండ్రీ లేని నష్టజాతకుడన్నమాట నిజమే కావచ్చు... కానీ మనం వాడికి ఆలోటు కనిపించనీయకూడదు లక్ష్మీ... కనిపించనీయకూడదు... అమ్మ తన చివరి ఘడియల్లో నన్ను ఏం కోరిందో తెలుసా ?... నల్లగా వున్నాడనీ – తల్లి తండ్రుల్ని పొట్టను పెట్టుకున్నాడనీ అసహ్యించుకోకుండా - వీడ్ని డాక్టరు చదివించమని నన్ను అర్థించింది లక్ష్మీ.. ఇవాళ వీడు పరీక్ష ప్యాసయినందుకు మా అమ్మే బ్రతికి వుంటేఎంత ఆనందిం చేదో తెలుసా? వాడికి ఇష్టమయిన పిండి వంటలు కూడా చేసిపెట్టేది..."— ఈ మాటలు అంటూంటే రాఘవరావు కళ్లు ఆర్ద్రాలయ్యాయి.

"ఇప్పుడుమాత్రం ఎవరు కాదన్నారు ?. ప్రొద్దున్నే చెప్పివుంటే ఓ పిండివంట నేనూ చేసేదాన్నిగా ? ఈ మాత్రానికే అంత కష్టపెట్టుకోవాలా ?"- లక్ష్మి మాటలలో ప్రేమా వాత్సల్యమూ కంటే - విసుగే ఎక్కువ వినిపించింది రాఘవరావుకు... అందుకే ఆమెకు బదులుచెప్పి ప్రయోజనం లేదను కున్నాడు.

గతాన్నీ, వర్తమానాన్నీ, భవిష్యత్తుతో పోల్చి చూసుకుంటే అతనికెందుకో ఒక్కసారిగా భయం వేసింది !...

తాను ఆశించిందేమిటి ?...

లక్ష్మి కాపురానికి వచ్చి అప్పుడే ఆరుసంవత్సరాలయిపోయింది...అయినా తమకు పిల్లలు పుట్టనేలేదు... తాను ఎంతో బాధపడ్డాడు. అంతకుమించి లక్ష్మి మనోవేదన కూడా గ్రహించాడు.. ఎలాగో గుండె దిటవుచేసుకుని - తమకు పిల్లలు లేని లోటును కృష్ణ తీర్చగలడని విశ్వసించాడు.

మరి ఇప్పుడు జరుగుతున్న దేమిటి ?...

తన మాతృప్రేమను పంచి ఇవ్వక పోగా చీటికి మాటికీ కృష్ణను చివాట్లు వేయటం లక్ష్మికి అలవాటయి పోయింది ... అయినా వదినంటే వాడికి వల్లమాలిన అభిమానం... దానికి తోడు భయం!... నిజమే! కడుపున పడి తండ్రినీ - నేలమీద పడి తల్లినీ కోల్పోయాడు... దానికి తోడు తమ నీడన వాడుంటున్నందుకే తన కడుపు పండలేదని లక్ష్మి నమ్మకం!... ఏది ఏమైనా, నష్టజాతకుడనే భయం కరమైన నీడ వాడిమీద పడకూడదు... ఎలా ?...

* * *

లక్ష్మికి వంట్లో నలతగా వుందంటే- లేడీ డాక్టర్ చేత పరీక్ష చేయించాడు రాఘవరావు. పరీక్షించిన తరువాత లేడీ డాక్టరు నిజంగా శుభవార్తే చెప్పింది... తాను తండ్రి కాబోతున్నాడు... అసలు ఆ నిజాన్ని వింటాడని రాఘవరావు అనుకోలేదు ఆక్షణాన అతని కళ్ళల్లో కలిగిన గర్వం అంతా ఇంతా కాదు... లక్ష్మి ఆనందానికయితే హద్దే లేక పోయింది.

కృష్ణ నీడనే అసహ్యించుకునే లక్ష్మి - రేపు తాను ఓ బాబుకో పాపకో తల్లి అయిననాడు - ఈ మాత్రం కూడా కృష్ణను లక్ష్యపెట్టకపోవచ్చు...

కృష్ణభవిష్యత్తును తలచుకుంటూంటే రాఘవరావుకు భయంవేసింది... ఏమైనా తాను తల్లికి ఇచ్చిన మాట నిల బెట్టుకోవాలి...! అది తన ఏకైక నిర్ణయం... అందుకు అవసరమయిన శక్తినీ - అవకాశాన్నీ ప్రసాదించమని, దైవాన్ని మనసులోనే ప్రార్థించు కున్నాడు రాఘవరావు...

* * *

బాబు ఎంతో అందంగా వుంటాడు.. వాడి నోరు చాలా చిన్నది... మనుషులు దగ్గరకు వస్తే ఇప్పుడిప్పుడే కళ్లు గుండ్రంగా తిప్పి చూస్తున్నాడు.

వాడి సంరక్షణలో లక్ష్మికి ఇప్పుడు ఒక్క క్షణం కూడా తీరిక దొరకటం లేదు... రాఘవరావుకు కూడా బాబుతో కాలక్షేపం బాగా జరిగిపోతోంది...

కృష్ణకు బాబు పంచప్రాణాలు... బడినుంచి రాగానే వాడు పడుకున్న మంచంమీద కూర్చుని వాడ్ని నవ్విస్తూ కబుర్లు చెబుతాడు... లక్ష్మి సీసాలో పాలుపోసి ఇస్తే - వాటిని బాబుకు పడుతూ - వాడు తాగుతూంటే తాను మురిసిపోతాడు...

"బాబు పెద్దయ్యాక మే మిద్దరం కలసి బడికి వెళ్ళచ్చు కదూ-"

"నా పుస్తకాలు బాబుకి పని కొస్తాయి - జాగ్రత్తగా దాస్తాను"- అని కృష్ణ అప్పుడప్పుడు అంటూంటే నిండుగా నవ్వుకునేవాడు రాఘవరావు ..

"ఏమండీ! బాబు పుట్టినరోజు పండుగ ఇంక పదిరోజులే వుంది"— అని గుర్తుచేసింది లక్ష్మి— ఓ రోజు రాత్రి...!

పరీక్ష పేపర్లేవో దిద్దుతూన్న రాఘవరావు 'అలాగా'— అన్నాడు మామూలు ధోరణిలో...

"వాడి పుట్టినరోజు పండుగ ఘనంగా చేయాలి!... మన స్నేహితు లందరికీ 'టీపార్టీ' కూడా యిద్దాం..." లక్ష్మి చెప్పుకుపోతూంటే వినటం రాఘవరావు వంతైంది...

ఆ మర్నాటినుంచీ బాబు పుట్టిన రోజు పండుగ ఏర్పాట్లు భారీ ఎత్తున ప్రారంభమైనాయి. కృష్ణ ఆనందాని కయితే అంతులేదు. పుట్టినరోజు పండుగను అంత ఘనంగా జరుపుతారని వాడికి తెలియనే తెలియదు... కానీ వాడి మూగ మనస్సులో ఎక్కడో అనిపించింది... తనకూ అమ్మ వుంటే అలా పుట్టినరోజు వేడుక జరిపివుండే దేమోనని!...

అందుకే ఆ రాత్రి అన్నం తింటూ— పక్కనేవున్న అన్నయ్యను అడిగాడు—

"అమ్మ లేకపోతే పుట్టినరోజు పండుగ చేయకూడదా అన్నయ్యా?"— అని.

"ఎందుకు చేయకూడదూ?" అన్నాడు రాఘవరావు పరధ్యానంగా.

"మరి నాకు ఎప్పుడూ పుట్టినరోజు పండుగ చేయలేదేం?"— వాడి అమాయక మైన ప్రశ్నకు రాఘవరావు ఖంగారు పడ్డాడు.

"పిచ్చి ప్రశ్నలు వేయక త్వరగా లే!"—అంటూ కృష్ణ కంచంలో మజ్జిగపోసి విసుక్కుంది లక్ష్మి...

వాడి పుట్టినరోజునే - తామిద్దరూ తల్లిలేని వాళ్ళమయ్యామని రాఘవరావు చెప్పలేదు!.. అందుకే అన్నం సహించక - చేయి కడుక్కొని లేచి పోయాడు...

ఆ రాత్రి బాబుకూడా సరిగా పాలు తాగలేదు... రాత్రంతా ఒకటే ఏడుపు. వాడిని సముదాయించటంతోనే ఆ రాత్రి గడిచిపోయింది.

ప్రొద్దున్న బాబుకు జర్వం తగిలితే డాక్టర్ని తీసుకొచ్చాడు రాఘవరావు. ఆయన పరీక్షచేసి ఏదో ఇంజక్షన్ ఇచ్చి వెళ్లిపోయాడు... ఆ సాయంత్రా నికి బాబుకు జర్వం మరింత తీవ్ర మయింది. మూసిన కన్ను తెరవకుండా పడుకున్నాడు. ఎందరు దేవుళ్ళకో మ్రొక్కుకుంది లక్ష్మి...

మెల్లగా వచ్చిన 'అమ్మవారు' చల్లగా జారిపోతే నైవేద్యాలు పెడతానన్నది...

"ఊళ్లో ఇంతమంది పిల్లలుంటే — లేక లేక పుట్టిన నా బాబుమీద ఎందుకమ్మా ఇంత కక్ష?... అంతకీ నీ కక్ష తీర్చుకోవాలంటే - ఆ నష్ట





జాతకుడు కిష్టిగాడ్ని పట్టుకోలేక పోయావా?"—

అప్పుడే బడినుంచి వచ్చి, బాబు గదిలోకి రాబోతున్న కృష్ణ వదిన మాటలు విన్నాడు... బాబు మంచం మీద — శోకమూర్తిలా కూర్చున్న వదినను చూశాడు. ఆమె కళ్ళనుంచి ఏకధారగా ప్రవహిస్తున్న కన్నీటిని గమనించాడు... వాడి పసి మనసు బాధతో మూలిగింది... లోపలకు రాకుండా పుస్తకాలు అక్కడే వున్న కుర్చీలో పెట్టి వీధిలోకి పరుగెత్తాడు...

* * *

పుట్టినరోజునాటికి బాబు పూర్తిగా కోలుకున్నాడు. ఆ రోజు ఉదయమే బాబుకు తలంటుపోసి — హారతి ఇచ్చి కొత్తబట్టలు వేసింది లక్ష్మి.

"ఓ ప్రక్కన కృష్ణకు ఒంట్లో బాగా లేదు కదా — ఈ రోజు విందివంటలూ అవీ ఎందుకులెద్దూ" — అన్నాడు రాఘవరావు

"కృష్ణ మాత్రమే కాదు!... ఊరంతా అల్లాగే వుంది... రెండు రోజులుండి అదే తగ్గిపోతుంది ఈ మాత్రానికి మన బాబు పుట్టినరోజు వేడుక మానుకుంటామా?" — అన్నది లక్ష్మి 'మన' అనే మాటను మరింత ఒత్తి పలుకుతూ...

ఆ సాయంత్రం పేరంటమూ — తేనీటి విందూ — అన్నీ ఘనంగానే జరిగి పోయాయి... వచ్చిన అతిథులందరూ బాబును ఆశీర్వదించారు...

"వదినా! బాబును ఒకసారి తీసుక రావూ!.. కొత్తబట్టలు వేసుకుంటే ఎలా వున్నాడో చూస్తాను"—.. గదిలో మంచంమీద పడుకున్న కృష్ణ — పేరంటం అయిపోయిన తర్వాత వదినను పిలిచాడు. బాబును అయిష్టంగానే కృష్ణ దగ్గరకు తీసుకువెళ్ళింది లక్ష్మి.

"బాబుకు కొత్త బట్టలు వేస్తే - ఎంత ముద్దొస్తున్నాడో చూశావా వదినా ?.. పెద్దవాడయిపోయినట్లు లేదూ ?... నా పుస్తకాలూ, పలకా అన్నీ బాబుకి ఇచ్చేయ్ వదినా !... బాబు అన్ని క్లాసులూ చదువుకుని డాక్టరవుతాడు.. ఇంకెప్పుడూ బాబుకి జబ్బు చేయదులే !... దేవుడికి చెప్పే శాను" - కృష్ణ మాటలు అర్థంకాక, అయోమయంగా చూసింది లక్ష్మి...

"ఏమని చెప్పావ్ దేవుడికి ?" - అడిగింది లక్ష్మి...

"మా బాబు ఎంతో అందంగా వుంటాడు... వాడంటే మా వదినకు ప్రాణం... అంతగా నీ కక్ష తీర్చు కోవాలంటే - బాబుకి వచ్చిన రోగాన్ని నాకు ఇచ్చి, బాబుకి నయం చెయ్యి తల్లీ - అని ఆ రోజున దుర్గ గుడిలో దణ్ణం పెట్టుకున్నానుగా...! అందుకే బాబుకి జ్వరం తగ్గిపోయి నాకు వచ్చింది ఇంక వాడికి ఎప్పుడూ జబ్బు చేయదు వదినా !"— కృష్ణ తృప్తి నిండిన కళ్లతో బాబువైపే చూస్తూ అలా మాట్లాడుతూంటే అమాయకమైన వాడి మాటలకు లక్ష్మి హృదయం ద్రవించిపోయింది. ఆమెలోని మాతృ ప్రేమ ఒక్కసారిగా కట్టలు తెంచుకుంది.

"అలా అనకు కృష్ణా ! నీకూ జ్వరం తగ్గిపోతుంది !... నువ్వు కూడా నాకు కావాలి కృష్ణా... మీరిద్దరూ నాకు రెండు కళ్లు... అంటూ కృష్ణను నుదుటిమీద ముద్దు పెట్టుకుంది లక్ష్మి...

కృష్ణ - ఆ క్షణంలో - వదినలో తన తల్లిని చూడగలిగాడు...

అప్పుడే గదిలోకి వచ్చిన రాఘవరావు ఆ దృశ్యాన్ని చూసి తృప్తిగా నిట్టూర్చాడు...

"ఏమండీ ! ఇకనుంచీ బాబు పుట్టిన రోజుతోపాటే కృష్ణ పుట్టినరోజు కూడా చేద్దామండీ" - అన్నది లక్ష్మి - ఆ రాత్రి రాఘవరావు భోజనం చేస్తూంటే...

''అలాగే !" అని పైకి సమాధానం చెప్పి — రాఘవరావు—

''నీ కోరిక తీర్చగలననే నమ్మకం నాకిప్పుడిప్పుడే కలుగుతోందమ్మా !'' - అని మనసులోనే అనుకున్నాడు !..






(గత సంచిక తరువాయి)

**మర్కట యువకుడి కథ**

మర్నాడు రాత్రి మంత్రి కుమార్తె తిరిగి ఇలా ఆరంభించింది

సుల్తాన్ మహమ్మద్ తన కథను ఇలా కొనసాగించాడు.

నేను వెంటనే దుకాణాలకు పరిగెత్తిపోయి, నా జన్మలో ఎన్నడూ రుచి చూడని ఆహార పదార్థాలతో పొదుపడిన ఇంటికి తిరిగివచ్చాను. మా తిండి పూర్తి అయేసరికి రాత్రి చాలా పొద్దుపోయింది. మర్కటయువకుడూ, నేనూ, పక్కపక్కనే పడుకుని నిద్రపోయాం. నా అదృష్టం నా పక్కనే ఉన్నదన్న ధైర్యంతో నేను నిశ్చింతగా నిద్రపోయాను. నిద్రావస్థలోకి జారుతూ నేను అల్లాకు ధన్యవాదాలు చెప్పుకున్నాను.

మర్నాడు ఉదయం ఆ యువకుడు నన్ను నిద్ర లేవగొట్టి, "ఒక్క రాత్రి కటికనేలమీద పడుకునేసరికి ప్రాణం

చాలొచ్చింది. నగరంలోకి వెళ్లి మంచి భవంతి ఒకటి కిరాయికి తీసుకో. దాన్ని చక్కగా అమర్చు. డబ్బు దగ్గిర చూడకు!" అన్నాడు.

అతను నాకు బంగారం ఇచ్చాడు. నేను చప్పున ఉపక్రమించి, శీఘ్రంగా పని పూర్తి చేశాను. కొద్దిగంటల లోపున మేమిద్దరమూ కైరోలోని ఉత్తమ భవనంలో గృహ ప్రవేశం చేశాం.

తరవాత యువకుడు నాతో, "మహమ్మద్, అలాటి కుళ్లుగుడ్డలతో నా వెంట ఉండటానికి నీకు నామోషీ అనిపించటంలేదూ? ఒక్కసారి హమ్మామ్‌కు వెళ్లిరారాదూ? రాజులందరికీ కలిపినా లేనంత డబ్బు ఉండగా నీకు ఉడుపులకు కొదవేమున్నది?" అన్నాడు.

నేను అతనికి వంగి సలాంచేసి, స్నానశాలకు వెళ్లి, ఏళ్ల తరబడి ఒంటిని ఆశ్రయించుకున్న మురికినంతా ఒక్క దివ్యమైన స్నానంతో వదిలించుకున్నాను.

తరువాత అద్భుతమైన దుస్తులు ధరించి నేను వెళ్లి ఎదురుగా నిలబడేసరికి ఆ యువకుడు, "ఇప్పుడు నాకు కావలసినట్టున్నావు" అన్నాడు. నా అదృష్టం తిరిగిందనుకుంటూ నేను అతని సరసన కూర్చున్నాను.

కొంచెంసేపయాక అతను నా భుజంతట్టి, "రాజు కూతురు రంజాన్ చంద్రుడికన్న రంజుగా ఉంటుంది ఆమెను పెళ్లాడతావా ఏం?" అన్నాడు.

"ఆమెదే ఆభ్యంతరం!" అన్నాను.

"అలా అయితే, లేచి బయలుదేరు. ఈ పొట్లం తీసుకొని కైరోసుల్తాను వద్దకు వెళ్లి, ఆయన కుమార్తెను పెళ్లాడవచ్చినట్టు చెప్పు. ఆమె నీకు రాసిపెట్టి ఉన్నది సులాను నిన్ను చూస్తూనే తన కుమార్తె నియ్యటానికి సిద్ధపడతాడు. కాని ఈ పొట్లం రాజుగారి కియ్యకుండా ఏమీ అనకు."

పొట్లం ఒక బానిసచేత పట్టించుకుని నేను రాజభవనానికి వెళ్లాను. అక్కడి కొజ్జాలూ, భటులూ నా దుస్తులూ, వాలకమూ చూసి దిగ్భ్రమచెంది, ఏమి సెలవు అని అతి మర్యాదగా అడిగి, నేను సుల్తానుగారికి కానుక తెస్తున్నానని చెప్పగానే, లాంఛనాలన్నీ ముగించి నన్ను సుల్తానుగారి సన్నిధికి చేర్చారు.

నేను ఏమాత్రమూ బెదరిపోక, పుట్టింది లగాయతూ రాజులతో భుజాలు రాసుకుని తిరిగినవాడిలాగా, సుల్తానుకు గంభీర ప్రణామం చేశాను ఆయన నన్ను ఆదరపూర్వకంగా పలకరించగానే కానుక ఆయనకు అందిస్తూ, "మహారాజా, ఈ చిన్న కానుక స్వీకరించండి ఇది నా పేద స్థాయికి తగినదేగాని, తమ స్థాయికితగినది కాదు," అన్నాను

సుల్తాను తన పెద్ద వజీరుచేత



పొట్లం విప్పదీయించి, అందులో నమ్మ శక్యంగాని ఉత్తమజాతి రత్నాలను చూసి అమితాశ్చర్యంతో, "మంచిది? నీ కోరిక ఏమిటో చెప్పు. కానుక లియ్యటంతో రాజులు ఎవరికీ తీసి పోరు," అన్నాడు.

"మహారాజా, నాకు తమ పెద్ద కుమార్తె నిచ్చి పెళ్లిచెయ్యండి," అన్నాను.

సుల్తాను నాకేసి చాలాసేపు తేరి పార జూసి, ''మంచిది!" అని, తన పెద్ద వజీరుకేసి తిరిగి, "ఈ మహ నీయుణ్ణి గురించి ఏమంటారు?" అని అడిగాడు.

"అతను అలాంటి కోరిక కోరదగని వాడు కాదు. కాని ముందుగా పరీక్షించి చూడటం మంచిదనుకుంటాను," అన్నాడు పెద్దవజీరు.

'ఎలా?" అని సుల్తాను అడిగాడు.

"మీ రత్నాగారంలో ఉన్న మేలి రత్నాలన్నిటిలోనూ ఉత్తమమైనదిగా ఎంచి, అలాటిదే మరొకటి రాజకుమార్తెకు కానుకగా తెమ్మనండి," అన్నాడు వజీరు

నాకు గుండె పీచుపీచుమంటున్నా పైకి బింకంపోతూ, ఆ షరతుమీద నాకు రాజకుమార్తె నిచ్చి పెళ్లిచేస్తారా అని సుల్తాను నడిగాను

ఆయన తనవద్దనున్న గొప్ప వజ్రం తెప్పించి నాకు చూపుతూ, "ఇదే మాదిరి వజ్రాన్ని తెచ్చినట్టయితే నా కూతురు నీదే!'' అన్నాడు.

నేను ఆ వజ్రాన్ని అమిత జాగ్రత్తగా పరిశీలించి, అన్ని వివరాలూ మనసులో పెట్టుకొని, మర్నాడు వస్తానని చెప్పి, సెలవుపుచ్చుకుని వచ్చేశాను.

నేను తిరిగి రాగానే ఆ యువకుడు, "నీ పెళ్లిప్రయత్నంఎంతదాకావచ్చింది?" అని అడిగాడు.

నేను జరిగినదంతా అతనికి చెప్పి, నేను చూసిన వజ్రాన్ని వర్ణించాను.

"అదేమంత పెద్ద సమస్య కాదులే. ఈ రోజుకు చేసేదేమీలేదు. రేపు ఉదయం, నువు చూసిన వజ్రాంలాటివి పది తీసుకుపోయి ఇద్దువుగానిలే," అన్నాడు యువకుడు.

మర్నాడు తెల్లవారుతూనే అతను మా భవనం వెనక ఉన్న తోటలోకి వెళ్లి ఒక గంట తరవాత, పావురం గుడ్డంత ప్రమాణంలో ఉండే వజ్రాలు, సుల్తానువద్ద నేను చూసిన వజ్రం లాటివే, పది తెచ్చాడు.

నేను వాటిని తీసుకుని రాజభవనానికి వెళ్లి, సుల్తాను ముందు నిలబడి, ''నా పేదరికాన్ని మన్నించాలి. నా నా దగ్గిర ఈ పది వజ్రాలే ఉన్నాయి. అందులో మీకు నచ్చినది ఒకటి తీసుకుని, మిగిలినవి అవతల పారెయ్యండి,'' అన్నాను. ఇలా అంటూ నేను నా వెంట తెచ్చిన పెట్టె తెరిచి చూపాను. అందులో ఉన్న పది వజ్రాలూ తన వజ్రంలాటివేనని చూడగానే సుల్తాను సింహాసనంమీద చేరగిలబడిపోయాడు.

ఆయన చెయ్యి ఊపి వజీరును, "ఏంచెయ్యాలిప్పుడు?" అన్నట్టు అడిగాడు.

"పిల్లనిచ్చెయ్యండి!" అన్నట్టు వజీరు తలా, చెయ్యీ ఎగరేశాడు.

వెంటనే పెళ్లి ప్రయత్నాలు ప్రారంభించటానికి ఉత్తరువులు జారీ అయాయి. కాజీ, సాక్షులూ పిలవబడ్డారు. వివాహపత్రం రాశారు. ఆ పత్రాన్ని నాకు చూపిస్తే, నేను దాన్ని నా వెంట తెచ్చిన మర్కట యువకుడికి చూపాను. నాకు రాయటమూ, చదవడమూ రాదని తెలిసి అతను దాన్ని పైకి చదివాడు.

తరువాత అతను నన్ను అవతలికి

తీసుకుపోయి, "మహమ్మద్, ఇప్పుడు నువ్వు సుల్తాను కూతుర్ని చట్టరీత్యా పెళ్లాడావు. కాని నువ్వు నాకు ఒక్క విషయం మాట ఇయ్యాలి," అన్నాడు.

"నా ప్రాణం కావాలన్నా నీదే!" అన్నాను.

"అలా అయితే, నేను చెప్పినదాకా నీ భార్యను అంటకు. ఆమె కన్యాత్వం పోకముందే నాకు ఆమెవల్ల కొంత పని కావాలి," అన్నాడు యువకుడు నవ్వుతూ

గర్భాధానపు గదిలో నేను రాజకుమార్తెకు దూరంగా కూర్చున్నాను. నేత్రావధానంతో తృప్తిపడ్డానేగాని ఆమెను తాకలేదు. మరుసటి రాత్రీ, మూడో రాత్రీ కూడా అలాగే గడిచింది.

ప్రతిసారీ తెల్లవారగానే రాణి వచ్చి విచారించడమూ, రాజకుమార్తె ఏమీ జరగలేదని చెప్పటమూ జరిగింది.

నాలుగోరోజు ఉదయం రాణీ పెద్ద పెట్టున ఏడుస్తూ," ఎందుకిలా మనకు అవమానం తెస్తున్నాడు? నీ దగ్గరికి ఎందుకు రాడు? బంధువుల దగ్గిరా, దాసీల దగ్గిరా ఎంత అప్రతిష్ఠ! ఏమేమి దోషాలు అంటగట్టుతారో గదా!" అన్నది.

ఆవిడ వెళ్లి సుల్తాను దగ్గిర తన గోడు చెప్పుకున్నది.

"ఇవాళ రాత్రి పిల్లకు కన్నె చెర విడకపోయిందో, వాడి పీక కోసేస్తాను," అని సుల్తాను శపథం చేశాడు.

నేను వెళ్లి మర్కటయువకుడితో నాకు వచ్చిన బెడద చెప్పుకున్నాను.

సమయం ఆసన్నమయింది, మహమ్మద్. నేను చెప్పినట్టు చెయ్యి. నీ భార్య కుడిచేతికి ఒక కంకణం ఉన్నది. నువ్వు ఆమెను పొందటానికి పూర్వం ఆ కంకణం అడిగి పుచ్చుకుని, తెచ్చి నాకిచ్చెయ్యి. ఆ తరువాత నువ్వు ఆమెతో యథేచ్ఛగా సుఖించు," అన్నాడు యువకుడు

ఆ రాత్రి గదిలో నేనూ, ఆమె ఒంటరిగా ఉన్నప్పుడు ఆమెతో "ప్రియా, ఈ రాత్రి మనం సుఖించాలని కోరికగా ఉన్నదా?" అన్నాను

"ఉన్నది," అన్నదామె

"అలా అయితే నీ కుడిచేతి కంకణం తీసి ఇయ్యి." అన్నాను

ఆమె ఆ కంకణాన్ని ఊడదీసి నాకిచ్చింది. నేను ఏదో వంక చెప్పి. వెంటనే వస్తానంటూ, వెళ్లి ఆ కంకణాన్ని మర్కటయువకుడికి ఇచ్చాను

అతను దాన్ని తీసుకుని తృప్తిగా శ్వాస విడిచి, "ఇక నువ్వు నీ భార్య వద్దకు వెళ్లవచ్చు," అన్నాడు. నేను అందరికీ సంతృప్తికరంగా నీ భార్య కన్యాత్వాన్ని భంగంచెయ్యటానికి శరవేగంతో తిరిగివచ్చాను.

ఆమె పక్కమీద నా కోసం ఎదురు చూస్తూ సిద్ధంగా ఉన్నది. కాని నేను ఆమెకేసి అడుగు వేసేటంతలో అంతా చీకటి అయిపోయింది. నేను పాడుపడిన కొంపలో కిటికీ నేలమీద పడుకుని ఉన్నాను. రాజోచితమైన నా దుస్తులు పోయి నా ఒంటిమీద అతుకులబొంతతే మిగిలాయి. నా నెత్తిన సాధువుల గుడ్డా, నా పక్కన చేతికర్రా ఉన్నాయి.

'నేను మేలుకున్నానా, నిద్ర పోతున్నానా? సాధువునా? రాజ కుమారుణ్ణా?' అనుకున్నాను.

నేను లేచి నిలబడి, మర్కట యువకుడిలాగా ఒళ్లంతా విదిలించు కున్నాను. కాని ఏమీ లాభం లేక పోయింది

మతిచెడి, వీధుల వెంట తిరుగుతూ, ఒక సందులో బర్బరీ దేశపు మూర్‌ను చూశాను. అతను ఒక చాపమీద కూర్చుని ఉన్నాడు. అతని ముందు చిన్న తివాసీమీద ఏవో పత్రాలూ, జ్యోతిష పరికరాలూ ఉన్నాయి

అతన్ని చూడగానే నాకు పరమా నందం కలిగింది నేను అతని ముందు చతికిలబడి, నా జాతకం చెప్పమన్నాను.

అతను సూదుల్లాటి చూపులతో నన్ను చూసి, "సాధూ! భార్యనుంచి వేరుచెయ్యబడ్డది నువ్వేనా?'' అని అడిగాడు.

''యా అల్లా! అవును!" అన్నాను.

"అభాగ్యుడా, నువు అయిదు దిరహములిచ్చి కొన్న మర్కట యువకుడు మామూలు మనిషికాడు. వాడొక దుష్టపిశాచి. వాడికి సుల్తాను కుమార్తెమీద భరించరానంత మోహం పుట్టింది. కాని ఆమె కుడిచేతికి కంకణం రూపంలో ఉన్న రక్షమూలంగా ఆమెను సమీపించటం వాడికి సాధ్యంకాలేదు. అందుచేత ఆ రక్షనుసంగ్రహించటానికి నిన్ను వాడుకున్నాడు. అయితే వాణ్ణి నిర్మూలించగలనని నా ఆశ!" అన్నాడు మూర్.

అతను కాగితంమీద ఏవో అక్షరాలు రాసి నాకిచ్చి, "నీ అదృష్టాన్ని నమ్ముకో. ఈ కాగితం తీసుకుని నేను చెప్పిన చోటికి వెళ్లు. అటుగా ఒక దళం పోతూ నీకు కనిపిస్తుంది. ఈ కాగితాన్ని ఆ దళాధిపతికి ఇయ్యి. నీకు అదృష్టం కలిసివచ్చేదాకా నాకు ఏ బహు మానమూ ఇయ్యనక్కర్లేదు," అన్నాడు.

నేను అతనికి ధన్యవాదాలు చెప్పి, అతను చెప్పిన ప్రకారం ఆ రాత్రీ, మర్నాడు పగలూ నడిచి, మర్నాడు రాత్రికి ఒక ఎడారిప్రాంతం చేరాను. అక్కడ గడ్డి తప్ప ఏమీలేదు. నేను అక్కడ కూర్చుని కాగలదానికి వేచి ఉండగా గబ్బిలాలు ఎగురుతున్న చప్పుడులాంటిది వినిపించింది, కాని ఏమీ కనిపించలేదు. నాకు గుండెలో నుంచి దడపుట్టుకొచ్చింది.



ఇంతలో నాకు కదిలిపోతున్న కాగడాలు కనిపించాయి. అవి దూరంగా పోతున్నాయి గాని, వాటిని పట్టుకున్న చేతులూ, వ్యక్తులూ కనిపించలేదు. అయితే కాగడాలు హెచ్చుగా ఉన్న ప్రాంతంలో ఒక ఆసనంమీద పోతున్న రాజును చూశాను నా పక్కగా పోతూ ఆయన నాకేసి తీక్షణంగా చూశాడు. కాని భయంతో మోకాళ్లు వణికిపోతూ, నే నాయనను పలకరించలేకపోయాను.

ఆయనే నన్ను పలకరించి, "నామిత్రుడు ఖైర్పురీ మూర్ నాకు రాసిన లేఖ ఎక్కడ?" అని అడిగాడు.

నేను కాస్త ధైర్యం తెచ్చుకుని, ముందుకు వెళ్లి, ఆయనకు కాగితం ఇచ్చాను.

అతను వెంటనే ఊరేగింపును నిలిపి, దివిటీల వెలుతురులో కాగితాన్ని చదివి, "అత్రష్, శీఘ్రంగా కైరోకు వెళ్లి, ఫలాని పిశాచిని గొలుసులతో బంధించి తీసుకురా!" అని ఎవరినో ఆజ్ఞాపించాడు.

ఒక గంటకల్లా నా మర్కట యువకుణ్ణి అదృశ్యహస్తాలు లాక్కొచ్చి రాజు ముందు నిలబెట్టాయి.

"ఈ మనిషి నోటి ముందు కబళాన్ని ఎందుకు కాజేశావు? దాన్ని

నువే ఎందుకు కబళించావు?" అని రాజు మర్కటయువకుణ్ణి అడిగాడు

"ఆ కబళానికి ఏ అపాయమూ కలగ లేదు. అది నా కోసం సిద్ధంచేసుకున్న కబళమే," అన్నాడు మర్కట యువకుడు.

"అలా అయితే రక్షాకంకణం అతనికి తిరిగి ఇచ్చెయ్యి. లేదా నీ అంతు చూస్తాను," అన్నాడు రాజు.

"అది నా దగ్గిరే ఉన్నది దాన్ని నానుంచి ఎవరూ తీసుకోలేరు!" అన్నాడు పిశాచిగాడు నిక్కుగా. వాడు తన నోరు పెద్దదిగా తెరిచి, కమ్మరి కొలిమిలాగా మండే ఆ గొంతులోకి కంకణం వేసేశాడు.

రేరాజు నింపాదిగా చెయ్యి చాచి పిశాచి కంఠం పట్టుకుని కిందికి నొక్క సాగాడు. పిశాచి అబగారి గుమ్మడి కాయ విచ్చినట్టు విచ్చుకున్నాడు. రాజు అక్కపై ఏదో కనపడని చెయ్యి ఆ శిధి లాలనుంచి కంకణాన్ని తీసి నాకిచ్చింది.

అన్నా, ఆ కంకణాన్ని నేను పట్టు కున్న మరుక్షణమే ఆ రాజూ, దివిటీలూ అన్నీ అదృశ్యమైపోయి, నేను రాణో చితమైన దుస్తులు ధరించి పడకగదిలో ఉన్నాను. నా భార్యశయ్యమీద నిద్ర పోతున్నది. నేను ఆమె చేతికి కంకణం తొడగగానే ఆమె సంతోషంతో కేక పెట్టుతూ మేలుకున్నది. నేను ఏమీ జరగనట్టే ఆమె పక్కలో పడుకున్నాను. తరవాత జరగవలసినదేదో జరిగి పోయింది.

నేను తిరిగి వచ్చినందుకూ, తమ కుమార్తె కన్నెచెర విడిచినందుకూ, మర్నాడు ఉదయం రాజూ, రాణీ ఎంతో సంబరపడి, నేను ఏమైనానన్న సంగతి కూడా విచారించటం మరిచిపోయారు.

తరవాత మేం సుఖంగా జీవించాం. సుల్తానుగారు, అంటే నా మామగారు, వారసుడు లేకుండా చనిపోతూ రాజ్యం నాకు రాసిపోయాడు ఆ విధంగా నేను ఈ స్థితికి వచ్చాను. అన్ని ఘనతలూ ఇలాకే చెందుతాయి!

* * *

తన కథ ఈ విధంగా చెప్పిన సుల్తాను మహమ్మద్ తన కొత్త మిత్రుడి ముఖాన అవిశ్వాసంతో కూడిన ఆశ్చర్యం చూసి, "అన్నా, ఆశ్చర్యం దేనికి? విధి ప్రకారం జరిగి తీరుతుంది అల్లా నిర్దేశించినట్టయితే అసాధ్యం ఏదీలేదు నేను, నీ దృష్టిలో తక్కువ కావటానికి కూడా జంకకుండా, జరిగినది జరిగినట్టు ఎందుకు చెప్పా నంటే, నా తార్కాణంవల్ల నీకు మనశ్శాంతి కలుగుతుందనీ, నువు నా స్నేహాన్ని నిశ్చల చిత్తంతో ఆమోదిస్తావనీనూ. అన్నా, నీకు స్థిరత్వం కలగగలందులకు నా పెద్ద వజీరు పదవి ఇస్తాను నువు హమేషా నా కుడిపార్శ్వన ఉండి, అన్ని

విషయాలలోనూ నాకు నీ అనుభవంతో సలహాలిస్తూ ఉండు. నీకు తెలియకుండా రాజ్యంలో ఏదీ జరగదు," అన్నాడు.

సుల్తాన్ మహమ్మద్ అమీర్‌లనూ, తన ఉన్నతోద్యోగులనూ పిలిపించి, నిండు సభలో యాత్రికుడికి గౌరవ లాంఛనాలతో పెద్ద వజీరుగా నియమించాడు. ఈ కొత్త పెద్దవజీరు రోజూ సభచేస్తూ, నిష్పక్షపాతంగానూ, న్యాయంగానూ నిర్ణయాలు చేస్తూ ప్రజాభిమానానికి పాత్రుడయాడు. రాజ్యం నాలుగు మూలలనుంచీ న్యాయం కోరేవారు అతని వద్దకు పరిగెత్తుకుంటూ వచ్చి, అతని నిర్ణయాలనూ, తీర్పులను తెగమెచ్చుకునేవారు. తీరిక ఉన్నప్పుడల్లా అతను సుల్తానుతో కాలక్షేపం చేసేవాడు. వారిద్దరి మధ్యా మైత్రి నానాటికీ వర్ధిల్లుతూ వచ్చింది.

ఒకనాడు సుల్తాన్ మహమ్మద్‌కు మనోవైకల్యం పట్టుకున్నది. అతను తన వజీరు దగ్గిరికి వెళ్లి, "అన్నా నా మనసు ఏమీ బాగాలేదు," అన్నాడు.

"మహారాజా, మనోవికారాలన్నీ మనసులో పుడతాయి. అయినా ఒక్కొక్కసారి బాహ్యకారణాలు వాటిని ఉపశమనం చెయ్యవచ్చు. వినోదాలేమన్నా ప్రయత్నించి చూశారా?'' అని వజీరు అడిగాడు.

"అన్నిరకాల, అన్ని రంగుల మణులతోనూ ఆడుకుని చూశాను. నా జనానాకు వెళ్లి అన్ని రకాల ఆడవాళ్లనూ అవలోకించాను. కాని నా మనస్సును కుంగదీసే భారం తొలగలేదు. అందుచేత నీ దగ్గరికి వచ్చాను. నాకేదైనా చికిత్స నువే చూడాలి,'' అన్నాడు సుల్తాన్.

"మనం ఒక్కసారి మారిస్తాన్‌కు వెళ్లి, అక్కడి పిచ్చివాళ్లను చూస్తే ఎలా ఉంటుందంటారు? ఇద్దరమూ వెళ్లి పిచ్చివాళ్లను సందర్శింతామని అనుకున్నామేగాని, వెళ్లటం పడలేదు. నా ఉద్దేశంలో, మామూలు మనుషుల కన్న పిచ్చివాళ్ల గ్రహణశక్తి మహా సూక్ష్మంగా ఉంటుంది. మనం చూడలేని వ్యత్యాసాలూ, సంబంధాలూ వాళ్లకు ఇట్టే స్ఫురిస్తాయి. వాళ్లకు వింతదృశ్యాలు కూడా కనిపిస్తాయి," అన్నాడు వజీర్.

"మనం ఇప్పుడే మారిస్తాన్‌కు పోదాం," అన్నాడు సుల్తాన్.

ఇద్దరూ రాజభవనంనుంచి, వెంట ఎవరూ లేకుండా బయలుదేరి, త్వరలోనే మారిస్తాన్ చేరారు. అక్కడ గదులూ, పడకలూ శూన్యంగా ఉన్నాయి. కాపలావాళ్లు, రక్షకాధికారీ మాత్రమే వారికి కనిపించారు. ఒక్క పిచ్చివాడు కూడా మచ్చుకైనాలేడు.

పిచ్చివాడు ఒక్కడైనా లేకపోవటానికి కారణమేమిటని సుల్తాన్ రక్షకాధికారిని అడిగాడు.

"చాలాకాలంగా కొత్తవాళ్లెవరూ రావటంలేదు. అందుకు కారణం మనుషులలో మనోవికాసం క్షీణించటం కావచ్చు. అయినా మీకు ముగ్గురు పిచ్చివాళ్లను పరిచయం చేయగలను. వాళ్లను ఇక్కడికి తెచ్చినవాళ్లు ఘరానా మనుషులు వాళ్లను ఎవరూ చూడరాదన్న అంశకూడా ఉన్నది. వాళ్ల గొప్ప జ్ఞానులనటానికి సందేహంలేదు. ఎందుచేతనంటే వాళ్లు అస్తమానమూ ఉద్గ్రంథాలు చదువుతూ ఉంటారు," అన్నాడు రక్షకాధికారి.

అతను వజీరు, సుల్తానులకు పెడగా ఉన్న ఒక భవనానికి తీసుకుపోయి, తలుపు తెరిచి, మర్యాదగా అవతలికి తప్పుకున్నాడు.

లోపల ముగ్గురు యువకులున్నారు. వారిని గోడలకు బిగించిన గొలుసులతో కట్టిపెట్టారు. వారిలో ఒకడు ఏదో గ్రంథంపైకి చదువుతున్నాడు. మిగిలిన ఇద్దరూ వింటున్నారు. ముగ్గురూ మంచి యౌవనంలో, బలిష్ఠంగా ఉన్నారు. వారిలో ఉన్మాదలక్షణాలేవీ పొడగట్టడం లేదు.

సుల్తాను తన అనుచరుడికేసి తిరిగి, "ఈ యువకుల కథలు వినదగినవై ఉండాలి కాదూ!" అన్నాడు.

తరవాత ఆయన ఆ యువకుల కేసి తిరిగి, 'మిమ్మల్ని పిచ్చివాళ్లనా ఇక్కడ పెట్టారు!" అని అడిగాడు.

"మహారాజా మేంఏ రకానికి చెందిన పిచ్చితోనూ బాధపడుతున్నవాళ్లం కాము మేం వెర్రిబాగులవాళ్లమూ, మూర్ఖులమూ కూడా కాము. మా జీవిత కథలు ఎంత చిత్రమైనవంటే తెలివి గలవాళ్లకు అందులో నేర్చుకోవలసినది ఎంతైనా ఉన్నది," అన్నాడు గ్రంథ పఠనం చేస్తున్నవాడు.

"మేం వినటానికి సిద్ధంగా ఉన్నాం!" అన్నాడు సుల్తాను. ఆయన వజీరుతో బాటు నేలమీద కూర్చున్నాడు.

అప్పుడా పిచ్చివాడు ఇలా తన కథ ఆరంభించాడు.

. ఇంతవరకు చెప్పి మంత్రి కుమార్తె తెల్లవారుతూ ఉండటం గమనించి, మౌనం వహించింది.







# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?

అవసరాల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

మదన్‌ని కరువుతీరా కౌగలించుకున్నాను. నా కోసం ఏదైనా చెయ్యడానికి సిద్ధపడే ఒక దుఃఖజీవిని నేనెంతగా బాధిస్తున్నాను.

ఆరోజు పొద్దుట్నుంచీ పెద్దమ్మగారి కోసం ఎదురు చూశాను. ఆమె కిష్టమైన వెల్వెట్ దుస్తులు ధరించాను బాగా కిస్‌మిస్ పళ్లూ జీడిపప్పు అద్దిన స్పెషల్ కేక్ చేయించి సిద్ధంగా ఉంచాను. సాయంకాలమైంది. కారు వచ్చి వీధిలో ఆగింది మామూలుగా మదన్ ఒక్కడే రావడం జరిగింది. 'ఏవో పెంతెకొస్తు మహాసభలుటగా, అందులో పాల్గొనడానికి మార్గరెట్‌గారు నిన్ననే నూజివీడు వెళ్ళిందిట... ఆ సభల్లో అన్ని ఊళ్లూ తిరిగి వచ్చేసరికి రెండునెలలైనా పడుతుందని విలియమ్స్ చెప్పేడు' అనే కబురు తీసుకొచ్చాడు మదన్.

అలా పలకరించే ప్రాణి లేక, నన్ను జాస్మిన్‌గానే గుర్తించిన హోటల్‌స్టాఫ్ తప్ప మరోపరివారంఎరగక. చంచల్‌లో చేరిన మొదటి నాలుగు నెలలూ నాలుగు మహాయుగాలుగా గడిచాయి. ఆతరవాత తరవాత నా వ్యక్తిత్వంలో ఓ చిత్రమైన మార్పు వచ్చింది. అందువల్ల ఒంటరిగా ఉన్నా ఒంటరితనం తోచలేదు నాకు.'

'అదేమిటమ్మా, కొత్తగా ఎవరు వచ్చారు నిన్ను కలుసుకోడానికి?' అని అడిగింది దయామయి.

'వచ్చారని కాదు, వస్తారని!'

'ఎవరది? ముసల్దాన్ని అర్థంచేసుకో లేకపోతున్నాను. కాస్త వివరంగా చెప్పవమ్మా యాలిన్.'

'వినండి అయితే. మొదట్లో మదన్ ఇంచుమించు ప్రతి సాయంకాలం వచ్చే వాడని చెప్పేనుగా! వచ్చేటప్పుడు మల్టీ విటమిన్ టాబ్లెట్స్లూ, టానిక్కూ తెచ్చేవాడు. తర్వాత తర్వాత ప్రాక్టికల్సనీ, పరీక్షలనీ, తన రాకపోకలు వాళ్ళ పిన్ని అన్నలు కాదంటిస్తున్నారనీ ఏదో ఒకటి చెబుతూ అలా అలా రావటం తగ్గించేశాడు. దాన్తో మరీ బాధ కలిగేది. వెల్లకిలా పడుకుని డాబావైపు చూస్తూ సాయంకాలమంతా గడిపేసే దాన్ని. పక్క సందులో పుట్టి ఆ డాబా పైకి కొంతవరకు వ్యాపించిన పెద్ద వేప చెట్టు ఒకటి ఉండేది. ఎక్కడెక్కడి కాకులూ చీకటిపడేవేళకి ఈ చెట్టుమీదకి వచ్చి చేరేవి. వాటి అరుపులు మహా ఘోరంగా ఉన్నా, అప్పుడప్పుడు ఒంటి మీద పడిన వాటి రెట్టలు మహాబాధా కరంగా పరిణమించినా, ఏకాకిగా అక్కడ బందీఅయిన నాకు ఏకాకి అయినా సాటి ప్రాణిగా తోచి సాయం గానే అనిపించేది.

దయామయి కళ్లు వత్తుకుంది.

'జామచెట్టుమీద' జాతి చిలకలా పెరిగేవు. ఆఖరికి వేపచెట్టుమీద వెర్రి కాకితో సరిపెట్టుకోవలసి వచ్చింది. ఏం ఖర్మ వచ్చిపడిందమ్మా నీకూ.'

'అలా అలా అబ్జర్వ్ చెయ్యగా చెయ్యగా ఆ కాకులగోలలోనే కొత్త కొత్త అర్థాలు స్ఫురించాయి నాకు. ఆ కాకుల గూళ్లూ, అందులో గుడ్లూ, ఆ గుడ్లలోంచి పసిగుడ్లు, అంత చీకటి రంగు పసిముండల ముక్కులూ ఇలా తెరిచేసరికి సూర్యోదయ మయినట్టు ఎర్రటి నోళ్లూ, ఆ దొంగ తడవల నోట్లో నోరుపెట్టి వాళ్లమ్మలు ఊరంతా నోళ్లుకొచ్చిన రకరకాల తినుబండారాలు జారవిడవడాలూ... ఓహ్! ఈ సృష్టి ఎంత చిత్రమైనది! పూర్తిగా దుఃఖ పూరితమని ముందుగా తెలిసినా ఎందరు అశాశ్వతమని చెప్పినా, తనవాళ్లు అనే సరికి ఎంత మమత! దిక్కులేనివాళ్ళు దిక్కు దిక్కుమని దిక్కుదిక్కూ చూస్తే చూశారు గనక, రోజురోజుకి రక్త మాంసాలతో పాటు ప్రేమానురాగాల బరువు నాలో పెరుగుతూండగా నే నె లాంటి ఒంటరిదాన్ని!

మదన్ చూపుతున్నది కాంతి కాక పోవచ్చు. కారుచీకటి రేఖ కావచ్చు. కానియ్యి. ఇందులో చెడిపోయింది ఏముంది. నాలో పెరుగుతున్న జ్యోతి నా పాలిట నవరత్నదీపం కాబోదా?

నా కింకెవర్నీ చూడాలనిపించలేదు. శరణాలయం పిల్లలందర్నీ అధికారులతో సహా అప్పటికప్పుడు అనాథల్ని చేసి పారేసింది నా మనస్సు.

ఆ ఆఖరినెలల్లో మదన్ రాకపోకల్ని

కూడా అట్టే పట్టించుకునేదికాదు నా మనసు. ఎంత తొందరగా నాకు కానుపు వస్తుందా, ఎంత తొందరగా ఆ వేలంత వేలుపు బయటికి వస్తుందా అదే ఆ రోజుల్లో నా ఆలోచన. బలీయమైన ఆ కోరిక, మహత్తరమైన ఆ కాంక్ష, నన్ను నింబెట్టింది. బాబుకోసం ఎంత ఆహారం తీసుకున్నా చాలనిపించేది కాదు నాకు. ఎంతసేపూ తే, తే అనే మాటకి విధీ విరామం ఉండేది కాదు. మేడమెట్లు ఎక్కి-దిగలేక హోటల్ బాయ్ వచ్చి పోయేవాడు. నాకు కావలసినన్ని గుడ్లు అమర్చలేక గుడ్లు తేలవేసేవాడు! అలా అలా హోటల్ చంచల్‌లో బెదురుగా పిరికిగా ప్రారంభమైన నా రోజులు దర్జాగా సరదాగా పూర్తి అయ్యాయి. కాని... ఎత్తైనకొండ ఎక్కుతున్నానని సంబరపడ్డాను గాని అంత ఎత్తునుంచీ ఎవరో ఒకరు తోసెయ్యడానికి సిద్ధంగా ఉన్నారని ఎప్పుడూ అనుకోలేదుమదర్' ఉన్నట్టుండి యాలిస్ రెండు చేతుల్తోనూ మొహాన్ని మూసుకుంది. కళ్ళనయితే దాచింది గాని కన్నీళ్లను ఖైదుచెయ్యలేక పోయింది. చూస్తూండగా వేళ్ళసందుల్లోంచి కన్నీటి ఊటలు బయటపడి పోయాయి. ఆమెను ఊరుకోబెట్టగలిగాక దయామయి అడిగింది

'ఏం జరిగింది తల్లీ! పుట్టిన పాప పురిట్లోనే పోయిందా?'

'అలా జరిగితే అప్పుడే ఒక్క-ఏడుపు ఏడ్చేసి ఊరుకుని ఉందును...'

'మరేం జరిగింది! త్వరగా చెప్పు యాలిస్!'

'సుమారుగా ఇంకొక వారంరోజులకి పురుడు వస్తుందని లేడీ డాక్టరు చెప్ప గానే మీనా మెటర్నిటీ హోమ్ అని ఒక ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో ఎడ్మిట్ చేయించాడు నన్ను మదన్. నా కోసం ప్రత్యేకించి పరిమళ అనే నర్సుని కూడా నియమించాడు. నా ఆరోగ్యంపట్ల ఆశ్రద్ధాసక్తులు చూస్తే అతని పట్ల నా ప్రేమానురాగాలు మరింత పొంగిపోర్లేవి. కాని ఆఖరాఖరికి అతని మొహంలోని ఓ కొత్తభావం నాకు అంతుపట్టేదికాదు. ఒకసారి ఎక్కడో చెప్పేననుకుంటాను ఆ మొహం ఏసుక్రీస్తు వదనాన్ని పోలి ఉంటుందని, నవ్వుతూంటే మరింత మనోహరంగా ఉంటుందని. కాని ఆ ఆఖరి పదిరోజులూ అతని మొహంలో నాకు నచ్చనినీడ-నుదుటిమీద నే నెరగని ముడత వచ్చిపడింది 'వంట్లో బాగు లేదా? మీ పిన్నిగారి ఇంట్లో మన సంగతంతా తెలిసిపోయిందా? పరీక్ష గాని పాడుచేశారా? ఎందుకలా ఉన్నారని ఏవేవో ప్రశ్నలు వేసేదాన్ని గాని జవాబు వచ్చేదికాదు. ఏమీలేదని నవ్వేసి తప్పించేసుకో పోయేవాడు. కాని అదీ నే నిదివరకెరగని నవ్వే... రాత్రిపూట అది తలుచుకుని కలవరపడినా పాప మీద ఆలోచనల కలలు మనసంతా మాధుర్యంనింపి కమలాలు కనులువిప్పే

వేళకు నేనూ కలకలలాడుతూ కనులు విప్పేదాన్ని...

ఆ రోజు తెల్లవారుఝాము నుంచీ నాకు నొప్పులు ప్రారంభమై తొమ్మిది గంటలవేళకు మరితట్టుకోలేకపోయాను. లేడీ డాక్టరువచ్చి ఏదో ఇంజక్షన్ ఇచ్చి వెళ్ళింది. మరొక రెండు నిముషాల తర్వాత నే నెక్కడికి వెళ్ళిపోయానో నాకే తెలీదు మళ్ళీ తెలివి వచ్చేసరికి నా శరీరం మనసూ చాలా తేలిక అయి పోయినట్టు అనిపించింది. పక్కనున్న పరిమళ టేబిల్ ఫాన్ నా మొహానికి తగిలేలా పెట్టి వేడి వేడి కాఫీ ఇచ్చేసరికి కొంచెం బలంవచ్చి పూర్తిగా తెలివి వచ్చింది.

కొంచెం తలెత్తి చూశాను. చేతులతో పొట్ట తడిమి చూసుకున్నాను. 'అలా కదిలిపోకండి. చేతులతో అట్టే ప్రెస్ చెయ్యకండి బ్యాండేజీ కదిలిపోతుంది' అంది పరిమళ.

'ఏదమ్మా నర్సమ్మా, నాకు పుట్టిన బాబు ఏడీ?'

ఏమో గాని జవాబు చెప్పక నర్సు అటు మొహం తిప్పకుని ఊరుకుంది.

ఇంతట్లో లేడీ డాక్టరు అక్కడికి వస్తూ గుండె బ్రద్దలుచేసే వర్తమానం అందజేసింది.

'నీ డెలివరీ చాలా కష్టమై పోయిందమ్మా జాస్మిన్! మత్తు మందు ఇవ్వవలసి వచ్చింది. పార్సిప్సు వెయ్యవలసి వచ్చింది. అసలు నీ ప్రాణందక్కించడం కోసమే మేం నలుగురం డాక్టర్లం గంట సేపు హోరాహోరీ పోరాడవలసివచ్చింది అనుకో'

'అంటే?'

'మామూలు మనిషి జీవితంకాలం నూరేళ్ళు అయితే నీ బాబుది నూరు సెకండ్లు! ఇలా ఇవతల పడ్డాడో లేదో అలా కళ్ళుమూసేశాడు.

చేతికందిన ఫలం నేలకలిసిపోయింది! దేవుడిచ్చిన వరం బూడిదయిపోయింది. కళ్ళుపోయేలా, నోటి తడి ఆరిపోయేలా, గుండె బ్రద్దలయేలా ఏడుస్తూ కూచున్నాను.

'చూడు నర్స్! ఆ అమ్మాయిని అట్టే గోల చెయ్యొద్దని చెప్పు. ఎంత స్పెషల్ రూమ్ అయితేమాత్రం.........ఇంకా పేషెంట్సు ఉన్నారుగా!'

అ టూ మరొక ఇంజక్షను ఇమ్మని చెప్పి ఆవిడ వెళ్ళిపోయింది.

ఎంత ఆపుకుందామనుకున్నా నా దుఃఖం ఆగలేదు.

'చూడు నర్సమ్మా, నా బాబు ఎలా ఉండేవాడు? తెలుపేనా? ఒళ్ళుగా ఉండే వాడా? బాగా జుత్తు ఉందా? దిక్కుమాలినదాన్ని. చూడ్డానికైనా నోచుకున్నానుకాను నాకు చూపించకుండా ఎందుకు పాడేశారమ్మా!'

'బాగుందమ్మా! పొద్దుట పదింటికి పోయిన పిల్లడి శవాన్ని ఈ దీపాలవేళ

వరకూ ఉంచాలని మాకు తెలీదు! అయినా నేలగలిసిన పాలు చిక్కగా ఉంటేనేం, పల్చగా ఉంటేనేం!'

'హోటల్ చంచల్ నుంచి వచ్చారే నాతో మదన్‌గారని, ఆయన వరండాలో బల్లమీద కూచుని ఉన్నారేమో ...నాకు తెలివి వచ్చిందని కొంచెం ఇలా పిలువమ్మా'

నర్సు పరిమళ అక్కణ్ణుంచి కదల్లేదు.

'వెళ్ళి చూసిరా తల్లీ!'

'ఎవర్ని చూసిరావాలి! నువ్వు చెప్పిన అతను పొద్దుట పదకొండు గంటలకే వెళ్ళిపోయారు కారుమీద.'

'నా పురిటి సమయంలో అతనులేరా, బాబుని చూసుకోలేదా?'

'ఏమో, నాకు తెలీదు ఆ భోగట్టాలన్నీ...... ఆయన అంత సొమ్ము ముందుగా ఆస్పత్రికి చెల్లించేశాడు. మళ్ళీ వచ్చినట్టులేదు. ఇలా జాకట్టు చెయ్యి పైకెత్తు నీకు ఇంజక్షను ఇవ్వాలి.'

ఆ పని పూర్తిచేసి, మరో కేసు ఎటెండ్ అవడానికి నర్సు వెళ్ళిపోయింది

'ఆ తరవాత ఏం జరిగింది యాలిస్.'

'జరగడానికేమీ లేనట్టు కన్పించవచ్చుగాని మిగిలిన కథంతా అప్పుడే మొదలయింది మదర్'

'అదేమిటి?'

చెబుతాను వినండి మరి......

ఆ రాత్రి వచ్చి ఆ మూడో రోజు ఉదయం నన్ను డిస్చార్జి చేస్తారని చెప్పి వెళ్ళిపోయింది. ఆ రెండు రోజులూ మదన్ వస్తాడేమో. నా ముఖాన్ని తన గుండెలకు చేర్చుకుని నా కన్నీటిని తుడుస్తాడేమో అని వెయ్యి కళ్ళతో ఎదురు చూశాను. అంతవరకూ నా 'నా పిల్లాడూ, నా ఇష్టం ఇందులో ఇంకొకరి ప్రసక్తి ఏముంది. మధ్యని మదన్ ఎవడూ!' అనుకున్న నేనే చచ్చిపోయిన పిల్లాడు నా ఒక్కడిసొత్తుకాదు గదా! నా దుఃఖం ఎంతో తన దుఃఖమూ అంతేకద! ఏదో తప్పు చేసినట్టు ఎక్కడికో వెళ్ళి కూచునే బదులు ఇద్దరం కలిసి ఒక్కసారి బావురుమని ఏడుస్తే కడుపులో మంట కొంతయినా తీరుతుంది గదా! అని ఎంతో ఆతృతతో ఎదురుచూశాను మదన్ కోసం. ఊహుఁ అతను రాలేదు, నన్ను పలకరించలేదు. ఇంతదుఃఖంతో క్రుంగిపోతున్న నాకు ......నాకు...... ఒక్కటే ఒక... సానుభూతి వాక్యం ప్రసాదించలేదు! పరిపరి ఆలోచనలతో నాకు పిచ్చెత్తిపోయింది. ఇంతటి లోకంలో నేనిప్పుడు ఒంటరిని. ఈ డిస్పెన్సరీని విడిచి నేనెక్కడికి వెళ్ళాలి! నాదన్నది ఈ ప్రపంచంలో ఇంక నాకేం మిగిలింది గనక!

నేను ఆస్పత్రినుంచి విడుదలయ్యే రోజున, మధ్యాహ్నం రెండింటికి నర్సు పరిమళ విసవిస నా దగ్గిరికి నడిచి వచ్చి ఇలా అంది.

ఇవిగో జాస్మిన్ సూటుకేసులు రెండూ...బట్టలూ అవీ సరిగ్గా ఉన్నాయో లేవో చూసుకో-హోటల్ చంచల్ మేడ మీద ఉండేవిటగా, అవే ఇవి! హోటల్ మేనేజరుకి కూడా అక్కడ ఆయన మోహన్ పేరుతో ఉన్నారటగా, మదన్ గారు పూర్తిగా చెల్లించేశామని చెప్పమన్నారు. ఆస్పత్రికి ఇచ్చేశారనిముందే చెప్పేనుగా...పాపం ధర్మప్రభువులు, ఎవరి రుణమూ ఏమీ మిగుల్చుకోలేదు.'

ఏమిటో ఈ ఆఖరుమాటకి నాగుండె జల్లుమంది. ఎక్కడికేనా ఏకంగా వెళ్ళిపోయేముందు తీర్చుకోవలసిన బాకీలు ఇవి. చెప్పవలసిన మాటలు ఇవి. మదన్ ఎక్కడికెళ్ళినట్టు?

'మదన్ ఎక్కడున్నారు. నర్సమ్మా'

'ఏమో ఇన్నాళ్ళు గడిపిన నీకే తెలీకపోతే మాకేం అవసరం? ఆయన యీ ఊరువారు అయితే కదా!'

నా తల తిరిగినట్టయింది.

'అదేమిటి, ఎవరిగురించి నువ్వు మాటాడుతున్నది? ఇక్కడ మెడికల్ కాలేజీలో మదన్ చదవడంలేదా?'

నర్సు పక పక నవ్వుతూ అంది.

'ఎడంచేత్తో ఎన్ని కాలేజీలేనా కట్టించెయ్యగల లక్షాధికారి ఆయన...... ఒకరి కాలేజీలో చదువుకోవలసిన అవసరం ఆయనకేమిటి! ఎన్ని చదువులు చదివితే ఆయనలా వ్యాపారం చెయ్యగలగాలి! ఏదో పనిమీద ఈ ఊరు అప్పుడప్పుడు కారుమీద వస్తుంటారు గాని ఇక్కడే ఉండిపోతే ఆయనకెలా కుదురుతుంది! ఎందుకలా వెర్రిచూపులు చూస్తావ్...త్వరగా బెడ్ ఖాళీ చెయ్యి...అన్నట్టు ముఖ్యవిషయం మరచేపోయాను. మదన్‌గారు నీకీ దంతపు భరిణ ఇమ్మన్నారు'

వణికే చేతుల్తో అది అందుకున్నాను నేను.

ఆ దంతపు భరిణలో నూరురూపాయల పెద్దనోటుగాక చిన్న నోటు ఒకటీ అందులో ఇలాఉంది:

మైడియర్ యాలిస్,

ఇన్ని నెలలూ ఎన్నోవిధాల నాకు నేను నచ్చజెప్పుకుందామని చూశాను రాత్రింబవళ్ళు ఆలోచించాను. ఆప్తులందర్నీ అడిగిచూశాను

ఉహుఁ లాభంలేదు. మన వివాహం సుఖమయం కానేరదు.

నా చుట్టూఉన్న పాడుసంఘాన్నీ బంధుబలాన్నీ కాదనే శక్తి నాకు లేదు. నేను నిన్ను పెళ్ళిచేసుకోవడం లోకసమ్మతం కాని విషయం. అలా చేసే స్తోమత నాకు లేదు.

నాలాంటి పిరికివాణ్ణి చేసుకుని నువ్వు మాత్రం ఏం సుఖపడస్తావ్?

మన మధ్య ఇప్పుడేలాంటి బంధాలూ లేవు. నన్ను మరచిపో. ఇంకా ఇరవై ఏళ్లయినా నిండని అమాయకురాలివి. ఇంకెవర్నైనా పెళ్లాడి సుఖించు. ఈ

విషయాలు ఎదురుగుండా చెప్పలేక పోయాను, క్షమించు.

—ఎప్పుడూ నీ క్షేమం కోరే,
మదనగోపాలస్వామి.

చదివిన ఉత్తరంలోని ప్రతిఅక్షరమూ ఆ మీనా మెటర్నిటీ హోమ్ వరండాలోని బెంచీమీద కూచుని మళ్ళీ మళ్ళీ చదివేను. చదివినకొద్దీ కళ్లు తిరిగి నట్టయింది. మధ్యాహ్నం ఎండగా ఉండటంచేత కాబోలు ఆవేళ అక్కడెవరూ లేరు. అలా ఆయిదు నిముషాల పాటు బెంచీకి జారగిలబడి అచేతనంగా ఉండిపోయాను. కొంచెంసేపు అయాక లేచి మొహం కడుక్కొని కడుపు పట్టినన్ని కూలర్‌లోని నీళ్ళు తాగేశాను. మరొకసారి చదివాను ఉత్తరం. అలా అలా ఆలోచిస్తున్నకొద్దీ ఆయనమీద ప్రేమంతా క్రమక్రమంగా ద్వేషంగా మారిపోయింది.

ఆరోగ్యంగా అందంగా అడవి కొలనులో అరవిందంలా బతుకుతున్న నన్ను బయటకు ఈడ్చి అన్యాయం చెయ్యడానికి ఇతనికెవరిచ్చారు అధికారం? నెలలపాటు అబద్ధాలు చెప్పి నన్ను మోసంచెయ్యడానికి ఇతనికే మొచ్చింది అవసరం?

ఈ రెండో ప్రశ్నలో ఏదో చిక్కు సమస్యకు సమాధానం దొరికినట్టయింది నాకు. పుట్టి బుద్ధెరిగిన ఒకనాడూ జ్వరంతో బాధపడైనా ఎరగను, నా పురుడు కష్టమెందుకవాలి? నాకు మత్తుమందు ఎందుకివ్వాలి? నా బాబు శవాన్నైనా నాకు చూపించకుండా ఎందుకు పారెయ్యాలి?

ఈ ఆలోచన తోచీతోచగానే ఇక ఆలస్యం చెయ్యలేదు. నర్సు పరిమళను కాంపౌండ్‌వాల్ పక్కనున్న గన్నేరు చెట్టు నీడలోకి తీసుకెళ్ళాను. రెండు చేతులు పట్టుకుని కళ్ళమ్మట నీళ్ళతో అర్థించాను.

'నర్సమ్మా! నీ కాళ్ళుపట్టుకుంటాను. నిజం చెప్పు. నా బాబు పోయాడా?'

'ఎన్నిసార్లు చెప్పాలి? నీ బాబుని మేమేం తీసేసి దాచేశామనుకున్నావా? తెలియని ఎవడికో శరీరాన్ని అర్పించి పిల్లాణ్ణి కని, వాడితో ఈ సంఘంలో హాయిగానే బతుకుదామనుకున్నావా? ఇలాంటి పరిస్థితుల్లో పుట్టిన శిశువు పోవడమే ఎంతో మేలుకాదా? పెళ్ళి కాకుండా పిల్లల్ని కన్న తల్లులు రెండో కంటివాడికి తెలీకుండా పిల్లల్ని పీక నొక్కి అవతల పారెయ్యడం అదేమంత అసాధారణమైన విషయమనుకున్నావా?'

'ఎంతమాటన్నావు నర్సమ్మా, అంత కన్న నా పీక పిసిగి చంపెయ్యక పోయావా?'

'ఓయబ్బో, ఈనాటికి చూశాం రాముడికీ సావిత్రికీ పుట్టినచంద్రమతిని. నాకా నీతులు చెప్తావ్? చూసిచూసి బండబారినదాన్ని నేను. దాల్చాలు వెళ్ళి

ఏ లాడ్జింగ్ హౌస్‌లోనో చేరు. క్రమంగా ప్రమోషన్ కాకపోదు' ఆమె అహాస్యం నిలువెల్లా దహించివేస్తూన్న యానించక తప్పలేదు.

'ఆడపుట్టుక పుట్టి ఆ మాత్రం జాలి లేదుటమ్మా నర్సమ్మా! నేను చేసింది పాపమే, ఒప్పుకున్నాను. కాని పేగులో పేగు, నా రక్తంలో రక్తం...... వాడి మీద ఆశలతోనే బతికాను. వాడు నిజంగా లేకపోతే చావు తప్ప నాకింకేం గతిలేదు. ఇంద ఈ వందరూపాయలూ తీసుకో...నిజం చెప్పు...నా బాబు బతికే ఉన్నాడు కదూ!'

నర్సు నూరురూపాయల మరత అందుకుని జాకెట్టులోకితోసి స్వరం తగ్గించి అటూ ఇటూ చూస్తూ అంది.

' నాకు మదనగోపాలస్వామిగార్ని గురించి అన్నీ తెలుసు. మా లేడీడాక్టరు మీనాక్షికీ ఆయనకీ ఎప్పట్నుంచో సంబంధం ఉంది. ఆవిడ యిక్కడ హోమ్ ఏర్పాటు చేసుకోవడానికి అందుకే ఆయన సాయంచేశారని అందరికీ తెలుసు. నే నేమిటో వాగేస్తున్నాను. ఏ మాత్రం పైకిపొక్కినా పీకపోతుంది: ఏదో ముట్టచెప్పేవని చెపుతున్నానుగాని నీకేం తెలిపినా నువ్వు చెయ్యగలిగేది ఏమిటని? ఇంతకీ ఆయన లాస్టియర్ ఇక్కడికొచ్చి ఉన్నారు గదా!'

'ఎందుకూ?'

'ఎందుకేమిటి? వసంతగార్ని పరీక్ష చేయించడానికి'

'వసంతగారా? ఆవిడెవరూ?'

'బాగుంది, రాముడికి సీత ఏమవు తుందో ఎరగవ్?'

నా తల తిరిగిపోయింది. ఒణుకు తున్న కంఠంతో అడిగాను.

'వసంతమదన్‌గారి భార్యా? అయనకి పెళ్ళైపోయిందా?'

'అహా! నీ దయవల్ల ఆయనకి పెళ్ళై అంతా ఏడేళ్ళయింది.'

' అన్నేళ్ళయిందా ? ఇది నమ్మ మంటావా నర్సమ్మా. ఇది నిజమేనా?'

'లేకపోతే? నీకో నాకో ఆ ఛాన్సు దక్కలేదని విచారిస్తున్నావా! ఆ అదృష్టం మా లేడిడాక్టరు మీనాక్షమ్మకే దక్కలేదే!'

'సరేనమ్మా, ఇన్ని విన్నాక నేను ఇక దేనికైనా సిద్ధమే!'

'అయితే విను. లాస్టియర్ ఆయన వసంతగారికి అన్ని పరీక్షలూ చేయిం చారు. నాకు బాగా జ్ఞాపకం. నేనప్పు డిక్కడే ఉన్నాగా!'

'అయితే ఏం జరిగింది?'

'జరగడాని కేమీలేదని తేల్చేశారు!'

'అంటే?'

'వసంతగారికి గర్భకోశంలో ఏదో దోషం ఉందనీ. సంతానయోగం లేదనీ'

'ఇంతకీ నా బాబు ఏమయ్యాడు నర్సమ్మా!'




'అయ్యో కంగారా...నన్ను చెప్పనివ్వవేం... ...నీకు మొగిలిరేకులాంటి మొగపిల్లాడు పుట్టేడు. మదన్‌గారేవచ్చి తీసుకున్నారు. ఆస్పత్రిస్టాపు నోరు మూయించడానికి పాపం ఆయన పది వేలు ఖర్చుపెట్టేరు!'

'ఎంత మంచి కబురు చెప్పేవు నర్సమ్మా — నా బాబు కులాసాగా ఉన్నాడా?'

'ఆఁ అదృష్టవంతుడు గనక, ఆ ధర్మరాజుకి అనుగ్రహం కలిగిందిగనక కులాసాగానే ఉన్నాడు. ఇదే నీలాంటి దిక్కుమాలినదాని దగ్గిర ఉంటే ఇన్ని పాలచుక్కలకైనా నోచుకోక ఈపాటికి గిలగిలతన్నుకుని చచ్చిపోయి ఉండును. ఇలాంటి ఘోరం జరక్కుండానే దగ్గిరుండి నీకు పుట్టిన పిల్లాడు పోయినట్లు ఆస్పత్రి ఆఫీసులో రికార్డు చేయించేడు ఆ పుణ్యాత్ముడు.'

'అయితే తల్లికీ పిల్లకీ సంబంధం లేదా?'

'లేదు జాస్మిన్ నీలాంటి తప్పుడు ప్రవర్తనవాళ్ల మొరలు ఏ దేవుడూ ఆలకించడు. ఊరూ పేరూ తెలియని వాడితో నెలలతరబడి సంసారం సాగించావు. ఎవరిది తప్పు? విజయవాడలోని విశాలాంధ్ర ఆటోమొబయిల్స్ ప్రొప్రయిటర్ రతనని నేను చెప్తేనేగాని నీకు తెలీదే! అంతటి అమాయకురాలివి కొడుకుని పెంచుదామనుకుంటున్నావా, కొడుకుని? నీకు జరిగింది ఉపకారమే గాని అపకారం కాదు. ఆ మాట మర్చిపోకు...మదన్‌లాంటి మంచి మారాజు ఉండబట్టే ఇంకా ఈ నాలుగు చుక్కలైనా పడుతున్నాయని తెలుసుకో!'

ఎవరో పిలిచారు, నర్సు గబగబ వెళ్ళిపోయింది.

ఒక్కమారు అన్ని కఠోరసత్యాలు

అంతటి కఠినమైన భాషలో విన్నాక, అసలే నీరసంగా ఉన్న నా శరీరం ఎంత మాత్రం తట్టుకోలేకపోయింది. ఆ రెండు సూట్ కేస్‌లూ చేరో చేత్తో పట్టుకుని ఆ మెటర్నిటీహోమ్ నుంచి ఎలా ఇవతల పడ్డానో నాకే తెలీదు. రోడ్డుమీద ఎలాగో పదిగజాలు నడిచాను. కాళ్ళల్లో మంట......చెవుల్లో హోరు.........అలుక్కు పోతున్న చూపు......సరిగ్గా అదే పరిస్థితిలో మీ కారుకింద పడ్డానను కుంటాను మదర్.

దయామయి ఆమె తలమీద చెయ్యి వేసి యాలిస్‌ని దగ్గిరగా తీసుకుంది.

'ఇంత చిన్నవయస్సులో ఎన్ని కష్టాలు పడ్డావు తల్లీ! సాటివ్యక్తి పట్ల మంచితనం అనే ఒకే ఒక్క నేరంవల్ల ఎంతటి శిక్ష అనుభవించావు, ఎంతటి మోసానికి గురి అయావు!...... కాని ఇన్నినెలలపాటు మా ముందు ఉంటూ అగ్నిహోత్రం కడుపులో ఎలా దాచు కున్నావు యాలిస్! ఇంత మంది స్నేహితులం మాలో ఏ ఒక్కరితోనైనా, ఆఖరికి నాతోనైనా చెప్పకుండా ఎందు కున్నావ్ యాలిస్!

'దానికి జవాబు అంత సులువుగా చెప్పగలననుకోను మదర్ ... అయినా ప్రయత్నిస్తాను. సవతితల్లి కథ అల్లి దుఃఖంతో ఉన్నాననే మత్తుమందు జల్లి సాధారణమైన తెలివితేటలకు తక్కువ లేని నన్ను ఇంచుమించు ఒక సంవ త్సరం మోసబుచ్చ గలిగాడు. అది తలచుకుంటే, అతని అసలు రూపు పోల్చుకుని ఆలోచించుకు చూసుకుంటే ఎంతటి మంచి మనస్సున్న వాళ్ళనైనా పైపై పరిశీలనతో స్వీకరించేయోగ్యత నా మనస్సు కోల్పోయింది, అందుకని ఎవరినైనా అనుమానంతో చూడడం నా కలవాటయిపోయింది. ఇక రెండోది ప్రపంచమంతా తనదిగా చేసుకుని డబ్బుతో తనవైపు తిప్పుకుని నన్ను మోసం చేశాడు మదన్. నాలాంటి అనాధని మోసం చెయ్యడానికి పాపం అత నిన్ని పాట్లు పడవలసి వచ్చింది. అంటే నాకన్న అతడు బలహీనుడని తెలిసిపోడంలేదా? అందుకని నే నొక్క ర్తెనే, ఎవరి సాయమూ లేకుండానే, అతనితో పోరాడ దల్చుకున్నాను. ఎందుకు గెలవనో చూస్తాను' అంది నిశ్చయంగా యాలిస్

(సశేషం)



# దోషి



తోకరమారావ్

"నీ పేరు ?"

"లలిత"

తలెత్తి చూశాను.

బోనులో, చీరకొంగు నెత్తినిండా కప్పుకుని, తలొంచుకుని నిలబడ్డది లలిత !

"వృత్తి ?"

లలిత మాట్లాడలేదు. ప్రాసిక్యూటర్ వేపొకసారి చూసి, తలొంచుకుంది.

ప్రాసిక్యూటర్. కేసు పూర్వా పరాలు వివరించసాగాడు. నా మనస్సు వేరేచోట వుంది.

...లలిత నాకూ బాగా తెలుసు. లలిత నేనూ కలిసి చదువుకున్నాం చిన్నప్పటి నుంచీ ! ఇలా నా ముందు ఒకనాడు దోషిగా నిలబడుతుందని గానీ. ఆమె చేసిన నేరానికి నేను న్యాయ మూర్తిగా శిక్ష విధించాల్సి వస్తుందని గానీ, ఊహించలేదు.

"...ఈ కారణాల దృష్ట్యా, లలిత అనే ఈమెకు ఐ. పి. సి. ... సెక్షను క్రింద, మూడు నెలల శిక్ష, ఐదు వందల జరిమానా విధించవలసిందిగా కోర్టువారికి విన్నవించుకుంటున్నాను" ప్రాసిక్యూటర్, పాఠంలా వప్పచెప్పి కూర్చున్నాడు.

కోర్టు హాలంతా నిశ్శబ్దమైంది. బోనులో నిలబడ్డ లలిత తలెత్తిచూడ లేదు.

ఈ కేసు పట్టుకున్న ఇన్స్పెక్టర్ నవ్వుతూ బోను ప్రక్కగా నిలబడి వున్నాడు. ఆ వెనుక ఇద్దరు పోలీసులు.

నిందితురాలు ఆడది. అంతేగాక రూపసి. కనుక పనిలేని జనం కోర్టు హాలులో చాలామందే చేరారు. అక్కడున్న యావన్మంది దృష్టి నా మీదేవుంది. ఒక్క లలిత తప్ప అందరూ నా వేపే చూస్తున్నారు.

జడ్జిమెంట్ వాయిదా వేశాను, సాయంత్రానికి.

పైన ఫ్యాను తిరుగుతున్నా నాకు ఉక్కపోస్తూనేవుంది. పైన నల్లకోటు.ఎదురుగా చిన్ననాటి స్నేహితురాలు !.

లంచ్ వేళయింది. లేచి చాంబర్స్లో కెళ్లాను. కోటువిప్పి, స్టాండుకు తగిలించి, కుర్చీలో పడుకున్నాను. "లలిత...ఆదే ఇంతకుముందు బోనులో వుంది చూడు.. ఆ అమ్మాయిని తీసుకురా" అని బంట్రోతును పంపాను.

...లలిత చాలా దిగజారిపోయింది. చదువుకుని, సంస్కారం కలిగివున్న లలిత, ఇంతటి హేయమైన బ్రతుకుని ఎన్నుకుని, ఎలా తిరగగలుగుతున్నది ?.

లలిత వచ్చి వాకిలి వెంబడే నిలబడ్డది. పాదాలుపచ్చగావున్నాయి. చీర కొంగు జరీ, ఆ పాదాల పచ్చదనం ముందు వెలితిగా వుంది.

"కూర్చో" కాళ్ల క్రిందవున్న కుర్చీ కాలితో, ఆమె దగ్గరకు నెట్టాను.

లలిత కూర్చుంది తలొంచుకుని.

ఆమెను అంత దగ్గరగా చూడటానికి, మనసులో బెరుకుగావుంది

"టిఫిన్ తెప్పించేదా ?".

లలిత మాట్లాడలేదు !

పెళ్లిచూపులప్పుడు, కూర్చునే ఆడపిల్లలా కూర్చొనుంది కుర్చీలో.

"నన్ను గుర్తుపట్టావా ?".

"ఊ !"

కుర్చీలోంచి లేచి కూర్చున్నాను.

లలిత గోడమీద తల ఆనించి, పైకప్పు కేసి చూడసాగింది.

బంట్రోతును కేకేసి, కాఫీ తెమ్మన్నాను.

"మీ నాన్నగారెలా వున్నారు"

''బాగానే వున్నారు !''

"ఓసారి మా యింటికి రమ్మను.''

"ఆయనెక్కడకూ రారు !"

"మా యింటికి తప్పకుండా వస్తారు !"

"పక్షవాతం – మంచంలోంచి లేవలేరు."

"ఎన్నాళ్లయింది ?".

"ఈ మధ్యనే !"

నా గొంతు పూడుకుపోయింది. లలిత ముక్తసరిగా యిచ్చే సమాధా

నాలు, నాకు, మరీ ఇబ్బంది కలిగి స్తున్నాయి. నేను న్యాయమూర్తిని - ఆమె దోషి... అన్న సంబంధం ఇక్కడ లేదని చెప్పాలని నా అభి ప్రాయం.

"నేను మీ యింటికి వస్తాను".

లలిత ఆశ్చర్యంగా చూసింది నా వేపు. ఆమె పెదాల మధ్య చిరునవ్వు మొగ్గ వేసింది.

'మీ అడ్రసు చెప్పు".

"నా పేరు చెప్పండి బాలు, రిక్షా వాడు తీసుకొస్తాడు'' ఆ సమాధానంలో అవహేళన వుందేమో అనిపించింది.

మా యిద్దరి కళ్లూ, చూపులూ కలి శాయి నేనోడిపోయాను. కళ్లు దించేసు కున్నాను.

బంట్రోతు కాఫీ తెచ్చి కప్పుల్లో పోశాడు. చెరోటీ యిచ్చి వెళ్లాడు.

''తాగు.''

''నేనింకా ముహం కడుక్కోలేదు. స్నానం చెయ్యలేదు!..."

నేనేం మాట్లాడేది!

లలిత లేచి నిలబడ్డది. ''జడ్జిమెంటు త్వరగా యిస్తే వెడతాను!''.

లలిత తమ్ముడుగురించీ, చెల్లెళ్ల గురించి అడగాలనుకున్నాను. అడగలేక పొయ్యాను

లలిత పోవటానికి సిద్ధమైంది.

"పోలీసులు, రాత్రినించీ లాకప్ లోనే వుంచారా?"

వాళ్ల డ్యూటీ అది!''

ప్రసాద్ గురించి చెప్పాలనివుంది. అసలు లలితే అడుగుతుందని ఆశించాను.

''బెయిల్ ఇస్తాను. ఇంటికెళ్లరా!''

''నేనడగందే యిస్తారా?".

ఆ ప్రశ్నకు నా దగ్గర సమాధానం లేదు.

లలిత వెళ్లిపోయింది.

కుర్చీలోకి జారి, పడుకున్నాను—

... నేను అనాథను. నరసింహారావు గారు చేరదీశారు. కూలన్నుడనన్న భావం గావచ్చు. లేదా, చదువుకుని పైకి వస్తాడన్న భావమున్నా కావచ్చు. లేదా, వాళ్లింటో, చచ్చేదాకా మా అమ్మ చేసిన వంటకు కృతజ్ఞత వల్లనైనా గావచ్చు.

ప్రసాద్, నేనూ యించుమించు ఒకే ఈడువాళ్లం. మా యిద్దరికీ స్నేహం కూడాను.

ప్రసాద్, సన్నగా, పీలగా. ద్రావకం లోంచి తీసిన బొమ్మలా వుండేవాడు.

నరసింహారావు గారికి అతగా డంటే పంచప్రాణాలు. కోరిక మనస్సులో వుండగానే, ఆ కోరికలు ప్రాణం పోసుకుని కళ్లముందు ప్రత్యక్ష మయ్యేవి.

నరసింహారావుగారు లాయరు పేరు, ప్రఖ్యాతిగల లాయరు. వృత్తిరీత్యా గాకుండా, నరసింహారావుగారికి పొలాలు, ఇళ్లు, కంపెనీలో షేరువున్నాయి.

ఇవన్నీ చూచేందుకు వున్న గుమాస్తాల్లో ఒకడే చలపతిరావు. అంటే లలిత తండ్రి.

లలిత చిన్నప్పుడు, చలాకీగా వుండేదిగాదు. అందమైందీ గాదు. లావుగా, బొద్దుగా వుండేది. తలకు తైల సంస్కారంలేక, ఎర్రగా వుండే జుత్తు, రెండు జడలు వేసుకుని, చూడటానికి తమాషాగా వుండేది.

నరసింహారావుగారి నీడలోవున్న చలపతిరావు రాత్రింబవళ్లు, యజమాని సేవలో, ఆయన వ్యవహారాలు చూస్తూ వుండేవాడు. కుక్కకన్నా విశ్వాసమైన వాడు ఆయనంటే నరసింహారావు గారికి జాలి గూడ వుంది. పిల్లలు కల వాడని, పదీ పరక జీతం, అడక్కుండానే పెంచేవాడు. ఇంటికొచ్చే కూరలు, పాలు, పెరుగు తదితర వస్తువులు, చలపతిరావుగారి కిచ్చేవాడు అయాచితంగా!

గాలికి, వానకు మొలిచిన మొక్క పెరిగి పెద్దదైనట్లు, లలిత స్కూలు ఫైనల్ పరీక్ష ప్యాసయింది. ఆ తర్వాత కాలేజీలో చేరతానని మొండికేసింది. వ్యవహారం నరసింహారావుగారి దాకా వెళ్లింది. అంటే లలిత వెళ్లి, ఆయనకు విన్నవించుకుంది.

నరసింహారావుగారిది జాలిగుండె. వయస్సు మీదకొచ్చేకొద్దీ, నిత్య నైమిత్తికమైన పనులువేరే వాళ్ళకు అప్ప చెప్పి, మేడగదిలో, ఉయ్యాల బల్లమీద పద్మాసనం వేసుక కూర్చుని వుండే వారు రోజంతా.

చలపతిరావుకు సంతానం, మితం దాటివుంది. సంపాదన కూటికీ గుడ్డకూ సరిపోతుంది. శేషం మిగలదు. మరీ అందరిలోకి పెద్దది లలిత. చదువు మానిపిస్తే, పెళ్లి చెయ్యలేదు. అథవా అలాంటి ప్రయత్నంలోకి అడుగు పెట్టినా, ఇవ్వాళ అనుకుంటే మరో నాలుగేళ్లకు కార్యరూపం దాల్చగల స్తోమత చలపతిరావుది.

ఇవన్నీ నరసింహారావుకు తెలియనివేం గాదు.

"ఒరేయ్! దాన్ని కాలేజీలో చేర్చు" అన్నారు నరసింహారావుగారు!

చలపతిరావుగారు మాట్లాడలేదు. లలిత ఛంగున గంతులేస్తూ, పరిగెత్తింది సంతోషంతో.

"డబ్బు పటుకెళ్లు, దాని చదువుకూ, పుస్తకాలకూ, గుడ్డలకూ నువ్వు బెంగెట్టుకోకు. ఇక్కడనుంచే పట్టుకపో!" నరసింహారావుగారిది జాలిగుండె

లలిత కాలేజీలో చేరింది ఇంటరులో అప్పుడు ప్రసాద్, నేనూ బి. ఏ లో వున్నాం...

గతం గుర్తుకొచ్చి, నా మనస్సు వికలమైంది.

లలిత కేసు తీర్పు ఇవ్వాలి. మా కిద్దరికీ పరిచయమున్న సంగతి. నా

బంట్రోతు కనిపెట్టివుంటాడు. అది నా ఊహకాదు.

"ఆయమ్మ బాబూ! చాలామంది కొంపలార్పింది బాబూ! కోర్టుకయితే ఇయ్యాళ వచ్చిందిగానీ, పోలీసులు పట్టుకోడం, డబ్బుయిచ్చివదిలించుకోడం కానా రోజుట్నుంచీ జరుగుతావుంది" ఇవి నా బంట్రోతు అయాచితంగా చెప్పిన సంగతులు.

"ఆమె ఇల్లు తెలుసా!"

"తెలుసండీ. రైలుపేట, గాంధీ బొమ్మకాడ"

"స్వంత ఇల్లేనా!"

"రెండంతస్తుల భవంతండీ. అద్దెలే రెండు మూడు వందలొస్తాయి."

"యింట్లో యింకెవరన్నా వుంటారా!"

"తమ్ముళ్లూ, చెల్లెళ్లూ వుండారండీ. అంతా చదువుతూ వుండారు. ఒకాయిన విశాఖపట్నంలో డాక్టరు పరీక్ష గూడ ఇస్తున్నాడంటారు!".

కోటు వేసుకుని, బెంచీమీదకు వెళ్లాను. లాయర్లంతా సంభాషణ మానేసి లేచి నిలబడ్డారు. లలిత కోర్టు వరండాలో చతికిలబడి వున్నదలా లేచి నిలబడ్డది. అంతే, కోర్టు హాల్లోకి రాలా! సబ్ఇన్స్పెక్టర్, చువ్వలా నిలబడి, సెల్యూట్ చేశాడు.

జడ్జిమెంటు ఇచ్చేశాను.

## 2

రాత్రి యనిమిది గంటలైంది.

డాబామీద కుర్చీవేసుకు కూర్చున్నాను.

చంద్రుడు కొబ్బరిచెట్టు ఆకుల వెనక దోబూచులాడుకుంటున్నాడు. దూరంగా వున్న రైసుమిల్లు దడదడ లాడుతూ, శబ్దం చేస్తున్నది. రోడ్డుకు దూరంగా వుండటంవల్ల లారీలు, బస్సుల రణగొణధ్వని లేదు. పైగా, నా సంసారం. నాలుగో కాన్పుకు, వారసులతో వెళ్లింది. అందుకని ప్రశాంతంగా వుంది.

...నరసింహారావుగారు ఓ రోజు నన్ను పిలిచారు, ఆయన గదిలోకి

ఆయన, నేనూ ఇద్దరమే ఆ గదిలో.

"ఏరా! ఎలా చదువుతున్నారు?"

చెప్పాను.

ఆయన క్షణం ఆలోచనలో పడ్డారు. ఆయన అడగాలనుకున్నది, మా చదువు గురించిగాదు. ఎందుకంటే ప్రసాద్ తెలివిగలవాడు కాకపోవచ్చు. కానీ అత్తెసరు మార్కులతో ప్రతి పరీక్ష ప్యాసవుతూనే వున్నాడు.

"ఒరేయ్! లలిత, ప్రసాద్ ప్రేమించుకున్నారుట. పెళ్ళిచేసుకోవాలని గూడ తీర్మానించుకున్నారుటగా! నిజమేనా?''.

నేను ఇరకాటంలో పడ్డాను. ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య.

"ఫరవాలేదు చెప్పు ప్రసాద్ వచ్చే నేను లలితను చేసుకుంటానని అన్నాడు. ఊరికే సంగతులు తెలుసుకుందామని అడిగానంతే. పోన్లే నీకంత కష్టంగా వుంటే చెప్పకు, వెళ్లు! అన్నారు నరసింహారావుగారు.

ఆయన లాయరు, పైగా మనిషిని చూడగానే వాడి జాతకం చదివెయ్యగల నేర్పు, తెలివిగలవారు! నేను ఆయన దయా ధర్మాలమీద బ్రతికేవాడిని. చెప్పాను.

ఆయనకు చెప్పినట్లు, ప్రసాద్‌కు చెప్పాను.

ప్రసాద్‌కు అనారోగ్యం లేదు. అలా అని ఆరోగ్యమూ లేదు. ఎప్పుడు నీరసంగా కనబడతాడు. పల్చటి గుడ్డలు గూడ, వాడికి బరువే అనిపిస్తాయి. మల్లెపువ్వంత సుకుమారంగా వుంటాడు.

"నాన్న యింత తేలిగ్గా, మా పెళ్లికి అంగీకరిస్తాడని, నేనమ్మలేదు సుమా!".

నాకూ అది ఆశ్చర్యంగానే వుంది.

నరసింహారావుగారు, ఓ రోజు చలపతిరావును కబురంపి పిలిపించారు.

అప్పుడు నేనూ అక్కడే వున్నాను. ప్రసాద్ కూడ వున్నాడు.

చలపతిరావు, చేతులు కట్టుకు నిలబడ్డాడు.

విషయమంతా వివరించి, "ఏమయ్యా! మావాడు, మీ లలితను చేసుకుంటానంటున్నాడు. నేను సరే అన్నాను; కులమింటి కోతి. అదీగాక మీ అమ్మాయి కళ్లముందు పెరిగింది. గుణగణాలు తెలియనివేంగాదు. నువ్వేంత నా బంటువైనా, లగ్నాలు నిశ్చయించే ముందు నీ అభిప్రాయం తెలుసుకోవాలిగా!...చెప్పు. లగ్నాలు పెట్టించమంటావా?" నరసింహారావుగారు అడిగారు.

చలపతిరావు ఎగిరి గంతు లెయ్యలేదు. నరసింహారావు పాదాలుపట్టుకుని, ఆనంద భాష్పాలతో వాటిని కడిగి, కళ్ల కద్దుకుని, "బాబూ! మీ మాటకు ఎదురు చెబుతానా! తమ విశాలహృదయానికి నా జోహారు. తమ ఋణం జన్మజన్మలకు తీర్చుకోలేను." అనిగూడ అనలేదు!

నరసింహారావుగారు, "ఏమిటలా మాటా పలుకూ లేకుండా నిలబడతావ్? యిందులో ఆలోచించాల్సిందేముంది?-" అని విసుక్కున్నారు. గద్దించి మరీ అడిగారు.

చలపతిరావు మౌనం భయంకరంగా వుంది.

నేను ఆశ్చర్యపోయాను. ప్రసాద్ ఆయన్ని విచిత్రంగా చూశాడు. మాకేమీ మా పాలుపోలేదు.

"క్షమించండి బాబూ! మీ వాడికి మా పిల్ల నిచ్చి దాని గొంతు కొయ్యలేను. వస్తా..."

చలపతిరావు. మెరుపులా మాయ మయ్యాడు, అక్కడనుంచి!

ఆయన నడకలో తత్తరపాటుంది. భయముంది. నిరాశ, నిస్పృహ కూడ వున్నాయి.

నరసింహారావుగారు, రేచుకుక్కలా లేచారు. నోటి కొచ్చినట్లు, చలపతి రావును తిట్టారు బండబూతులు.

"వెధవకు డబ్బు చేదయింది. కళ్ళకు పొగరుకమ్మింది. కొవ్వెక్కింది! నే తల్చుకుంటే, వీడి బ్రతుకు బజార్న పడుతుందని తెలియదు!..." ఇలా నాల్గురోజులు తిడుతూనేవున్నారు. శాపనార్థాలు పెడుతూనే వున్నారు.

ప్రసాద్ మంచమెక్కాడు. నిరుత్సాహపడ్డాడు. నీరయిపోయాడు.

నరసింహారావుగారు, వేరే పెళ్లి సంబంధాల ఎన్నికలో నిమగ్నులయ్యారు.

ప్రసాద్ నాకు మిత్రుడేగాదు, బహిః ప్రాణంగూడ.

ఒంటరిగా, లలితను కలిశాను.

వయస్సు, దీటుగా వున్న అవయవ సౌష్ఠవం, లోకజ్ఞానం, అనుభవంవల్ల ఆరితేరిన లలిత, ఇప్పుడు అందంగా వుంది. ఆమె అందం, వయస్సులో వున్న కుర్రాళ్లకు ఆకర్షణీయంగా వుంది.

"రఘూ! మా బ్రతుకుల్ని ముడివేసే బాధ్యత నీది. నీ యిష్టం! ఏంచేసినా సరే!" అంది.

చలపతిరావు వింతప్రవర్తనకు, ఆమె సమాధానం చెప్పలేకపోయింది. గత నాల్గురోజులుగా, ఆయన సరిగా అన్నం తినటంలేదు. తనలో తాను గొణుక్కోవటం, నిద్రలో కలవరించడం, దిగులుగా, ఏదో పోగోట్టుకున్నవాడిలా తిరగటం, లలితకూ అర్థంగాలేదు. చలపతి రావు పరాజితుడు. ఎందుకో తెలియదు.

ఆలోచించాను. నా ఆలోచన అటు లలితకూ, ఇటు ప్రసాద్‌కూ నచ్చింది. ఒకవిధంగా అంతకన్నా గత్యంతరం లేదు!

ప్రసాద్‌ను కాదని నరసింహారావు బ్రతకలేడు. కారణాలేవైనా, లలిత తండ్రి చలపతిరావు అసమర్థుడు. నరసింహారావుగారిని ఎదిరించి, కట్టిన మంగళసూత్రం తెంపేసి, కూతురు ముందు నిలబడలేడు.

కనుక లలిత, ప్రసాద్‌ల వివాహం జరిగితీరాలి, రహస్యంగా. ఆవేశాలు, కావేషాలు తగ్గాక, మనస్సులుకుదుట పడ్డాక, అనుమానాలు తగ్గాక, లలిత, ప్రసాద్‌లు, భార్యాభర్తలుగా, ప్రవేశిస్తారు. కథ కంచికి వెడుతుంది.

ఓ రాత్రి, సూట్‌కేస్ నిండా డబ్బు సర్దుకుని, ప్రసాద్, ప్రయాణమయ్యాడు.

లలిత, ప్రసాద్ మద్రాసు వెడతారు. అక్కడే పెళ్లిచేసుకుంటారు హనీమూన్ గడిపి, నే తర్వాత ప్రాశాక

ఇద్దరూ తిరిగి వూళ్లోకి వస్తారు! ఇది నా నిర్ణయిం.

కన్నవాళ్లను, కావల్సినవాళ్లనూ, వదులుకుని లలిత కట్టుగుడ్డల్తో స్టేషను కొచ్చింది, రాత్రి పదిగంటలకు ప్రసాద్‌ను వెనక రమ్మని, నేను వాడి సూట్ కేస్ పట్టుకు స్టేషను కెళ్లాను.

రైలు వచ్చింది ప్రసాద్ రాలేదు!

ఫోన్ చేశాను నాన్న నా గదిలోనే వున్నాడు మాట్లాడుతూ. బయటపడేందుకు వీల్లేకుండావుంది ముందు లలితను రైలెక్కించెయ్. అంతగా అయితే, నేను టాక్సీలో అన్నా వెళ్లి ఆమెను కలుస్తాను!" ప్రసాద్ చెప్పిన విషయం లలితకు చెప్పాను.

లలితకు, ప్రసాద్ అంటే ప్రాణం కాదనకుండా రైలెక్కింది ఆశలతో, ధైర్యంతో జంటగా మద్రాసు ప్రయాణామైంది, చీకట్లో, రాబొయ్యే వెలుఇరును నమ్ముకుని...

"ఇక్కడున్నారా?" పబ్లిక్ ప్రాసిక్యూటర్ రామ్మూర్తి, వచ్చాడు డాబా మీదకు.

బంట్రోతు కుర్చీ తెచ్చి వేశాడు.

"క్రింద ఇన్స్పెక్టరుగారున్నారు రమ్మను."

"ఎవరూ?..." నేనాశ్చర్యపోయాను పబ్లిక్ ప్రాసిక్యూటర్ రామ్మూర్తిగారు, ఈ వేళప్పుడు రావటమే ఆశ్చర్యం అయనతోపాటు ఇన్స్పెక్టర్ కూడ రావటము... ఏదో విశేషముండాలి?

"ఏదో పనిమీదనే వచ్చారల్లేవుంది!"

రామ్మూర్తిగారు నవ్వారు, అవునన్నట్లు.

ఇన్స్పెక్టర్ వచ్చి నిలబడ్డాడు. వీధి దీపం కాంతి, వెన్నెలలో అతను చాలా అందంగా కనబడ్డాడు. అంతేగాదు, ఇంత సుకుమారి. పోలీసు ఉద్యోగానికెలా వచ్చాడా అన్న ఆశ్చర్యమూ కలిగింది.

"కూర్చో."

అతను కూర్చోలేదు.

రామ్మూర్తిగారు, గొణుక్కుంటున్న రాగం ఆపి, "కూర్చో! పరవాలేదు" అని చెప్పి, "రేపెడదామయ్యా అంటే కాదు గూడదని లాక్కొచ్చాడు. ఇంకొరింకోరయితే వచ్చేవాణ్ణిగాదు. పోలీసు ఇన్స్పెక్టరాయే! రాక తప్పలేదు!" అన్నాడు

"చెప్పండి!"

"మామూలే! ఈ కుర్రాడు కొత్తగా వచ్చాడు ఉద్యోగంలోకి. యువకరక్తం చూడండి, అవినీతి, వ్యభిచారం, పేకాటలు, దొమ్మిలు, అన్నీ రూపుమాపాలని తాపత్రయం! మంచిదేగదా! ఇతగాడొచ్చాక పరిస్థితి కొంత మెరుగైన మాట నిజమే! కాస్త ప్రభుత్వం వుంది సుమా అనిపిస్తున్నాడు"

సబ్ ఇన్స్పెక్టర్ తలొంచుకున్నాడు.

"కుర్రాడికి, అవేశమేగాదు కాస్త వివేకమూవుంది. ఊరికే తొందరపడ




కుండా, వచ్చిన కేసు కాస్త విచారించి, వాకబుచేసి, మరీ ముందుకు పోతున్నాడు. అంతా బాగానేవుంది'' రామ్మూర్తిగారు సందేహించారు.

"చెప్పండి!" అభయమిచ్చాను

"ఇవ్వాళ ఆ లలిత కేసు... ఋజువుకాలేదని కొట్టేశారు చూడండి! అదిగో యితను చాలా మధనపడి పోతున్నాడు. సాక్ష్యం, చట్టం అన్నీ ఆమెకు వ్యతిరేకంగా వున్నా మీరు కొట్టేయడం, ఆమెను నిర్దోషని వదిలెయ్యటం నచ్చలేదు. ఇలా మీరు మెత్తగావుంటే, తను ఉద్యోగం చెయ్యలేనంటాడు" రామ్మూర్తి తన పని అయిపోయిందని, కాళ్లు ఊపుతూ, కూనిరాగం తీస్తూకూర్చున్నాడు.

ఇన్స్పెక్టర్, నావేపు ఆశగా చూశాడు అతన్ని చూస్తే నాకు ముచ్చటవేసింది. దగ్గరగా వెళ్లి భుజం మీద చెయ్యివేశాను. "మీరు అధైర్య పడకండి నేనూ మనిషిని! నాకున్న బలహీనతలవల్ల, మీకు నిరుత్సాహం కలిగించివుంటాను ఏం?..."

రామ్మూర్తిగారు గలగలా నవ్వేసి, ''నే చెప్పాగదటోయ్. మేజస్ట్రేటు గారు చాలా నిక్కచ్చి మనిషి! వెధవది యాభయ్యేళ్లొచ్చిన నాకే, ఆయన ముందు కేసు ఎత్తుకోవాలంటే కాళ్లు వణుకుతుంటాయి!"

రామ్మూర్తిగారు, తన భారీశరీరంతో ఇన్స్పెక్టర్‌తో వెళ్లిపోయారు.

నా పరిస్థితి నాకే విచిత్రంగా

తోచింది. నా వ్యక్తిత్వాన్ని కోల్పో తున్నానేమో అన్న అనుమానం కలిగింది. కారణం ?

...లలిత లేచిపోయింది

ఆ రోజు, మా పేట, ఆ వార్తతో మేల్కొంది. అంతవరకూ చలపతిరావు అంటే తెలియని వాళ్లకూడా, అత నొకడున్నాడని తెలిసింది. ఆ యింట్లో ఆ తర్వాత కొన్నిరోజుల్దాక, పొయ్యిలో పిల్లి లేవలేదు.

ప్రసాద్, కారంపోజులు ఆస్పత్రిలో వున్నాడు అతడు ఆస్పత్రి వదలేసే వేళకు, గంపెడు చీకటి, అవమానము, బాధతో చలపతిరావు, ఆయన సంసారం వూరొదిలి వెళ్లిపోయింది!

ప్రసాద్, ఆ తర్వాత కొన్నాళ్లకు గతాన్ని మర్చిపోయి, విధికి తలవంచి, గుండెల్లో మండే అగ్నిగోళాన్ని వెనికి రాకుండా తట్టుకుంటూ, పెళ్లిచేసుకున్నాడు. పిల్లల్నికన్నాడు సుఖంగానే వున్నాడు

నరసింహారావుగారు, కొడుకు పెళ్లి చూసి, మనవడిని ఎత్తుకుని, హాయిగా, ఓ తెల్లవారు ఝామున కన్నుమూశారు!

మిగిలింది నేను!

నరసింహారావుగారు దయార్ద్ర హృదయులు! నన్ను లా' చదివించారు. తమ పలుకుబడి, ఉపయోగించి, దబ్బుకూడా వెనకాడకుండా, నాకు ఉద్యోగం ఇప్పించారు అందుకు ఆయనకు నే కృతజ్ఞుడిగా వుండాలి! అది ధర్మం

కానీ......

నేను చేసిందేమిటి?

నరసింహారావుగారికి లొంగిపోయి, మిత్రద్రోహం, ఆత్మద్రోహం చేసుకుని, ప్రేమికులను విడగొట్టేందుకు కారణభూతుడినయ్యాను!

ఎవరికి తెలియకపోయినా, నాకు తెలుసు, లలిత పతనం కావటానికి కారణం నేను. ఆమెకేలా శిక్ష విధించేది, నేనే 'దోషి' నయితే...






# చక్రపాణి

కొవిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

"మీరు రిలీఫ్ కావాలనుకుంటే పుస్తక మేదన్నా చదువుకుంటారు. సినిమా చూస్తారు. లేకపోతే మిత్రుల్ని కలిసి మాట్లాడి మానసిక వ్యధ మరచిపోతారు. నా కేమార్గముంది పద్మావతీ!"

ఆమె మౌనంగా ఉండిపోయింది. నిజమే. అత నే మార్గంతో మానసిక వ్యధ విస్మరించగలడు?

"ఫ్రీగా మాట్లాడలేకపోతున్నారు. నా మీద మీకు బాగా కోపం వచ్చినట్టుంది. అవును కదూ!"

"ఆహ. హ. లేదు. లేదు. కోప మెందుకు?" తడబడిందామె. గొంతు "మీకు కోపం పోవాలంటే నేనేమిటి చెయ్యాలి చెప్పండి పోనీ..."

"లేదు. ఏకోపమూ లేదు మీరేమీ చెయ్యక్కర్లేదు."

"నవల చదువుకుంటూంటే మిమ్మల్ని డిస్టర్బ్ చేశానులా ఉంది. ఉదయం

తొందరగా రండి."
"అలాగే తప్పక..."
ఆమె ఫోను వదిలి తన గదికి వెళ్ళబోతూంటే," ఏమమ్మా ఇవ్వాళ ఇంకా నిద్రపోలేదు? రా. ఓ సారి ఇలా కూర్చో," అన్నాడు రంగారావు ఆప్యాయంగా.
అతని ఎదర కుర్చీలో కూర్చుందామె.
"ఇవ్వాళ నీ పుట్టినరోజని పాణి ఒకటే హడావుడి చేశాడట," నవ్వాడు రంగారావు.
"వద్దంటూంటే ఖరీదైన పట్టుచీర కొని ఇచ్చారు అన్నపూర్ణమ్మగారు... బాబయ్యగారూ నా కేదన్నా ఉద్యోగం చూసిపెట్టరా?"
"అది చెప్పడానికేనమ్మా! నిన్ను పిలిచినది," అన్నాడు రంగారావు మళ్ళీ నవ్వుతూ.
ప్రశ్నార్థకంగా, ఆత్రతగా, అతని వైపు చూసింది పద్మావతి.
"పాణి దగ్గర చేసేది ఉద్యోగ మనిపించుకోదుగా! అదీగాక శశీ, ఆమె భర్తా కొద్దిరోజుల్లో వచ్చేస్తారు. వారు ఈ ఆస్తి వ్యవహారాలన్నీ హస్తగతం చేసుకోక మానరు. అప్పుడు నీకి ఉద్యోగం ఉంటుందా అన్నది అనుమానాస్పదమే. అందుకనే చాలారోజులుగా తాపత్రయ పడుతున్నాను. నిన్ననే విశాఖపట్నంలో ట్యుటోరియల్ కాలేజీ ప్రిన్సిపాల్‌ని కలుసుకున్నాను. అతను ఇస్తానన్నాడు. ప్రస్తుతం వందరూపాయల జీతం ఇస్తారట."
"థాంక్సండీ - మీకు నా కృతజ్ఞత ఎలా తెలుపుకోవాలో నాకు తెలియదు. నమస్కారమండీ!"సంతోషంగా చేతులు జోడించి అతనికి నమస్కరించింది పద్మావతి.
"రేపు ఉదయం వెళ్తున్నావుగా పాణి దగ్గరకు. చెప్పేసి రా. మధ్యాహ్నం రెండుగంటల బస్‌కి వెళ్ళిపోదువుగాని. నేను నీ కూడా వచ్చేవాణ్ణేగాని అమ్మాయి రమ్మని ఉత్తరం వ్రాసింది. నీ కన్నా ముందుగానే వెళ్తాను నేను. ఇదిగో ఆయనకు ఉత్తరం వ్రాశాను. ఇదిగో అడ్రసు. వెళ్ళగలవు కదూ!" అంటూ ఆమె చేతికి రెండు కాయితాలిచ్చాడు రంగారావు.
అతను తనతో ఓసారి వస్తే బాగుండునని అనిపించినా, అతన్ని వత్తిడి చెయ్యడం ఇష్టంకాని పద్మావతి, ఆ కాయితాలు తీసుకొని అతనికి మరోసారి నమస్కరించి తన గదికి వెళ్ళిపోయింది.
మంచంమీద పడుకుందే కాని ఆ రాత్రి ఆమెకు నిద్రపట్టలేదు. పాణి దగ్గర తన ఉద్యోగం, అతని నిస్సహాయ స్థితీ, మంచి మనస్సూ, అతన్ని మోసగించి బాగుపడుతూన్న వ్యక్తులూ, తమ ఇద్దరి మధ్యా ఏర్పడ్డ పవిత్రమైన స్నేహం అతన్ని వదిలి వెళ్ళిపోవడ

మంటే మనస్సుకి కష్టమనిపిస్తూంది. కాని రంగారావు చెప్పినమాట ముందు చూపుతో చెప్పినది ఇప్పుడు ఈ ఉద్యోగం వదులుకుంటే శశి వాళ్ళు వచ్చాక నీ ఇష్టంవచ్చిన దారిన పో, అని వారంటే, అప్పుడు తనకోసం ఈ ఉద్యోగం కాసుకు ఉంటుందా? ఉద్యోగం చేసుకుంటూ, సెలవు దినాల్లో వచ్చి పాణిగారిని చూడవచ్చు ఈ విషయం వింటే పాపం బాధపడతా దేమో! ఆ జీతం నేనే ఇస్తాను, ఉండండి అనీ అనవచ్చు. కాని తానా ఉద్యోగంలో చేరి స్థిరపడటమే శ్రేయస్కరం. పాణిగారిని తోటకి, షికార్లకి ఎవరు తిప్పుతారో? శశి వస్తుందిగా. ఆమెకు ఈ అన్నయ్యంటే ఎంతో ప్రేమట. ఆ ఫోటోల్లోనో ఆమె చూసుకుంటుంది. పాణిగారితో ఎంత స్నేహ బంధమున్నా శశిలాటిది తాను కాలేదుగా! ఇలాటి ఆలోచనలతో ఆమెకు నిద్రపట్టనేలేదు. తెల్లవారిపోయింది.

కాఫీ తాగుతూ, సుశీలమ్మతో తన ఉద్యోగం సంగతి చెప్పింది పద్మావతి.

ఆమె ఒక్కసారి తెల్లబోయినట్టయి, అయితే పాణిని వదిలి వెళ్ళిపోతున్నావన్నమాట. ఏమిటో మీ బాబయ్య ఏ క్షణాన ఏమిటి ఆలోచిస్తూంటారో, చెప్పలేమే అమ్మాయ్. ఆయనకు బాగా డబ్బు దెయ్యం పట్టుకుంది. ఇంతకాలంగా అతని దగ్గర ఉంటూ ఇప్పుడు వెళ్ళిపోవటం నా కేమీ నచ్చడంలేదు. వెళ్ళు. ఈ సంగతి పాణికి కూడా చెప్పు. ఏమంటాడో, అంది. ఆ స్త్రీ హృదయం జాలో, బాధో, భయమో, ఎందుకు చలించిపోయిందో కాని, ఆమె వదనం ఒక్కసారిగా వివర్ణమయిపోయింది.

పద్మావతి పాణి దగ్గరకు వెళ్ళుతున్నానని చెబుతూంటే, అమ్మాయ్ కళ్ళులేని పాణినీ, దిక్కులేని నిన్నూ, ఆ సర్వవ్యాపకుడు భగవంతుడే రక్షించాలి. వెళ్ళిరా ఏదన్నా బాగా ఆలోచించి నిర్ణయం తీసుకో, అందామె.

'పాణిని వదిలి తాను వెళ్ళడం ఇష్టం కాని సుశీలమ్మ అలా అంటూంది.' అనుకున్న పద్మావతి చిన్నగా నవ్వుకుంది. కాని ఆమె భర్త చేసే అన్యాయాలకు ఎంతగా విచారిస్తూందో! పద్మావతి పాణిని వదిలి వెళ్ళిపోతుందంటే ఎందుకు సహించలేకపోతూందో! పద్మావతికి తెలియదు.

* * *

"నమస్తే పాణిగారూ!" అంది పద్మావతి, అతని గదిలోకి వచ్చి అతని ఎదర కుర్చీలో కూర్చుంటూ.

"నమస్తే. వచ్చారా! నిన్న సాయంత్రం ఇంటికి వచ్చిన దగ్గరనుంచీ ఇప్పటివరకూ నాకు కాలమెంత దీర్ఘంగా నడిచిందో తెలుసా పద్మావతీ!" అన్నాడు పాణి.

"అయి ఉంటుంది. మీ మనస్సు నొప్పించేలా మాట్లాడేనే అని తర్వాత విచారించాను."

"జానకిరాం రాత్రి తొమ్మిదవుతూంటే వచ్చాడు. మీకు ఇష్టంకాదని చెప్పేశాను. పదిగంటల ట్రెయినుకి వెంటనే వెళ్ళిపోయాడు."

ఆమె మాట్లాడలేదు.

రెండు క్షణాలు దొర్లిన తర్వాత "పెరల్ బక్ పుస్తకమేదో చదువు తున్నానని చెప్పారు. తెచ్చారా ?"

"లేదు."

"ఏం ? పూర్తిగా చదివేశారా ? అర్థమయిందా ?"

"లేదు. చదువలేదు పూర్తిగా."

"మరి తెస్తానన్నారు. మరచి పోయారా ?"

"లేదు."

నవ్వాడు పాణి. తర్వాత "ఎందుకు తేలేదు పద్మావతీ !" అడిగాడు.

"నేను మీతో చెప్పి పోదామని వచ్చాను."

"అంటే ! చెప్పిపోవడమంటే, నా మీద ఇంకా కోపం పోలేదా ?"

"ఛ. మీ మీద కోపం ఏమిటండీ ! నాకు విశాఖపట్నంలో ఉద్యోగం దొరికింది." అనేసి అతని మొహంలోకి చూసింది.

ఎప్పుడూ ఊహించని, అనుకోని మాట విన్నట్లు, ఉలికిపాటుగా కదలి, "ఏమిటి పద్మావతీ మీరంటున్నదీ ?" అన్నాడు పాణి.

రంగారావు చెప్పిన ఉద్యోగ వివరాలు మెల్లిగా చెప్పి, "ఏమిటో ఇంత కాలంగా అశ్రద్ధచేస్తూ వచ్చాను. మీతో కలిసి నవ్వుతూ, నవ్విస్తూ మాట్లా డుతూ, అదే ఉద్యోగంగా గడిపేశాను. కాని ఏదన్నా స్థిరమైన ఉద్యోగం ఉండాలిగా ! అందుకని..."

అతను తలవంచి బరువుగా నిట్టూర్చాడు.

కొన్ని క్షణాలిద్దరి మధ్యా బరువుగా దొర్లాయి.

తర్వాత పాణి అన్నాడు, "మీరు నాతో ఎప్పుడూ కనీసం వుద్యోగ ప్రయత్నం చేస్తూన్నట్టు కూడా చెప్ప లేదు. ఈ వుద్యోగం మాత్రం స్థిరమైనది కాదని ఎలా అనుకున్నారు ? నాకు కళ్ళు మళ్ళీ వస్తాయనీ, లేక ఈ ఆస్తంతా పోయి పేదవాణ్ణయిపోతాననీ, ఇలాటి అనుమాన మేదన్నా వచ్చి వుండాలి. అవునా ?" అని

"మీకు కళ్ళు రావాలని కోరుకుం టున్నాను, నిజమే. కాని పాణిగారూ ! మీ ఆస్తి పోయి మీరు పేదవారైపోతా రనే ఊహ కూడా నేను సహించలేను. మీ అశక్తత మూలంగా, మీ ఆస్తి మీరు అనుభవించలేకపోతున్నారనీ, సరి అయిన లాభాలు పొందలేకపోతున్నారనీ బాధపడే నేను, మీ ఆస్తి పోవాలని

కోరుకుంటానా ?" నిష్ఠుర స్వరంతో అంది పద్మావతి.

"మీరు కోరుకోకపోయినా, కష్టా, సమర్థతా వున్నవాళ్ళ అస్తులే పోతూం టాయి నా ఆస్తి నాకు స్థిరంగా వుంటుం దని నమ్మకం నాకు లేదు పద్మావతీ! ఒకవేళ ఈ ఆస్తంతా కరగిపోయి అత్తయ్యాపోయి శశి అమెరికాలో స్థిర పడిపోతే అప్పుడు నాకు దిక్కెవరు! చావాలంటే మార్గం కూడా తెలియని అంధుణ్ణి కదా! అని భయపడు తుంటాను."

"రాదు, అలాటి పరిస్థితి ఎన్నటికీ రాదు."

"ఎందుకు రాకూడదు? చదువుకునే రోజుల్లో, ఈ దృష్టి పూర్తిగా పోక ముందు ఎన్నో కలలు కన్నాను. బంగారు భవిష్యత్ సృష్టించుకుని మురిసిపోయేవాణ్ణి ఊహల్లో. కాని కథ అడ్డం తిరిగి కళ్ళుపోయాయి. అలా స్తబ్దంగా, బరువుగా, బాధగా, జీవితం దొర్లిస్తూన్న నా జీవితంలో ఏదో వుత్సా హాన్నీ, సంచలనాన్నీ కలిగించిన మీరు, ఇలా వుద్యోగం వెతుక్కొని వెళ్ళిపోతారనుకున్నానా? అలా జరగ దని అనుమానమేమిటి? బ్రతుకు బరువై పోయినప్పుడు తల నేలకేసి చచ్చేదాకా బాదుకోవాలి. అదే చేస్తాను."

"నిజంగా అలాటి పరిస్థితే మీకు వస్తే, బ్రతికి వుంటే ఈ పద్మావతి మిమ్మల్ని వదిలిపెట్టదు లెండి.

అదోలా నవ్వాడు పాణి. కళ్ళ జోడు తీసి కళ్ళు తుడుచుకుని మళ్ళీ పెట్టుకున్నాడు.

"నిజం. అలాటి పరిస్థితి రాకూడదు. ఖర్మం చాలక వస్తే, మిమ్మల్ని నాతో తీసుకుపోయి నాదగ్గర వుంచుకుంటాను."

"థాంక్స్...నాకు ఓ తోడు వుంది జీవితంలో. ఆ మాట చాలు పద్మావతీ నేను బ్రతకడానికి..."

మధ్యాహ్నం బస్‌కే వెళ్ళాలను కుంటున్నాను. ఇంకా తీసుకువెళ్ళ వలసిన సామాన్లు కట్టుకోవాలి. మరి సెలవ్. దయ వుంచండి. వెళ్తాను. లేచి నిల్చుందామె.

ఆతను తలగడ క్రింద చెయ్యిపెట్టి పర్సుతీసి పట్టుకుని ఆ చెయ్యి ముందుకి చాపుతూ, "డబ్బు తీసుకు వెళ్ళండి" అన్నాడు.

"థాంక్స్ వద్దు,వుంచండి. మీరిచ్చిన డబ్బు, మీడబ్బు నా దగ్గర బోలెడుంది."

"వెళ్ళడానికే నిశ్చయించుకున్నారా?" ఇంకా ఏదో ఆశ వెనక్కి పట్టి లాగు తూంటే అడిగాడు పాణి.

"క్షమించండి పాణిగారూ!"

"ఎప్పుడు వస్తారు మళ్ళీ."

"ఏమో! ఇంకా అక్కడ పరిస్థితులు తెలియవుగా!"

"అసలు వుద్యోగం ఏ ఆఫీసులో?"

"చెప్పానే! మీరు సరిగా వినలేదు

కాలోలు. ట్యుటోరియల్ కాలేజి టీచరు పోస్టు."

"ఓసీ,..."

రాజు అప్పారావునీ పిల్చింది. పద్మావతి.వాళ్ళిద్దరూ రాగానే 'రాజూ! అయ్యగార్ని సాయంత్రంపూట అలా షికారు తీసుకువెళ్తూంటావు కదూ!'' అడిగింది.

అత నొక్కసారి మీరెక్కడి కెళ్తా రన్నట్టు ప్రశ్నార్థకంగా చూసి "అలాగే నండి" అన్నాడు.

"అప్పారావ్, మంచి సినిమా లేవన్నా వస్తే అయ్యగార్ని తీసుకువెళ్తాండు. అన్నంతలో, అతను ప్రశ్నించాడు. "మీరు మళ్ళీ ఎప్పుడు వస్తారండి?"అని.

"అప్పుడప్పుడు శని ఆదివారాల్లో వస్తూంటాను." అంటూనే అన్న పూర్ణమ్మకు తనకు వుద్యోగం దొరికిన సంగతి చెబుతూంటే ఆమె 'అయితే వెళ్ళిపోతున్నావా?'' అని ఆశ్చర్య పోయింది. తర్వాత కోపగించుకుంది కూడా. వాళ్ళిచ్చే జీతం మేమే ఇస్తాం ఉండిపో అంది నిష్ఠురంగా.

"అత్తయ్యా, ఆమె వెళ్ళిపోవాలను కునేప్పుడు అపడం, నిష్ఠురాలాడటం మంచిదికాదు," అన్నాడు పాణి గంభీర స్వరంతో.

ఆమె మౌనంగా వుండిపోయింది.

"రేపు మీరు తోటకు వెళ్ళినప్పుడు మాలికి చెప్పండి. మొక్కలు ఎండిపో కుండా నీళ్ళు పోస్తూ వుండమని. సాళ్ళు కట్టి నీళ్ళు పొయ్యమని చెప్పండి. మనకి రావాల్సిన బ్యాలన్సులూ, మనం కట్టాల్సిన టాక్సూ, నోట్ బుక్‌లో రాశాను. పిన్నిగార్ని ఓసారి చూడ మనండి. చెక్కు సంతకాలు పిన్నిగారికి చూపించకుండా చెయ్యకండేం? ఆరోగ్యం జాగ్రత్తగా చూసుకోండి. ఎందుకులే అని ఈ గదిలో అలా ఆలోచిస్తూ కూర్చోక, అలా కాస్సేపు సాయంత్రం పూట తిరిగి వస్తూండండి."

నవ్వుతున్నాడు పాణి. ఆ నవ్వు ఆమె అన్ని బాధ్యతలు వదిలి వెళ్ళి పోతూందని విషాదంలోంచి వచ్చినదో, లేక ఆమె ఆ బాధ్యతలకూ ఈ ఇంటికీ తనకూ, మానసికంగా ముడిపడిపోయిం దనే, ఆనందమో గ్రహించలేని పద్మావతి, "ఎందుకు నవ్వుతున్నారు?" అడిగింది.

"నా మీద మీరు ఇంత అధికారం నాకు తెలియకుండా ఎప్పుడు సంపా దించుకున్నారా? అని."

"మీ మీద అధికారమా?" విస్తు పోతూ అందామె.

అధికారం లేనివాళ్ళు ఆజ్ఞాపించ గలరా? పద్మావతీ!"

"ఆజ్ఞాపించానా? చెప్పాను కాని..."

"పోనీ,అభిమానం అనుబంధం వుంటే కదా చెబుతారు! వెళ్ళిరండి పద్మావతీ! ఆ వుద్యోగం మీకు ఏ కారణంగానన్నా

నచ్చని పక్షంలో మళ్ళీ తప్పక ఈ వుద్యోగం స్వీకరించాలని కోరుకుంటున్నాను. తోటా, కారు షికారూ, సినిమా, వ్చ, అదొక కమ్మని కలగా గుర్తుంచుకుంటాను, వెళ్ళిరండి, మీరు ఇంకా వుంటే ఏమేమి మాట్లాడతానో నాకే తెలియదు. వ్యక్తి అభివృద్ధికి అభిమానాలూ, మమతలూ, అడ్డు నిలవ కూడదు'' అంటూ మంచంమీద వెనక్కి వాలిపడుకొని కళ్ళజోడుతీసి పక్కకు పెట్టి గోడవైపు తిరిగి కళ్ళపై రుమాలు కప్పుకున్నాడు పాణి

తాను వెళ్ళిపోవడం నిజంగా అతనికి కష్టంగానే వుంటుంది. కాని అని రెండు క్షణా లాలోచించి, క్రమంగా అతనే సర్దుకుంటాడు. అనుకుని వెనుదిరిగి వెళ్తూ, మళ్ళీ అతనివైపు ఒక్కసారి చూసి నిట్టూర్చి, పాణిగారన్నట్టు అతని దగ్గర వుద్యోగం ఒక కమ్మని కల. ఒక పవిత్రమైన స్నేహమాధుర్యాన్ని చవిచూసింది. పాణిగారితో తనకున్నది వట్టి స్నేహబంధమేనా ? అయితే, అతని దగ్గర వుద్యోగం మానెయ్యడానికి నిన్న రాత్రంతా నిద్రలేకుండా ఆలోచనలు దొర్లాయెందుకు ? అతను తనను గమ నించలేదనే ధైర్యంతో అతని రూపాన్ని తానెన్నిసార్లు ఆసక్తిగా చూసింది ! అతని అందాన్ని ఎన్నిసార్లు మెచ్చుకుంది ! అతని గుణాన్ని, మనస్సునీ, విశాలహృదయాన్ని ఎన్నిసార్లు అభినందించింది ! అతి సన్నిహితంగా మెసులుతు కూడా హద్దులు మీరని అతని సంస్కారానికి ఎన్నిసార్లు జోహార్లర్పించింది ! మంచి మనిషికి మంచి భవిష్యత్తే వుంటుంది. అత నన్నట్లు ఇవ్వాళ తాసీ ఊరునుంచి వెళ్ళిపోతానని అనుకుందా ! నిన్న ఉదయం ఒకరకమైన ఆలోచన పుట్టిన రోజునే హడావుడి. సాయంత్రం తోట లోని సంభాషణతో మనస్సు. కలత బారటం సాయంత్రంనుంచే అస్సలు మార్పు వచ్చిందేమో ! రోజూలా నవ్వుతూ సంతోషంగా గడపలేక పోయాం ఇద్దరం. తోటలో కూర్చున్న క్షణాలు దుర్భరమైపోయాయ్.

ఆమె వీధిలోకి రాగానే కారు డోర్ తెరచి పట్టుకున్నాడు రాజు.

ఆమె మౌనంగా కారులో కూర్చుంది.

కారు గేటుదాటి వెళ్ళిపోతూన్న శబ్దం విన్న పాణి. కన్నుల్లోంచి రెండు కన్నీటిబొట్లు జారాయి.

"ఎంత దురదృష్టవంతుణ్ణి ! నా పద్మావతిని నేనే పంపించేస్తున్నాను వుద్యోగానికి. నాకు కళ్ళే ఉంటే పద్మావతిని ఆలా వెళ్ళనిచ్చేవాడినా ! కాదు. కళ్ళే వుంటే కథ వేరుగా ఉండేది."

"మౌనంగా బోర్లాపడుకుని కన్నీటిని దాచుకుంటూన్న పాణి తల ఆప్యా

యంగా, జాలిగా నిమురుతూ, "పాణి బాబూ!" అంది అన్నపూర్ణమ్మ."

"నా పద్మావతి వెళ్ళిపోయిం దత్తయ్యా" అన్నాడు పాణి బొంగురు పోయిన గొంతుతో.

"నీ పద్మావతా! ఏమిటీ పిచ్చి? నీ పద్మావతి అయితే నిన్ను వదిలి వెళ్ళేదా? ఓ గారడీచేసి నిన్ను మోసం చేసింది. ఛీ. ఛీ. లే. లేచి కళ్ళు తుడుచుకో. వెళ్ళిపోతే పోనీ. సినిమాకూ, తోటకూ; నేను తీసుకువెళతాను. నీకొ్కవాల్సిన పుస్తకాలు నేను చదివి వినిపిస్తాను."

పేలవంగా నవ్వి "అంతమాత్రాన పద్మావతివి కాగలవా అత్తయ్యా!" అన్నాడు పాణి

"ప్చ్. ఏమిటో ఆ పిల్లమీద మనస్సు పారేసుకున్నావులా వుంది. పుట్టిన రోజుని నాలుగువందల రూపాయల చీరా కట్టుకుపోయింది. తానూ తింది తక్కువగానే. అందరితోపాటూ నీడబ్బు. కాస్త మిగలేసుకునే వుంటుంది."

"కాని నా డబ్బు తినే వ్యక్తులు ఎవరూ ఇవ్వలేని మానసిక ఆనందాన్నీ తృప్తినీ పద్మావతే ఇవ్వగలిగింది.''

"ఇంత అకస్మాత్తుగా ఈ నిర్ణ యానికి ఎందుకు వచ్చిందంటావ్?"

"అదే కారణమై ఉంటుంది." తనలో తాను గొణుకున్నట్టు అన్నాడు పాణి.

"ఏమిటది? అదంటే?"

తొలినాటి సాయంత్రం తనకూ పద్మావతికీ జరిగిన సంభాషణ చెప్పాడు పాణి.

"అహ. అదయి వుండదు. తనకు ఇష్టంలేకపోతే వద్దని చెప్పేస్తుంది. కాని ఇవ్వాళే వుద్యోగం మానెయ్యాల్సినంత ఏముంది అందులో. చాలా రోజులుగా ఈ ఉద్యోగ ప్రయత్నం చేస్తూండాలి. మనకి చెప్పలేదంతే. అంది అన్నపూర్ణమ్మ."

"నాతోనన్నా చెప్పదా?''

"ఎందుకు చెబుతుంది? అయినా ఏ వుద్యోగమూ రానిదే ఎందుకు చెప్పడం అని ఊరుకుని వుంటుంది. ఇందులో రంగారావుగారి పాత్ర ఎంత వరకూ ఉందో!"

"నూటికి నూరుపాళ్లూ! ఆయన ఈ మధ్య మనిషి మరీ మారిపోతూన్నా రనిపిస్తూంది శశి రావడానికి ఇంకా ఎంత కాలముపడుతుంది అత్తయ్యా?"

"నిన్న వ్రాసిందిగా వుత్తరం. మూడు నెలలు పోయాకని. కనీసం శశి వచ్చేదాకా అన్నా పద్మావతి వుండాల్సింది."

"నెలవుదినాల్లో వస్తూంటుంది పద్మావతి"

"ఆమెకే తెలుస్తుందిలే మనం ఇచ్చిన వుద్యోగం విలువా, మన విలువాను. మళ్ళీ తిరిగి ఇక్కడకి వస్తుంది."

అటసంత ఏమి మాట్లాడలేదు.

పద్మావతి వెళ్ళిపోయినందుకు విచారించి కంట తడిపెట్టుకుంది అన్నపూర్ణమ్మ.

ఎంత బ్రతిమిలాడి అనునయ వాక్యాలు చెప్పినా ఆ మధ్యాహ్నం భోజనం చెయ్యలేదు పాణి.

* * *

"సింహాచలం ఇది వుంచు" అంటూ అతని చేతిలో పదిరూపాయల కాయితం పెట్టింది పద్మావతి

"అమ్మగారూ ఏదన్నా ఊరు వెళ్తున్నారా ?" అడిగాడతను. ఆమె పెట్టె బట్టలూ సర్దుకోవడం గమనించి

"నాకు వుద్యోగం వచ్చిందిగా।" అని రంగారావుకూ, తనకూ తొలినాటి రాత్రి జరిగిన సంభాషణ నెమ్మదిగా చెప్పి "ఇంకొక మూడు నెలల తర్వాత అతని చెల్లెలు వస్తుంది పాణిగారిని కాస్త కనిపెడుతూ వుంటావు కదూ ! సెలవు దినాల్లో వస్తూంటానులే." అంది పద్మావతి "

"ఇయ్యాళే వెళ్ళిపోతారా ?"

"అవును "

"వద్దండమ్మగారూ ! ఇయ్యాళకాగి రేపు వెళ్ళండి."

"ఎందుకు ?"

''అతను ఒక్క క్షణం ఆలోచించి అతి నెమ్మదిగా ఇవ్వాళ రాత్రి ఏదో ఘోరం జరుగుతుందని అనుమానంగా

ఉందమ్మా? రంగారావుగోరూ, మేనేజరూ, సాంబయ్యా, శంకరరావూ, అంతా ఏదో ఆలోచనలు చేస్తున్నారు. ఆ మధ్య ఆపరేటరుగారి మీద నిష్కారణంగా నిందమోపి ఉద్యోగం లాగేశారు కదండీ!"

"అవును. అతనికి దృష్టి సరిగ్గా ఆనటం లేదటగా!"

"అతను నాకు బాగా కనుపిస్తుందని ఏడ్చాడు కదండీ! పోనీ ఆ వుద్యోగం అతని కొడుక్కి ఇమ్మన్నాడు. ఇచ్చారా?"

"ఆ అబ్బాయి మంచివాడు కాదట. అయినా ట్రెయినింగవలేదట."

"అవన్నీ అబద్ధాలండి. అతని కుటుంబమంతా ఇంక పస్తులతో చావాల్సిందే! అతనీ మధ్య మేనేజర్ని రంగారావుగార్ని ఎదిరిస్తున్నాడు అమెరికానుండి రమేశ్‌బాబుగారు రానివ్వండి మీ బండారం బయట పెడతానని బెదిరించాడు."

"ఎప్పుడు జరిగినదిదంతా! నాకు తెలిసినది ఆయనకు దృష్టి ఆనడంలేదు కాబట్టి కొత్తాయన్ని వేశారని పాణిగారు ఆపరేటరుగారికి నెలనెలా కొంత పెన్షనివ్వాలనుకుంటున్నారే?"

"ఆ బాబుమనసు అమృతం. అతనికి కళ్ళే ఉంటే ఈ నక్కల్ని చేరనిచ్చేవాడా? ఎవరి మాటలూ నాకు పూర్తిగా అర్థం అవలేదు కాని అతన్ని వదిలి మీరు ఎటూ వెళ్ళడం నాకు ఇష్టం కాదు. ఇవ్వాళ ఏదో కుట్ర జరుగుతుందని అనుమానంగా ఉంది. నాలుగురోజుల నుంచీ వసూళ్ళేవీ పాణిగారికి అందలేదు ఆ సంగతి మీకూ తెలిసే ఉంటుంది."

"నాలుగైదు రోజులకోసారి చెల్లించటం ఇవ్వాళ కొత్త కాదుగా!"

"కొత్త సినిమా తెచ్చారుకదా! బాగా కలక్షనయింది లారీలు కూడా బాగా తిరిగాయి. ముప్పై నలభై వేలుంటుంది. పాణిగార్ని లేరనిపించి ఈ డబ్బు వీళ్ళు పంచుకుంటారేమో!"

అదిరిపడింది పద్మావతి. "సింహాచలం!" అంది వణికే గొంతుతో

"అందుకే నమ్మా! మీరు ఎటూ వెళ్లొద్దు."

బాతూ, బంగారు గుడ్డూ. కథలా ఎంతకి తెగించారీ స్వామిద్రోహులు? అతని ప్రాణం పోయిన మరుక్షణంలో సినిమాహాలు మూత పడుతుంది. బస్సులూ, లారీలూ, ఆగిపోతాయి. వీళ్ళ కేంలాభం?

(సశేషం)

Printed and Published by A. Chandrasekhar Rao at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500 001, Editor A SUDHAKARA RAO